# భారత కమ్యూనిస్టుపార్టీ ★

# ★ రాజకీయ విధానం

Translation to "Political Thesis"

. . . Published by . . .

Peoples Publishing House Ltd.,

. . . Bombay . . .



కలకత్తా కాంగ్రెసులో— ఫ్రిబవరి 28
నుండి మార్చి 6, 1948 వరకు జరిగిన
నమావేశంలో— ఆమోదింపబడినది



TRILINGA PUBLISHING CO.

: VIJAYAWADA :

1949

# ౧ అంతర్జాతీయ పరిస్థితి

హిట్లరు జర్మనీ, ఫాసిస్టుజపానూ రెండవ ప్రపంచ యుద్ధంలో ఓడిపోవడంతో, అంతర్జాతీయ పరిస్థితుల రూపు రేఖయే పూర్తిగా మారిపోయింది. నిశ్చితంగా కార్మికవర్గం వైపు, కార్మిక వర్గ విప్లవోద్యమంవైపు త్రాసు మొగ్గింది. జర్మనీ, జపానులలాంటి బలిష్టమైన ప్రతిద్వంద్వులు తొలగిపోవడంవల్ల ఇతర సామ్రాజ్యవాద దేశాలు బలపడినట్లు పైకి కన్పించవచ్చు. కాని మొత్తంమీద పరిశీలించి చూస్తే ఫలితం ప్రపంచ సామ్రాజ్యవాదం బలపడలేదు, పైగా బాగా బలహీనపడింది. బలపడింది అమెరికాసామ్రాజ్యవాదంకాదు. పైగా ప్రపంచ విప్లవోద్యమంముందు అమెరికాయే బలహీనపడింది. పెట్టుబడిదారీప్రపంచము బలపడుటకాదు జరిగింది. పైగా సోషలిస్టు ప్రపంచం బలపడింది. జాతీయస్వాతంత్ర్యంవైపు సోషలిజంవైపు ముందడుగిడుచున్న ప్రజలు ప్రజాఉద్యమాలు బలపడ్డాయి.

విప్లవశక్తుల బలం, అధికారం హెచ్చుటలో యీ ఫలితాలను చూడవచ్చును

యుద్ధానంతరం సోవియటు యూనియన్ పూర్తిగా బలహీనపడుతుందనీ ఆర్థికంగా పతనమైపోతుందనీ, సామ్రాజ్యవాదులు అంచనా వేసుకున్నారు. కాని ఆ అంచనా వాస్తవంలో నెరవేరలేదు. పైగా తద్విరుద్ధంగా జరిగింది.

యుద్ధంలో సోవియటు ప్రజలు అసంఖ్యాకంగా సంహరించబడ్డారు. సోవియటు సహజసంపద పరిశ్రమలు విపరీతంగా నాశనం చేయబడ్డాయి. ఇంతజరిగినా సోవియటు యూనియన్ యుద్ధానంతరం బలోపేతదేశంగా బయటపడ్డది. సోవియటును ప్రపంచ ప్రజలంతా హర్షించసాగారు. పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా ప్రజాసామాన్యం సాగించే పోరాటంలో కార్మికవర్గాన్ని సమీకరించే కేంద్రంగా సోవియటు తయారైంది. సోవియటు సైన్యం, సమస్తదేశ ప్రజానీకంలోను ఆత్మవిశ్వాసం కలిగించింది. సామ్రాజ్యవాదుల సైన్యం, అభేద్యమనడం మిధ్యతప్ప మరేమీకాదని ఋజువుచేయబడింది.

సైనిక, ఆర్థిక, నిర్మాణ, పారిశ్రామిక విషయాలలో సోవియటు ప్రతిష్ఠ అత్యద్భుతంగా హెచ్చింది. పెట్టుబడిదారీ దేశాలలో సోవియటు ప్రతిష్ఠ అత్యద్భుతంగా హెచ్చింది. పెట్టుబడిదారీ దేశాలలోని ప్రజలు పెట్టుబడిదారీ సమాజంలోని అరాచక జీవితంతో, సోవియటు యూనియన్‌లోని సంఘటితమైన ప్లానుప్రకారం నడిచే జీవితంతో పోల్చి చూచుకొంటున్నారు.

రెండవది : తూర్పు యూరపులో నూతన ప్రజాతంత్ర రాజ్యాలు తలయెత్తినవి. ఈదేశాలలో ప్రజలదే అధికారం. ఇక్కడ భారీపరిశ్రమలు, రైల్వేలు, రవాణాసాధనాలు, బాంకులూ ప్రభుత్వం చేతులో ఉన్నాయి. ఈప్రభుత్వాలలో కార్మికవర్గ నాయకత్వంక్రింద కష్టజీవులైన తరగతుల సంఘటన ప్రముఖపాత్ర నిర్వహిస్తూంది. ఇలాంటి నూతన ప్రజా

తంత్రాల స్థాపన ప్రపంచ పెట్టుబడిదారీవర్గానికి గొడ్డలి పెట్టయినది. బ్రిటనూ ఫ్రాన్సులలో కలిపి ఉన్నంత జనాభాగల ఒక పెద్ద భూభాగం పెట్టుబడిదారీ విధాన పరిధినుంచి తెంచి వేసుకొని సోషలిష్టు పంథాలో బలంగా కాలూని పురోగ మిస్తున్నది.

సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధాన పరిధినుండి ఈదేశాలు విడివడడంతో సామ్రాజ్యవాదం మరింత బలహీన పడింది. తూర్పుయూరపు దేశాలలో ప్రజాతంత్ర ప్రభుత్వాలు నెలకొల్పబడినాయి. ఈప్రజాతంత్ర ప్రభుత్వాలు, పీడకవర్గాలయొక్క రాజకీయ, ఆర్థిక అధికారాన్ని కూల ద్రోశాయి. కార్మికులు, రైతులు అణచబడిన మధ్యతరగతి ప్రజల సమ్మేళన ప్రాతిపదికతో ప్రభుత్వాధికారం ప్రజల హస్తగతమైంది. ఈవిధంగా ప్రపంచ సోషలిస్టు రంగాన్ని అవి బలపరచాయి. 1917 రష్యన్ విప్లవం సామ్రాజ్యవాదంలో కొట్టిన గండిని ఇవి మరింత పెద్దది చేశాయి.

యూరప్ ఖండంలో కార్మికవర్గ పురోగాములైన కమ్యూనిస్టుపార్టీల బలం అత్యధికంగా పెరగడం, కార్మిక వర్గం వాటివెనుక బాగా ఐక్యమవడం, కార్మిక వర్గ విప్లవో ద్యమం బలపడటాన్ని సూచిస్తున్నాయి, పెట్టుబడిదారీ విధా నం బలహీన పడటాన్ని సూచిస్తున్నాయి. తూర్పు యూరప్ లోనే గాకుండా, ఫ్రెంచి యిటాలియన్ కమ్యూనిస్టుపార్టీలు తీవ్రంగా బలపడటానికి కారణం, ఫాసిజానికి వ్యతిరేకంగా సాగించిన విప్లవపోరాటంలో అవి గొప్ప పాత్రను ప్రదర్శిం చడం వల్లనే.

ఈమహత్తరమైన బలాన్ని ఆయా కమ్యూనిస్టుపార్టీల సభ్యత్వపు పెంపుదలలోనేగాక అవి నడుపుతూన్న ప్రజా సంఘాల పెంపుదలలోకూడా చూడాలి; పార్లమెంటు ఎన్నికలలో మిగిలిన ఏపార్టీలకన్నాకూడా స్థానాలు సంపాదించాయి.

ఈ దేశాలలో కమ్యూనిస్టుపార్టీల అభివృద్ధి, కార్మికవర్గ బలాన్ని ప్రస్తుత ప్రభుత్వాల అస్థిరత్వాన్నీ, విప్లవఘటనల పరిపక్వతనూ ప్రతిబింబించుతూంది. యుద్ధానికి ఉన్నస్థితికి తిరిగి పెట్టుబడిదారీవర్గ ఆర్థికరాజకీయ ప్రాబల్యాన్ని (బాలెన్సు)మితవాద పార్టీలు తిరిగి నెలకొల్పగలగాలంటే, ఆర్థిక సంక్షోభం వల్ల కలిగేభారాన్ని పాలకవర్గం కార్మికవర్గంపై రుద్దాలంటే అది కార్మికులతో పెద్దపెద్ద పోరాటాలను సాగించవలసి యుంటుంది. ఈ పోరాటాలలో కార్మికవర్గ శక్తి చాలా గొప్పదీ, బలిష్టమైనదీ. ఈ కొత్త దాడిని ఓడించగల స్థితీ, ప్రస్తుత దశలోని విప్లవ కర్తవ్యాలను పరిష్కరించగలశక్తీ, కార్మికవర్గానికి ఉంది.

యూరపులో పెట్టుబడిదారీవిధానం అంతా సర్వనాశనం అవుతున్న స్థితిలోవుంది. తీవ్రఅసంతృప్తి జ్వాలలకూ, పెట్టుబడిదారీ పరిపాలనకూ మధ్యగా బ్రిటన్‌లో లేబర్ ప్రభుత్వం నిలబడివుంది. అమెరికా రోజురోజుకూ ఆర్థిక సంక్షోభం అనే ఊబిలోకి దిగబడుతూవుంది. ప్రపంచమంతటా మార్కెట్లకోసం అది గాలించుతోంది. తన దేశప్రజల జీవన స్థాయిపై దాడిచేస్తోంది. ఈ ఆర్థిక సంక్షోభం, సామాన్య ప్రజలకూ, ఆర్థిక నిరంకుశ ప్రభువులకూ మధ్య కొత్తకొత్త పోరాటాలకు దారితీస్తున్నది.

చైనా ప్రజల దాస్యవిముక్తికై చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సాగుతూన్న విజయవంతమైన పోరాటం, ప్రపంచ సామ్రాజ్యవాద అస్తిత్వానికి మరొక గొడ్డలిపెట్టు పెడుతోంది. ఆశియా రాజకీయ రూపురేఖనే మార్చబోతూంది. సామ్రాజ్యవాదులను, వారి కీలుబొమ్మలను వలస దేశాలనుండి పారద్రోలడానికి మార్గం సుగమం చేస్తూంది. రోజు రోజూ జంగ్-కై-షేక్ సైన్యాలు సర్వనాశనం కావడం, అమెరికా సామ్రాజ్యవాద విధానం ఓడిపోవడం, ఏమి తెలియజేస్తున్నాయి? సామ్రాజ్యవాదుల ఉద్దేశాలు, విధానాలు కొనసాగవనీ, స్వాతంత్ర్యంకోసం పోరాడే ప్రజానీక రూపంలోవున్న పెద్ద అవరోధాన్ని అవి ఎదుర్కోవలసి వస్తుందని తెలియజేస్తున్నాయి.

## సోషల్ డెమాక్రెట్ల పాత్ర

విప్లవ ఘటనల పరంపరతో ఈఫలితం నిర్ణయమైపోయే నూతన దశలో, సోషల్ డెమాక్రాట్ల పాత్ర ఏమిటి? సాంప్రదాయసిద్ధంగా వారు బూర్జువాతో కట్టుకొని ప్రేలాడే రకం. ఇప్పుడుకూడా మామూలుగానే వారు బూర్జువాకు తొత్తులయి, బానిసలయి, విద్రోహకరమైన పాత్రను వహించు తున్నారు.

యుద్ధం జరిగే రోజుల్లో సోషల్ డెమాక్రెటిక్ నాయకులు ఆంగ్లో అమెరికన్ దురాక్రమణ సైన్యాలపైన ఆధారపడ్డారు. పూర్వావు అభివృద్ధి నిరోధకులైన సామ్రాజ్యవాద ఏజంటులైన బొడొగ్లియో, మైహైలొవిచ్, మైకొలజిక్ మొదలైన వాళ్లను ప్రజల స్వాతంత్రోద్యమాలకు వ్యతిరేకంగా బల

పరిచారు. ఇలా ఫాసిస్టులకు వ్యతిరేకంగా జరుగుతూన్న సాయుధ విప్లవ స్వతంత్రపోరాటాలను కుంటుపరిచారు; ప్రజల చొరవకు కళ్లాలు బిగించాలని ప్రయత్నించారు.

ఈనాడు ప్రతి దేశంలోనూ, పెట్టుబడిదారీ పరిపాలనకు వ్యతిరేకంగా పోరాటం జరపాలన్నది నిశ్చితమైన సమస్యగా వుంది. అలాంటి యీ సమయంలోకూడా, సోషల్ డెమాక్రెటిక్ నాయకులు నిజమైన సంస్కరణవాదులుగా బయట పడు తున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థకు అనుకూలిస్తున్నారు. పెట్టుబడిదారీవిధానాన్ని సమర్థిస్తూ వకాలతా పుచ్చుకొన్నవారు తాము తటస్థపక్షం (థర్డ్ ఫోర్సు — అటు కమ్యూనిజమూ, ఇటు ఫాసిజమూగాక మూడవపార్టీ అని చెప్పుకొంటారు) అని వంచన చేస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీపైనా, కార్మిక వర్గం పైనా వీరు నిప్పులు కక్కుతున్నారు.

యుద్ధానంతరం జరిగిన ఎన్నికలలో, అనుక్రమతంగా వస్తున్న బూర్జువా పార్టీలపై ప్రజానీకానికి ఉన్న అసంతృప్తిని ఉపయోగించుకొని పార్లమెంటులలో మెజారిటీలను సంపాదించారు (బ్రిటన్). తమ అనుచరులు ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో పాల్గొని గడించిన ప్రతిష్ఠను సోషల్ డెమాక్రెటిక్ పార్టీనాయకులు ఉపయోగించుకొని ప్రభుత్వాలలోకి రాగల్గారు. తద్వారా కార్మిక వర్గాన్ని చీల్చగల్గారు.

తమ పెట్టుబడిదారీ యజమానుల అవసరాల కనుగుణంగా, సోషల్ డెమాక్రెటిక్ నాయకులు అనుసరించు తున్న పంథా ఏమిటి? కార్మికవర్గజీవన స్థాయిపై దాడిచేస్తున్నారు. ఆర్థిక సంక్షోభపు భారాన్ని కార్మికులపైకి నెట్టుతు

న్నారు. మార్కెట్టుకోసం వెర్రెత్తినట్లు గాలిస్తున్నారు. కార్మిక వర్గాన్ని ప్రజలను అణచివేస్తున్నారు. ప్రజాతంత్రి హక్కులపై దాడిచేస్తున్నారు. సోవియటుకూ, సోషలిజానికీ, విప్లవానికీ విరుద్ధమైన పాలసీల నవలంబించుతున్నారు. పెట్టు బడిదారీ వ్యవస్థను సంరక్షించే పాలసీని ప్రజలను యింకో యుద్ధంలోకి దింపే పాలసీని వారు అవలంబించుతున్నారు.

సోషల్ డెమాక్రొటిక్ మితవాదనాయకులు యుద్ధానంతరం తిరుగుబాటు చేసిన వానిసదేశ ప్రజలపైన పెద్ద ఎత్తున దాడిసాగించడానికి అతిక్రూరమైన హింసావిధానంతో వారిని అణచివేయడానికి పథకాలను అమలు పరచారు. ఇలా మిలటరీబలంతో అణచివేయడమేగాకుండా సామ్రాజ్యవాద వానిసత్వాన్ని కొనసాగించటంలో కొత్త పద్ధతులవలంబించారు. ఆ వానిస దేశాలలోని జాతీయ బూర్జువావర్గాన్ని పొత్తు కలుపుకొని దాన్ని స్వతంత్రం అని బూటకపు పేరున పిలవడం, బ్రిటిష్ లేబరు ప్రభుత్వం అలాంటి బూటకపు "స్వతంత్రాన్నే" యిండియా, పాకిస్థాన్, బర్మా మొదలైన దేశాలకు ప్రసాదించింది.

ఫ్రెంచి సోషలిస్టు ప్రభుత్వం ఫ్రెంచిసామ్రాజ్యాన్ని రక్షించడానికి సాయుధ సైన్యాలనుపయోగించి వియట్నాం ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని అణచివేస్తూఉంది. డచ్చి సామ్రాజ్యవాదం ఇండోనేషియాలో జరిపే వలస రాజ్య యుద్ధాన్ని డచ్చిలో సోషలిస్టులు సంపూర్ణంగా బలపరుస్తు న్నారు.

ఈ ఆశయసిద్ధికై అమెరికా సామ్రాజ్యవాద ఆజ్ఞను

బద్ధులైన సోషల్ డెమాక్రెటిక్ నాయకులు, అభివృద్ధి నిరోధకులైన మితవాద నాయకులతో కలిసి కుట్రపన్ని, ప్రభుత్వాల నుండి కమ్యూనిస్టులను బయటకు నెట్టారు. అభివృద్ధినిరోధక ప్రభుత్వాలకు మార్గం సుగమం చేయడానికిగాను, తాత్కాలిక మిశ్రమ ప్రభుత్వాలను బూర్జువాపార్టీలతో కలిసి ఏర్పరచారు. ప్రస్తుత వ్యవస్థను నిలబెట్టటానికై అమెరికా డబ్బు పైన, ఋణాలపైన, దాని దయాదాక్షిణ్యాలపైన ఆశపెట్టుకొని కూర్చున్నారు. విప్లవాత్మకమైన ప్రజా అసంతృప్తిని దెబ్బ తీయడానికి తమ పలుకుబడిని ఉపయోగించుతున్నారు. సోవియటు వ్యతిరేకత, కమ్యూనిస్టు వ్యతిరేకత, పెట్టుబడిదారీ విధాన సమర్థన — ఇవీ సోషల్ డెమాక్రెటిక్ నాయకత్వం యొక్క పాలసీలను అర్థంచేసుకోవడానికి ముఖ్యమైన మాంశాలు.

## వర్గశక్తుల నూతన సమ్మేళనం

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం ముగియుటతో, ఆ విధంగా వర్గశక్తులు మరో నూతన సమ్మేళనానికి దారి తీసాయి. బూర్జువావర్గంలోని కొన్ని భాగాలు, వారి తోకపట్టుకుని వ్రేలాడే సంస్కరణవాదులు, ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన సమిష్టి యుద్ధంలో ప్రజల పక్షాన చేరారు. యిపుడు ఆ పూర్వపు ముఠాస్థానే మరొక కొత్తముఠా వచ్చింది. ఇందులో ప్రపంచ బూర్జువాఅంతా ఆ బూర్జువాతోకపట్టుకొని, వ్రేలాడే సంస్కరణవాదులు మొదలుకొని, అభివృద్ధినిరోధకులూ బూర్జువాను సపోర్టుచేసే వారివరకూ అంతా కలసి ఒక కూటమిగా తయారవటానికి ప్రయత్నించు తున్నారు. విప్లవ వెల్లువను అరికట్టి

డానికి కార్మిక వర్గాన్ని, ప్రజలను, సోషలిస్టు సోవియటుయూని యన్‌నూ, తూర్పుయూరప్ ప్రజాతంత్ర రాజ్యాలను, వలస దేశప్రజలను, ఎదుర్కోడానికి యీకొత్తముఠా ప్రయత్నించు తూంది.

ముంచుకువస్తూన్న ఆర్థిక సంక్షోభమూ తక్షణ విప్లవ ప్రమాదమూ, యీ కొత్తసమ్మేళనానికి ప్రధాన కారణాలు. బూర్జువారాజ్యాలు సోవియటుకు వ్యతిరేకంగా కుట్రచేయటా నికికూడా కారణం ఇదే ప్రజాతంత్రదేశాలను వ్యతిరేకంగా మిత్రరాజ్యసమితిలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదం తమ మెజారిటీని పదేపదే ఉపయోగించడానికికూడా కారణ మిదే.

ప్రజాయుద్ధకాలంలోసైతం, సోషలిస్టు ప్రపంచానికీ, పెట్టుబడిదారీ ప్రపంచానికీగల వైరుధ్యం పెరుగుతూనేవచ్చింది. (రెండవరంగం తెరవకుండా ఆలస్యంచేయడం, సోవియటు యూనియన్‌ను పూర్తిగా ఓడించివేయడానికి ఆంగ్లో - అమెరి కన్ కుట్ర - అనగా హిగాల్, బడోగ్లియోలాంటి అభివృద్ధి నిరోధకులను బలపరచడం) యుద్ధం ముగియుటతోనే ఆర్థిక సంక్షోభం హఠాత్తుగా విరుచుకుపడి ఈ వైరుధ్యం మరింత నిశితంగా తీవ్రరూపందాల్చింది.

ప్రతిదేశంలోను బూర్జువా పార్టీలయొక్క తోక బట్టు కొని వ్రేలాడే సంస్కరణవాదులయొక్క పోకడ ఏమిటంటే: స్వదేశంలోనూ, విదేశంలోనూ విప్లవాన్ని ఎదిర్చి పోరాడటం. అందువల్లనే ఈనాడు ప్రపంచం రెండు పక్షాలుగా చీలింది. సోవియటు యూనియనూ, తూర్పు యూరప్ దేశాల

నాయకత్వాన పోరాడే ప్రజలు ఒకపక్షం, సామ్రాజ్యవాదులూ, వారి ఏజంట్లూ మరొకపక్షం.

సామ్రాజ్యవాదపక్షం యొక్క నాయకత్వం అమెరికా సామ్రాజ్యవాదంచేతిలో ఉంది. తన పూర్వపు సామ్రాజ్యవాద దేశాలకంటే ఎంతో ఎక్కువగా అమెరికా బలపడింది. బ్రిటన్‌కంటె అమెరికా ఎంత ముందుకు పోయిందంటే, యీనాడు అమెరికావాకిట బ్రిటన్ బిచ్చమడుగుతూ నిలబడుతూంది. మార్కెట్లదాహం తెగపెరిగింది. అమెరికాకు ప్రతిద్వంద్వులు తొలగి దూరంగా వుండటంవల్ల యుద్ధకాలంలో అమెరికా తన సంపదలను బాగా అభివృద్ధి చేసుకోగల్గింది. తత్ఫలితంగా యీనాడు అమెరికా ఉత్పాదకశక్తి అనంతంగా పెరిగింది.

దానితోపాటు మార్కెట్ల అవసరం మార్కెట్లకోసం దుర్దాహంకూడా పెరిగింది. వలసదేశాలపై పెత్తనంకోసం కాంక్ష ప్రబలింది. ఆవిధంగా అమెరికా తన ఆర్థిక సంక్షోభాన్నుండి తప్పించుకోడానికి – అది వలస దేశం కానీయండి, పారిశ్రామిక దేశంకానీయండి, ఏదేశ ప్రభుత్వాన్నైనా సరే తమక్రిందకు లాంగదీసుకొని, కీలక యుద్ధ కేంద్రాలను సంపాదించడానికి అమెరికా తాపత్రయ పడుతోంది.

అమెరికా కబంధుడు అన్ని పెట్టుబడిదారీ దేశాలను మ్రింగివేస్తున్నాడు. అమెరికా ఆర్థిక పరిపాలనకు ఒక దేశం తర్వాత మరొక దేశం లొంగిపోతూఉంది. పెట్టుబడిదారీ ప్రపంచ పాలశీలను నిర్ణయించడంలో ప్రముఖ అంశమై

నది అమెరికా. ఇదీ నూతన పరిస్థితులలో గమనించవలసిన ప్రధాన అంశాలలో ఒకటి.

అన్నిదేశాల స్వేచ్ఛా స్వతంత్రాలను నాశనంచేయుట ద్వారానే, ప్రపంచమంతటా అభివృద్ధి నిరోధకఫాసిస్టునియంతృత్వంస్థాపించుటద్వారానే,అమెరికాసామ్రాజ్యవాదం నిలబడుట గాని, విస్తరించటం గాని జరుగుతుంది. పాతవ్యవస్థను నిలబెట్టు కొనేందుకై, అమెరికా సామ్రాజ్యవాదం మానవజాతి కంతకూ బహిరంగశత్రువుగా ముందుకు వచ్చింది.

అందుచే, అమెరికా సామ్రాజ్యవాదం మొదల వహించే వైఖరిని బట్టి వర్గాలయొక్క, రాజకీయపార్టీలయొక్క నాయకులయొక్క, సంఘాలయొక్క పాత్రను అర్థంచేసు కోవాలి.

దీనితోబాటు వెనువెంటనే వివిధ సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు కూడా పెల్లుబికాయి, జపాను, జర్మనీలు రంగంనుండి వైదొలగినా, బ్రిటను - అమెరికాల మధ్య స్పర్థ పరిష్కారం కాకపోగా మరింత తీవ్రమైంది. ఇవి రెండూ ప్రపంచంలో ప్రతి భాగంలోను పరస్పరం ఘర్షణపడవలసి వస్తూఉంది. పడమటి ఆశియాలో నూనెకోసం ఘర్షణపడు తున్నవి. ఆగ్నేయ ఆశియాలో ఫ్రెంచి యిండోచైనాలో ప్రాబల్యంకోసం కీచులాడుకొంటున్నారు. యూరపులో అమెరికా డాలరు రోజురోజుకూ బ్రిటిషుస్టెర్లింగును నెట్టివేస్తూ ఉంది.

అమెరికా సామ్రాజ్యవాదం బ్రిటిషు పెద్ద వ్యాపారస్తులు యుద్ధకాలంలో పూర్తిగా దెబ్బతినిపోయిన పరిశ్రమ

లను (ఉదా: నౌకానిర్మాణం) పునర్నిర్మించడానికి వేసిన ప్లానులను తొక్కిపడుతూ ఉంది. తానిచ్చే అప్పులను పుచ్చుకొనేవాడు కోలుకోలేని షరతులను పెడుతూ ఉంది. ఋలా కొరడా చేతపుచ్చుకొని తన సామ్రాజ్యచక్రంలోకి లాంగి వచ్చి రెండో అంతస్థులో తనకు ఉపగ్రహంగా ఉండేట్లు అమెరికా బ్రిటనుపైన ఒత్తిడి తెస్తున్నది.

అమెరికామీద నేడు బ్రిటన్ ఆధారపడి ఉండటం చేత ఇద్దరిమధ్యా పోటీలను సర్దుబాటు చేసుకొంటున్నాయి. అయితే ఆసర్దుబాటు అమెరికాకు అనుకూలంగా జరుగుతోంది. సుంకపు ప్రతిబంధకాలను పూర్తిగా తొలగించాలనీ బ్రిటన్‌పై అమెరికా ఒత్తిడి చేస్తోంది. అమెరికా వర్తకానికి ఎక్కువ అవకాశం ఈయమనీ, ఋణాల విషయంలో అన్ని రకాల షరతులనూ అంగీకరించమనీ, బ్రిటీష్ వలస దేశాలు అమెరికాపై ఆధారపడేటట్లు చేయటానికి అమెరికా బ్రిటన్‌పై ఒత్తిడి తెస్తోంది. బ్రిటన్ పెట్టుబడిదారీ దేశంగా ఉన్నంత కాలం దానికి మరోగత్యంతరం లేదు. అందుచే అది అమెరికాతో కష్టుకు నడువక తప్పడం లేదు.

ఈవిధంగా ఆరెండు దేశాల స్పర్థలను పరిష్కరించడంవల్ల బ్రిటీషు ప్రజాసామాన్యంయొక్క పరిస్థితి మరీ విషమిస్తోంది. బ్రిటిష్ ఆర్థికాభివృద్ధి అరికట్టబడుతుంది. దీనివల్ల బ్రిటీష్‌కార్మిక వర్గం ఎక్కువ చైతన్యంతో పట్టుదలతో బ్రిటన్ అమెరికన్ కూటముపై పోరాడుతారు. ఆవిధంగా సోవియటుకు వ్యతిరేకంగాను, ప్రజాతంత్ర విప్లవానికి వ్యతిరేకంగాను

ఇంగ్లాండు అమెరికాల సహకారంయొక్క పునాది దిన దినం ప్రజాస్వామ్యానుభవంవల్ల బలహీన పడుతుంది.

## సామ్రాజ్యవాద మార్గం

అమెరికా సామ్రాజ్యవాద అస్తిత్వానికే ప్రమాదం కల్గించే బ్రహ్మాండమైన విప్లవ వెల్లువ విజృంభించుతోంది. యూరప్‌లో పెట్టుబడిదారీ విధానం పూర్తిగా కూలిపోతోంది. బడా పెట్టుబడిదారుల నెదుర్కొని కార్మికవర్గమూ ప్రజానీకమూ కొత్తగా అనేక విజయాలను సాధిస్తున్నారు. అమెరికాలో పెట్టుబడిదారీ ఉత్పత్తి పడిపోయే ప్రమాదం ఏర్పడుతోంది. ఇట్టి స్థితిలో పెట్టుబడిదారీ విధాన శ్రేయస్సుకై, ప్రస్తుత సంక్షోభం నుండి బయటపడటానికి అమెరికా సామ్రాజ్యవాదం మార్గం వెదుకుతోంది.

పశ్చిమ యూరప్‌లోని అభివృద్ధి నిరోధకమైన పెట్టుబడిదారీ ప్రభుత్వాలను పశ్చిమరాజ్య కూటమిగా నిర్మించడానికి ముఖ్యంగా మార్షల్ ప్లానును అమలు జరుపుతూంది. అమెరికా సామ్రాజ్యవాదపాదాలముందు పశ్చిమ యూరోపు రాజ్యాలను కాళ్లుచేతులు కట్టి పడవేసే యీకూటమిలో పారిశ్రామిక పునర్నిర్మాణం జరిగిన పడమటి జర్మనీ కీలక స్థానం వహిస్తుంది. యీపడమటి జర్మనీని అమెరికా గుత్త వ్యాపారసంస్థలు నేరుగాను, యింకా బ్రతికున్న ఫాసిస్టుల ద్వారాను కంట్రోలు చేస్తున్నాయి.

పడిపోతున్న పెట్టుబడిదారీ బూర్జువా ప్రభుత్వాలను నిలబెట్టడానికి విప్లవాన్ని ఎదుర్కోడానికి, పెట్టుబడిదారీ విధా

నాన్ని నిలబెట్టడానికీ మార్షలు ప్లాను అమెరికా ముందుకు నెడుతూఉంది. మార్షలుప్లానువల్ల అమెరికా సామ్రాజ్యవాదానికి యితర పెట్టుబడిదారీ దేశాలు తమ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని అమ్ముకోవలసి వస్తున్నది. అమెరికా అదనపు వస్తువులకు అవి తమ మార్కెట్టులలో చోటుచూపించవలసి వస్తున్నది. యిలా ఆచరణంలో అవి అమెరికాకు వలసరాజ్యాలై పోతున్నవి.

మార్షల్ ప్లానుద్వారా ఇచ్చే "సహాయం"కు బదులుగా అమెరికా కోరుతున్న దేమిటి? కార్మికవర్గాన్ని తుదముట్టించేవరకు పోరాడవలసిందని అధికారంలోనున్న అభివృద్ధి నిరోధక బూర్జువా ప్రభుత్వాలను కోరుతూంది. (గ్రీసులో ఫాసిస్టు ప్రభుత్వం యిందుకు ఉదాహరణ) కమ్యూనిస్టుపార్టీలను ఎదుర్కోమంటున్నది. ఫాసిస్టు దాస్యంనుండి విముక్తి చెందిన తర్వాత ఆయాదేశాలలో ప్రజలు సాధించిన విజయాలను తిరిగి లాగివేయమని కోరుతోంది. యివన్నీ అమలు పరచాలంటే, ప్రజానీకాన్ని దారుణంగా అణచివేయుగల ప్రిభుత్వం కావాలి. అలాంటి ప్రభుత్వాన్ని ఎక్కడైనాసరే సపోర్టుచేయటానికి అమెరికా సామ్రాజ్యవాదం సిద్ధంగా ఉంది.

ట్రూమన్ విధానమూ, మార్షల్ప్లానూ దీనిపైనే ఆధారపడ్డాయి. ఇవి అమెరికా దురాక్రమణకు సాధనాలు.

ఆర్థికంగా, మార్షల్ప్లాను ఆశయం ఏమిటి? యూరప్‌లో అభివృద్ధి నిరోధకప్రిభుత్వాలకు అమెరికా ఋణాలద్వారా ఆర్థికసహాయం చేయడం అలాంటి సహాయాన్ని యిచ్చిన దేశంలో అమెరికా తన వస్తువులను అమ్ముకొనుటకు మార్కెట్టును సంపాదించుకొంటుంది. ఈ ఆర్థిక సహాయం ద్వారా

ఆవిధంగా అధికోత్పత్తి సంక్షోభాన్ని తగ్గించుకోడానికి అమెరికాకు మార్షల్‌ప్లాను ఉపయోగపడుతుంది.

రాజకీయంగా మార్షల్‌ప్లాను ఆశయమేమిటి? ప్రజాతంత్ర ప్రతికూలమైన అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలకు సహాయపడే ప్రయత్నం యిది. ఈ అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలు, అభివృద్ధినిరోధక పెట్టుబడిదారీ జమీందారీ స్వార్థపరాయణ వర్గాలపై ఆధారపడి అమెరికాసామ్రాజ్యవాదానికి కీలుబొమ్మలుగా పనిచేయగలవు. తమ రాజకీయస్వాతంత్ర్యాన్ని అమెరికా సామ్రాజ్యవాదానికి అమ్ముకోగలవు. అమెరికా సహాయం అంటే మామూలుగా ఆ యా దేశాల ఆర్థిక జీవితంపై అమెరికా సామ్రాజ్యవాదపు పెత్తనం నెలకొల్పడం అన్నమాట. తమ తమ దేశాలలో అమెరికా ఆజ్ఞానుబద్ధులై కార్మికప్రజానీకాన్ని, ప్రజాస్వామిక శక్తులనూ అణచివేసేందుకు సిద్ధపడే పార్టీలే యీనాడు గాకపోతే రేపు అధికారంలో ఉంటాయన్నమాట.

మార్షల్‌ప్లానుకు మరొక లక్ష్యంకూడా ఉన్నది. అది పశ్చిమ యూరప్ కూటమిని, సోవియటుకు వ్యతిరేకంగా నిర్మించడం అమెరికా సహాయంపై ఆర్థికంగాను, రాజకీయంగాను, ఆధారపడే దేశాలతో ఈ పశ్చిమరాజ్య కూటమిని ఏర్పరచాలని ఉద్దేశ్యం. పశ్చిమజర్మను అమెరికా ప్రోద్బలంతో తిరిగి కోలుకొన్న జర్మన్‌ఫాసిస్టు అభివృద్ధినిరోధకులూ, ఈకూటమిలో ప్రముఖపాత్ర వహించడానికి నిర్దేశించబడ్డారు.

మితవాద పార్టీలు యిప్పటికే అపఖ్యాతిపాలై యుండడంవల్ల, అమెరికా, కొన్ని దేశాలలోని సోషల్‌డెమాక్రెటిక్

పార్టీలపై ఆధారపడుతూంది. తన పనిని నిర్వర్తించడానికి అది సోవియట్ వ్యతిరేక, కమ్యూనిష్టు వ్యతిరేక, విప్లవ వ్యతిరేక విధానం అనుసరిస్తున్న సోషల్ డెమాక్రాట్లపై ఆధారపడుతూంది. అమెరికా యిచ్చే తక్షణసహాయమూ అమెరికాతోటి ఆర్థిక సంబంధవ్యవహారాలూ, సోషల్ డెమాక్రాట్ల విద్రోహానికి పునాది అవుతోంది. అమెరికా సహాయం ప్రజానీకాన్ని మోసగించడానికి వారికొక ఆయుధంగా ఉపయోగపడుతుంది. ప్రజల ఆకలిబాధ, నిరుద్యోగం మొదలైన వాటిని అవకాశంగా తీసికొని, అమెరికా సహాయం తప్పక తీసుకోవాలని వారు ప్రదర్శనంచేయ మొదలెడతారు.

కార్మిక వర్గాన్ని చీల్చడానికి ప్రథమఆయుధంగా సంస్కరణవాద పార్టీలను ఉపయోగించుకొని ఆయా దేశాలను ఫాసిస్టుపంథాను నడిపించడానికి పూనుకొంటున్నది అమెరికా.

దానితోబాటు అమెరికా సామ్రాజ్యవాదం, డీగాల్ లాంటి ఫాసిస్టులను బలపరిచి సాయుధులను చేస్తోంది. ఈనాడు డీగాల్ అపఖ్యాతికి పాలైన వాడైనా ప్రజాఉద్యమం అణచివేయబడినపుడు, లేదా బలహీనపడినపుడు ఇతడు తగుదునమ్మా అంటూ పైకివస్తాడు.

కూలిపోతున్న పెట్టుబడిదారీ వ్యవస్థకు ఈవిధమైన సహాయం యిచ్చుటద్వారా అమెరికా సామ్రాజ్యవాదం, సోవియటుయూనియన్‌కు వ్యతిరేకంగా సోషల్ డెమాక్రేట్లను బూర్జువా పార్టీలను కూడగట్ట ప్రయత్నించుచున్నది. సోవియట్‌తో, తూర్పుయూరప్ ప్రజాతంత్ర దేశాలతో పోరాడటానికి పైన ఉదహరించినపక్షాలను పశ్చిమయూరప్ కూటమి

లోకి లాగ ప్రయత్నించుతోంది. పెట్టుబడిదారీ ఫాసిస్టు జర్మనీ పునర్నిర్మాణం, సోవియటుపై దాడిచేయుటకుగానూ, యుద్ధాన్ని ప్రారంభించడానికిగాను పశ్చిమ యూరప్ కూటమిని నిర్మించడం సామ్రాజ్యవాద ప్లానులోని అంతర్భాగాలే. ప్రజలను పీడించి తమఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించుకోడానికి వేసినప్లానులోని అంతర్భాగాలే. యుద్ధప్రచారం సాగించబడుతోంది. ఆటంబాంబు బెదరింపును పదేపదే వల్లిస్తున్నారు. సోవియటు వ్యతిరేకనిందలు బూర్జువాదాడిలో ఒకభాగమయినాయి. యివన్నీ ఏమి తెలియచేస్తున్నాయి? వీలయితే, దానివల్లచేతనయితే, మరోయుద్ధం ద్వారా తన సమస్యలనుండి బయటపడటానికి సామ్రాజ్యవాదం మార్గం వెదకుతోంది. కాని సామ్రాజ్యవాద యుద్ధ ప్రేరేపకులను ప్రజాతంత్ర శక్తులు తప్పకుండా ఓడించగలవు, గనుక యుద్ధం తేవడం అంత తేలికైనదికాదు.

అందుచేత, మార్షల్‌ప్లాను అంటే సామ్రాజ్యవాదం తాను సంక్షోభంనుండి బయటబడటానికి మార్గం వెతుక్కొనే ప్లాను అన్నమాట. ప్రపంచాన్ని బానిసగా చేసే ప్లాను అన్నమాట.

## వలస దేశాలలో

యుద్ధానంతర విప్లవ దశలో, వలసదేశాలు సామ్రాజ్యవాదులకు వారి సహచరులకూ వ్యతిరేకంగా సాయుధ పోరాటమార్గం తొక్కాయి. ఈపోరాటాలశక్తీ, విప్లవోధృత కలిసి (తూర్పు యూరప్ దేశాలలోవలె) ఒక్క దెబ్బతో సంపూర్ణ ప్రజాతంత్ర ప్రభుత్వస్థాపన వెంటనే సాధ్యమైన ఆశయంగా

పరిణమించింది. సామ్రాజ్యవాదులనూ, వారితో పొత్తుకలసిన బూర్జువావర్గములనూ పడగొట్టడం, కార్మికవర్గం నాయకత్వం వహించి నడిపే కష్టజీవి ప్రజానీకానికి అధికారం హస్తగతం కావడం జరుగుతూన్నది. ఇందువల్ల సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్యం సమకూరటమే గాకుండా పెట్టుబడిదారీ వ్యవస్థను నిర్మూలించి సోషలిజాన్ని నిర్మించే అవకాశ మేర్పడుతున్నది.

పాలక దేశాలలోవలెనే, వలస దేశాలలోకూడ పూర్వపు సామ్రాజ్యవాదవ్యవస్థ—వలసదేశవ్యవస్థ—కూలిపోతున్నది. మొదట సామ్రాజ్యవాదులచేత, ఆతర్వాత ఫాసిస్టులచేత దారిద్ర్యానికీ, దోపిడీకీ, పూర్తిగా గురికాబడిన అనేక దేశాలలోని ప్రజానీకం జపాను ఓటమి తర్వాత తిరిగి కాలు పెట్టదలచిన సామ్రాజ్యవాదుల ప్రయత్నాన్ని ప్రతిఘటించింది. సాయుధులై ఆ ప్రజలు పోరాడారు. వీట్‌నామ్, యిండోనీషియాలు, తమ స్వాతంత్ర్యానికై యుద్ధాలు సాగించాయి. బర్మా ఆయుధాలతో పోరాటం సాగించింది. ఇండియా సాయుధ పోరాటాలను, తిరుగుబాట్లను చవిచూడసాగింది. సైనికులు, పోలీసులు, ప్రజలకు సానుభూతి చూపడం మొదలెట్టారు.

వలసదేశ విమోచనకై సాగే మహాపోరాటంలో చైనా కమ్యూనిష్టుపార్టీ, రెడ్ఆర్మీల నాయకత్వాన జరిగే అద్భుత పోరాటం దేదీప్యమానంగా వెలుగొందుతోంది. ఆసియాలోనూ, ప్రపంచంలోనూ ప్రధానమైన వలసదేశపరిపాలనపై యీ పోరాటం వజ్రాఘాతాలుతీసింది. చైనాపోరాటంలో ప్రజావిజయం ఆసియాయొక్క పూర్తి స్వరూపాన్నే మార్చి

వేయనున్నది. వలసదేశవ్యవస్థకూ పెట్టుబడిదారీ వ్యవస్థకూ పతనం తప్పదని నిరూపించుతూంది.

విప్లవవెల్లువ ఇలా ముంచుకురానడం చూచి, సామ్రాజ్యవాదం తన వలసదేశవ్యవస్థను నిలబెట్టకోడానికి నానా అగచాట్లు పడుతూంది. ప్రజలలో ఆస్కారం గల, పలుకుబడి గల మిత్రులకోసం వెదుకుతూంది. బూటకపు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో వలసదేశ ప్రజలను మోసగింప ప్రయత్నించుతోంది.

చైనాలో, అమెరికన్ సామ్రాజ్యవాదం బాహాటంగా జంగ్ - కై - షేక్ యొక్క హంతక ఉద్యమానికి ధనసహాయం చేస్తూంది. అయినా కొమింటాంగు అపఖ్యాతిపాలయిందని గ్రహించి ఇతర పార్టీలను (డెమాక్రెటిక్ లీగ్ మొదలైన వాటిని) కమ్యూనిస్టులపై ఉసికొల్పడానికి ప్రయత్నించుతూంది. కాని అది ప్రధానంగా కొమిన్‌టాంగ్ పైన, దానికిచ్చే ఆయుధబలంపైన ఆధారపడుతూంది.

ఇండోనీషియాలో బూర్జువా ఊగిసలాటను ఉపయోగించుకొని అది ప్రజల సాయుధపోరాటాన్ని నిస్తబ్ధపరచి, ఓడించి ద్రోహం చేయడానికి ప్రయత్నించింది.

యూరప్ ఖండంలో తమ ఆశయం నెరవేర్చుకోడానికి సామ్రాజ్యవాదులు మొదట సోషల్ డెమాక్రెట్ల పైన ఆతర్వాత మితవాదపార్టీలపైన ఆధారపడ్డారు. విప్లవంపై దాడిచేయడానికి, ప్రతిచోట ఒక ప్రజావేదిక సంపాదించడం సామ్రాజ్యవాదుల ఆశయం, ఎత్తూకూడా.

# సామ్రాజ్యవాద విధాన వైఫల్యం

ఇటీవలి అంతర్జాతీయ సంఘటనల ప్రాముఖ్యత యేమిటి? సామ్రాజ్యవాదుల పన్నుగడలన్నీ అంత కంతకూ విఫలమౌతున్నాయి. ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదమూ దాని తొత్తులూ యూరప్‌లోనూ ఆశియాలోనూ ఒకే దేశంలో తరువాత మరో దేశంలో ప్రజలనుండి విడివడగొట్ట బడుచున్నారు.

పోలండులో 1947 సెప్టెంబరులో తొమ్మిది కమ్యూనిస్టుపార్టీల సమావేశము జరగడమూ, పరస్పర అంగీకారంతో వాటి కార్యక్రమాలను సమీకరించడానికీ, సమాచారాలను ఒకరికొకరు అందజేసుకోడానికి ఇన్‌ఫర్మేషన్ బ్యూరోను స్థాపించాలని నిర్ణయించడమూ - ఇది ప్రజాతంత్ర శిబిరానికి సామ్రాజ్యవాద శిబిరానికీ మధ్యజరిగే పోరాట పరిణామంలో చారిత్రకమైన మార్పును సూచించే ఘట్టం.

అమెరికన్ సామ్రాజ్యవాదమూ దాని ఏజంట్లూ ప్రతి దేశంలోను సాగించే దురాక్రమణ విధానాన్నీ, యుద్ధ సన్నాహాన్నీ ఐక్యమై ప్రతిఘటించమని చేసిన ప్రబోధంతో, ప్రపంచమంతటా ప్రజాతంత్ర ప్రజానీకం నూతనంగా విజృంభించింది. ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులపైనా వారిస్థానిక అనుచరులపైనా అంత కంతకూ యెక్కువగా దాడి చేస్తూంది.

మధ్యయూరపులోనూ, తూర్పుయూరపులోనూ నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాలు మార్షల్ ప్లానును ఖచ్చితంగా నిరాకరించడంతో అమెరికాయొక్క ఆర్థిక దురాక్రమణ బలంగా దెబ్బతిన్నది. ఆతరువాత హంగేరీ, జెకోస్లోవేకియాల్లో, రుమేనియా

బల్గేరియాలల్లోనూ జరిగిన పరిణామాలు, ఆదేశాలలో అభివృద్ధి నిరోధకులకు నిలువనీడ లేకుండా పోయిందని స్పష్టమవు తోంది. ఆదేశాలలోని సోషలిస్టు, రైతుపార్టీల వెనుకఉన్న ప్రజానీకాలు విద్రోహులనందరిని నిర్దాక్షిణ్యంగా వెడలగొట్టి ప్రజాసంఘటనలో అచంచలంగా నిలవడంవల్ల అంతర్యు ద్ధాలను రొచ్చగొట్టడానికి చేసిన అమెరికన్ కుట్రలు భగ్న మైనవి. ఇందువల్ల సామ్రాజ్యవాదశక్తులు ఏకాకి తనమునూ, ప్రజాతంత్రశక్తుల అఖండ దవమునూ తెలియవస్తున్నది.

గ్రీస్‌లో జనరల్ మార్కోస్ నడుపుతూన్న ప్రజా తంత్ర సైన్యం, అమెరికన్ సామ్రాజ్యవాదం తనపై చేస్తున్న దాడిని వీరోచితంగా ప్రతిఘటించి దేశంలో పదింట ఏడు వంతుల ప్రదేశాన్ని విముక్తం చేసింది. అమెరికా ఏజెంటులైన గ్రీకు ఫాసిస్టులు ప్రజాసామాన్యానికి సంపూర్ణంగా దూరమైనారు. వారధికారం చెలాయించే ప్రదేశంలోనే ప్రజల ప్రతిఘటన జరుగుతూన్నదని అక్కడ జరిగే అసం ఖ్యాకమైన సమ్మెలూ ప్రదర్శనాలే రుజువుచేస్తున్నాయి.

ఫ్రాంసులో కార్మికవర్గ ప్రయోజనాలనూ, ఫ్రెంచి ప్రజల రాజ్యాధికారాన్ని రక్షించడానికి ఫ్రెంచి కార్మికవర్గం జరిపే వీరోచితపోరాటం అమెరికన్ సామ్రాజ్యవాద దురాక్ర మణ పథకానికి గొడ్డలిపెట్టయింది.

అలాగే ఇటలీలో కమ్యూనిష్టు, సోషలిస్టు, ఐక్యతా ప్రాతిపదికపై ఏర్పడ్డ ప్రజాతంత్రసంఘటన రోజురోజుకూ బల పడుతున్నదని అక్కడ వివిధశాఖలకు చెందిన కార్మికవర్గమూ, వ్యవసాయ కూలీలూ జయప్రదంగాసాగించుతూన్న బ్రహ్మాం

డమైన పోరాటాలే రుజువుచేస్తున్నవి. ఇటలీలోగూడా డిగాస్పెరీ మొదలైన స్థానిక అభివృద్ధి నిరోధకులు దేశాన్ని మధ్యధరా ప్రాంతపు వలసరాజ్యంగా మార్చడానికి ప్రయత్నించే అమెరికను కుట్రను ప్రజాసామాన్యం ఎక్కువగా ప్రతిఘటిస్తున్నది.

చైనాలో కొమింటాంగుకున్న ప్రజాబలం యెదాయెదలై క్షీణిస్తున్నది. కార్మికవర్గము, విద్యార్థులు, ప్రజలూ యునైటెడ్ స్టేట్స్-కొమింటాంగు నియంతృత్వాన్ని ఎదిరించి పోరాడుతున్నారు. చైనా పీడితప్రజానీకం కమ్యూనిస్టుపార్టీ జెండాక్రింద సమీకృతులై కొమింటాంగు మిలిటరీ నాయకులపైన దెబ్బమీద దెబ్బ కొడుతున్నారు.

పాలెస్టైన్‌లో జ్యూయిష్-అరబ్ కలహంవల్ల కొంత పెడదారి తికమక కన్పడుతున్నా, కెయిరో కార్మికవర్గమూ, విద్యార్థులూ బ్రిటిష్ వ్యతిరేక విప్లవాత్మక ప్రదర్శనాలు చేస్తున్నారు. యిరాకులో విద్యార్థులు ప్రజలు జయప్రదంగా చేసిన తిరుగుబాటువల్ల అక్కడి కీలుబొమ్మ ప్రభుత్వం కూలిపోయింది. యిరాకును ఆంగ్లదాస్యాన్ని కంటగట్టే సంధి ఉపసంహరించబడ్డది. యిరాక్ ప్రజలలో విప్లవాత్మకమైన అసంతృప్తి రాజుతూనే ఉండటంచేత అజర్బైజాన్ మార్షల్ లాను అమలుజరుపవలసి వచ్చింది. ఈ ఘటనలన్నీ మధ్యప్రాచ్యంలో విప్లవఅవకాశా లెక్కువగా ఉన్నవని తెలుపుతూన్నవి.

కాబట్టి నేడు కార్మికవర్గానికి పెద్ద అపాయం ఎటు నుంచి వస్తుంది? తన బలం తాను తక్కువ అంచనా వేసుకోవడం, సామ్రాజ్యవ్యతిరేక ప్రజాతంత్రసోషలిస్టు శిబిరం

యొక్క బలాన్ని తక్కువ అంచనా వెయ్యడం, శత్రువులైన సామ్రాజ్యవాదుల యొక్క, అభివృద్ధినిరోధకుల యొక్క, వారి కీలుబొమ్మల యొక్క, ఆ యా దేశాల్లో వారితో పొత్తు కలిసినవారి యొక్క శిబిరబలాన్ని ఎక్కువ అంచనా వేయడం - యిదే రాగల ముఖ్యమైన అపాయం.

యీ పైన పేర్కొన్న పరిణామాలు ఏం తెల్పుతాయి? ప్రపంచ ప్రజావిప్లవశక్తులు సామ్రాజ్యవాద విప్లవ ప్రతీఘాత శక్తులకన్నా ఎక్కువ బలవంతములైనవని తెలుపుతాయి. విప్లవ ప్రతీఘాత శక్తులు మితవాద సోషల్ డెమాక్రటిక్ నాయకుల సాయంతో విచ్ఛిన్నాన్నీ, విష ప్రచారాన్నీ ఎంత చేయగలవో అంతవరకే పెరుగుతాయని తెలుపుతాయి.

శాంతియుతంగా తన పలుకుబడిరంగాన్ని విస్తరింప చేసుకొని తద్వారా పెట్టుబడిదారీవిధానా న్నెదుర్కొన్న సంక్షోభంనుంచి గడచి గట్టెక్కే ప్రయత్నం విఫలమైంది. ప్రపంచమంతటా ముంచెత్తుకుని వస్తూన్న కార్మికవర్గపు తిరుగు దాడిని చూచి భయభీతమైనది; అధికోత్పత్తి వలన కలిగే తప్పించుకోరాని, మరియొక ఆర్థిక సంక్షోభం తలుపుతట్తూ ఉంది; యిన్నిటాచిక్కిన అమెరికన్ సామ్రాజ్యవాదము మరో ప్రపంచ యుద్ధానికి విపరీత ప్రయత్నాలు చేస్తున్నది. ఈప్రయత్నాలన్నీ పెట్టుబడిదారీ సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేస్తాయి. ప్రపంచ ప్రజలందరూ ఈప్రయత్నాన్నింకా తీవ్రంగా ప్రతిఘటిస్తారు. యుద్ధానికి సామ్రాజ్యవాద బానిసత్వానికి వ్యతిరేకంగా యింకా యింకా తీవ్రంగా పోరాడుతారు.

# ౨. రెండో ప్రపంచ యుద్ధంలో ఇండియా పరిస్థితులలో మార్పు

**సామ్రాజ్యవాదులతో బూర్జువా కలసిపోయే పాలసీకి ఆర్థిక పునాది :**

ఇండియాలో పురోగమిస్తున్న అప్రతిహతమైన విప్లవ వెల్లువ ప్రమాదాన్ని, బ్రిటీషుసామ్రాజ్యవాదులు చూచారు; పాతవ్యవస్థరోజులు గతించాయని గ్రహించారు. బ్రిటీష్ సామ్రాజ్యవాదం వలసదేశ పరిపాలనలో ఆరితేరిన యజమాని. దానిని సంస్థానాధీశవర్గాలు, నిరంకుశోద్యోగులు, భూస్వాములు బలపరుచుతూఉండేవారు. భూస్వామ్య విధానంపై ఆధారపడుతూ, బూర్జువాప్రతికూలతను కలిగియుండేది.

సామ్రాజ్యవాదానికి గాని, సంస్థానాధీశులకు గాని సామాజికంగా ఏమాత్రం పరువులేదు. అందుచే నగ్నంగా క్రూరమైన హింసనుపయోగించి వలసదేశవ్యవస్థను నిలబెట్టుకోవలసివచ్చేది. ఈవలసదేశ వ్యవస్థ ప్రజలందరిని ఒకే రీతిగా అణచివేసేది.

ప్రజలను ఒకప్రక్క అణచివేస్తూ, ప్రభుత్వాధికారం నుండి బూర్జువాను దూరంగా ఉంచుతూ, బూర్జువా ఆర్థికాభివృద్ధికికూడా అడ్డంకులుపెడుతూ వలసదేశవ్యవస్థ నిలబడుతూ వచ్చింది.

జాతీయ స్వాతంత్ర్యసంగ్రామం బ్రహ్మాండస్వరూపం పొందనంతవరకూ, యీవిధంగా సామ్రాజ్యవాదం పరిపాలింప గల్గింది.

పెట్టుబడిదారీ అభివృద్ధిని అడ్డుపరచే సామ్రాజ్యవాద పాలసీ, బూర్జువాను ప్రతికూలపక్షంలోకి నెట్టింది. బూర్జువా వర్గం ప్రజాపక్షంలోకి రావలసివచ్చింది. విప్లవం, సామ్రాజ్య వాదులమధ్య బూర్జువా అటూయిటూ వూగిసలాడజొచ్చింది సామ్రాజ్యవాదవ్యతిరేక ఉద్యమంలో స్వప్రయోజనాల కోసమై బూర్జువా చేరినప్పటికి ఉద్యమంలో తీవ్రత వచ్చేసరికి బ్రేక్‌లా పనిచేయసాగింది. ప్రజల్ని నట్టేటముంచి సామ్రా జ్యవాదులతో అనేకసార్లు రాజీపడింది.

యుద్ధానంతరస్థితిలో జాతీయ విప్లవ ప్రజా అసంతృప్తి భారతదేశంలో సాయుధ పోరాటస్థాయికి పోయింది. 1942లో త్వరితంగా ఒకదెబ్బన గెలుద్దాం అని సాగించిన పోరాటపు జూదంలో జాతీయ బూర్జువా ఓడిపోయింది.

ఆ పోరాటానికి వారు పురోగమించే ఫాసిజంయొక్క జయంమీద ఆధారపడ్డారు. అలా ఓడిపోయినా, బూర్జువా బలమూ పలుకుబడి ప్రజానీకంపై బహుళంగా వ్యాపించింది. కారణం 1942 పోరాటాన్ని ప్రజలు సామ్రాజ్యవాదవ్యతిరేక పోరాటంగా భావించారు. జాతీయ బూర్జువానాయకత్వాన్ని తమ నాయకత్వంగా అంగీకరించారు. 1942 లోని సామ్రాజ్య వాద వ్యతిరేక అసంతృప్తిని ఉపయోగించుకోవడంవల్ల ఇపుడు లాభంవచ్చిపడింది. జాతీయ బూర్జువా నాయకత్వం తలచు కొంటే అసంతృప్తిచెందిన ప్రజలను ఐక్యపరచి నాయకత్వం

వహించగలదు. అలా జరిగేపక్షంలో తన పరిపాలనకు స్వస్తి యని సామ్రాజ్యవాదం గుర్తించింది.

విప్లవాన్ని అడ్డగించడానికి, పాతవ్యవస్థను రక్షించడానికి సామ్రాజ్యవాదులకున్న మార్గం; జాతీయ ఉద్యమాన్ని నడిపించిన నాయకులను కొనివేయడం; ప్రభుత్వంయొక్క సామాజిక పునాదిని (పరువు) విశాలమొనర్చుకోవడం, విప్లవ శక్తులను చీల్చి ఆపైన దెబ్బకొట్టడం.

విప్లవ వెల్లువ ప్రమాదంచూచి, సామ్రాజ్యవాదం బూర్జువాతో రాజీపడి స్వేచ్ఛా స్వతంత్రాలు యిచ్చామని ప్రకటించింది. సామ్రాజ్యవాదం యీసారి, నూతనసామాజిక భాగాలపై — జాతీయ బూర్జువాలపై ఆధారపడుతోంది. జాతీయ ఉద్యమాన్ని నడిపిన బూర్జువా నాయకులపై ఆధారపడుతోంది. విప్లవ వెల్లువను అణచివేసేందుకు వారు అఖండంగా ఉపయోగపడతారు.

యూరప్‌లోకూడ ఇదే ఆశయం. బూర్జువాకు నామకః అధికారం యిస్తూ, ప్రభుత్వాన్ని నడపటంలో తమకు బూర్జువా చిన్న భాగస్వామిలాగా పనిచేయాలని, దేశాన్ని ఆర్థికసంకెళ్ళతో దాస్యానికి గురిచేయాలని సామ్రాజ్యవాదుల ఆశయం. స్వలాభప్రయోజనాలకై పాకులాడే వర్గాల అభివృద్ధినిరోధక ప్రభుత్వాన్ని అధికారంలో వుంచడం సామ్రాజ్యవాదుల ఆశయం. ఒక ప్రక్క సామ్రాజ్యవాద వ్యవస్థను రక్షిస్తూ మరొకప్రక్క సామ్రాజ్యవాదుల ఆశయాలకు ముసుగు కప్పడానికి ఈ ప్రభుత్వాలు పూనుకొంటాయి.

సంక్షోభంనుండి బయటపడటానికి సామ్రాజ్యవాదం చూస్తున్న ఈ మార్గానికి అర్థం ఏమిటి? పరదేశాలను యింకా తమ అధీనంక్రిందనే ఉంచి వాటి బానిసత్వాన్ని యింకా కొనసాగించడం, వలసదేశవ్యవస్థను నిలబెట్టడం, వలసదేశాలలో దారిద్ర్యాన్ని, వినాశకరపద్ధతులను అలాగే ఉంచడం, పారిశ్రామికాభివృద్ధిని అరికట్టడం, భూస్వామ్య విధాన నిర్మాణాన్ని అలాగే అట్టేపెట్టడం.

ఆర్థికసంక్షోభభారాన్ని ప్రజల మూపుపైన పడవేసే ప్రయత్నమే యిది. అలా పడవేసి ప్రజల దారిద్ర్యాన్ని తీవ్రతరం చేయడంకోసం అనేకరెట్లు ప్రజలను దోచుకోవడంకోసం చేసే ప్రయత్నమే యిది. శ్రమజీవుల ప్రజాతంత్రాన్ని హక్కులను అణచివేయడానికి, ప్రజల స్వతంత్రాలను, హక్కులను అణచివేయడానికి, వలసదేశాలలో ఫాసిస్టురాజ్యం నెలకొల్పడానికి మార్గం సుగమం చేయడమే ఇది. క్లుప్తంగా చెప్పాలంటే యూరపులో మార్షల్ప్లాను ద్వారా ఏమి సాధించదలచుకొంటున్నదో దానినే వలస దేశాలలోకూడా సాధించదలుస్తోంది.

## విప్లవవెల్లువకు పునాది

యుద్ధకాలంలోనే – వలసదేశ దోపిడీ పరిణామం అత్యున్నతస్థాయికి పోయిన రోజులలోనే – యుద్ధానంతర విప్లవ వెల్లువకు పునాది ఏర్పడింది. అలాగే బ్రిటీష్ సామ్రాజ్యవాదం, జాతీయ బూర్జువాల మధ్య సహకారానికి (కొలాబరేషన్) కూడా పునాది ఏర్పడింది. యుద్ధకాలంలో

వలస రాజ్య దోపిడి, భారతీయ ప్రజలు ప్రస్తుత వ్యవస్థను తుదముట్టించడానికి దేనికైనా తెగించేటట్లు చేసింది.

ఇండియాలో భూసంబంధాలు ఫ్యూడల్ సంబంధాలు హక్కుభుక్తాలు భూస్వాములవి. జమీందారీ విధానమూ, ఫ్యూడల్ సంస్థానాలు ప్రబలంగా ఉన్నాయి. దీనికితోడు రైత్వారీ ప్రాంతాల్లో రైతులపై విపరీతమైన అప్పులభారము. పొలాలు గోచిపాతలుగా చీలికలు పేలికలై ఉంటంవల్ల ఉత్పత్తి తక్కువ. ఈ కారణాలవల్ల ఇండియా ఆర్థిక విధానము తిరుగు ఆర్థిక విధానమైంది. కష్టించే ఇండియా ప్రజలకీనాడు కడుపునిండా తిండిలేకుండా ఉన్నది. భూస్వామ్య విధానంలో అప్పులభారమూ, ఫ్యూడల్ సంస్థాన ప్రాబల్యమూ చీడలాగ పెరిగి రైతు రక్తమాంసాలు పీల్చివేసినవి. వ్యవసాయం త్వరితగతిని క్షీణించింది.

ఆహారపంటలు పండే మొత్తం భూమి, గత 20 ఏండ్లలో (1942 వరకు) ఎలా తగ్గిపోయిందో యీక్రింది లెక్కల వలన తెలుస్తుంది.

1921–22 లో ముఖ్యమైన పంటలు పండిన భూమి 15 కోట్ల 86 లక్షల ఎకరాలు. 1941–42 లో ఆ భూమి 15 కోట్ల 65 లక్షల ఎకరాలకు తగ్గిపోయింది. ముఖ్య ఆహార పంటల ఉత్పత్తికూడా తగ్గిపోయింది. 1921–22 లో ఉత్పత్తి 5 కోట్ల 43 లక్షల టన్నులు. 1941–42 లో 4 కోట్ల 57 లక్షల టన్నులకు పడిపోయింది.

ప్రస్తుత యుద్ధానికిపూర్వం 25 ఏండ్లలోను ఎకరానికి పండే పంటకూడా తగ్గిపోయింది. 254 పౌన్లు (షుమారు

10½ మణుగులు) 100 కి 25 పాళ్లు చొప్పున, సగటున తగ్గింది. 1909-13 లో ఎకరానికి 932 పౌనులు పండితే 1938-39 లో 728 పౌనులే పండింది.

ఎకరానికి సగటున పండే ప్రత్తికూడా తగ్గిపోయింది. 1909-13 లో 72½ పౌనులు పండితే 1924-33 లో 636 పౌనులకు తగ్గిపోయింది. ('టెక్నిలాజికల్ పాసిబిలిటీస్ ఆఫ్ అగ్రికల్చరల్ ఇన్ యిండియా' అనే డబ్ల్యు. బరన్సుగారి గ్రంధంనుండి లెక్కలు ఉదహరింపబడినవి.)

ఇలా తగ్గిపోతున్న ఉత్పత్తిలో భూమిదున్నే రైతు ఎక్కువభాగాన్ని భూస్వామికి యియ్యాలి.

యుద్ధానికి పూర్వమే తనతిండిలోటును పూర్తిచేసుకోడానికి ఇండియా బర్మానుండి ఆహారపదార్థాలను దిగుమతి చేసుకోవలసివచ్చింది. దీనికితోడు ప్రజలపై తమ యుద్ధ వ్యయాన్ని రుద్ది సామ్రాజ్యవాదులు నోట్లముమ్మరం హెచ్చించారు. ఇది మరింత అధ్వాన్నపరిస్థితికి దారితీసింది. ఇందువల్ల బర్మానుండి యుద్ధకాలంలో దిగుమతులు ఆపబడగానే వేలకొలదిజనం చనిపోయారు.

భూమిపై జమీందారుల పెత్తనం ఉండుటవల్లకూడా వ్యవసాయం సమృద్ధిగా జరగడానికి అడ్డంకులు ఏర్పడ్డాయి. అధికోత్పత్తిని చేసే చొరవ రైతులకు లేకుండా నాశనంచేసింది అది. ఆధునిక సాధనాలను పరికరాలను ఉపయోగించి భూమిని బాగా పండించే అవకాశాలు లేకుండా చేసింది. అందుచే భూమిదున్నేరైతు పస్తుండవలసివచ్చింది. భూమిపై జమీందార్ పెత్తనం ఉత్పత్తి పెంపుదలకు సంకెలలాగా తయారైంది.

భూమిదున్నే రైతును నిరంతరం పస్తులు పరుండబెడుతూ వచ్చింది. దానిఫలితం సర్వత్రా ఆకలీ, క్షామమూ. రైతులు నిత్యమూ దరిద్రులు కాజొచ్చారు. రైతులభూమి పరాయత్తం కాజొచ్చింది. ధనికరైతుల లేక వడ్డీవ్యాపారుల చేతులలోకి భూమి కేంద్రీకరింపజొచ్చింది. భూస్వామ్యపు విధానపు దోపిడినంతా పూర్తిగా తొలగించివేసి, భూమి దున్నేవారికే ఇచ్చేటటువంటి వ్యావసాయక విప్లవమే యికమార్గమయింది.

యుద్ధమూ యుద్ధ ఫలితంగా ఏర్పడిన ఆర్థికఫలితాలూ, వీటిని పదిరెట్లు విషమింపచేశాయి. అందుచే రైతాంగం తీవ్రమైన అసంతృప్తితో, క్రోధంతో మండిపోతూ వుంది.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు, దేశీయసంపదను చేతిలో పెట్టుకున్నారు. దోపిడీ పద్ధతులద్వారా ప్రజలకు నష్టంకలిగించి యుద్ధానికి ఆర్థికసహాయం చేయదలచుకొన్నారు.

జపాను దాడిచేయడంతో యుద్ధరంగం ఇండియాకు మారింది. అపుడు సామ్రాజ్యవాదులకు ఇండియానుండి లక్షల విలువచేసే సామగ్రి కావలసి వచ్చింది. అందుచే నోట్లముద్రణము హెచ్చించారు. ఉత్పత్తిచేసేవానికి – రైతుకు – కూలీకి – విలువ తగ్గిన డబ్బు చెల్లించసాగారు. దీనివల్ల దేశం మొత్తం మీద 1600 కోట్ల రూపాయలు బ్రిటన్ దగా చేయగల్గింది. (స్టెర్లింగ్ నిల్వలివే) ఇంతేగాదు, యిండియాలోని బీదతరగతులవారికి రావలసిన ఈ 1600 కోట్ల రూపాయలను పోగొట్టుకొన్నారు.

రైతుల ఆదాయం అధికధరల అలవెన్సు ఇచ్చినప్పటికి

కూడా కార్మికుల జీతాలు మధ్యతరగతి గుమాస్తాల జీతాలు 100 కి 50 పాళ్లు విలువ తగ్గిపోయాయి.

బీదరైతాంగం రెండువైపులా దోపిడీకి గురిఅయింది. ధరల పెంపుదలవల్ల కలిగిన లాభం వారికి దక్కలేదు. పారిశ్రామిక వస్తువులను వారు మరింత హెచ్చుధరలకు కొనవలసి వచ్చింది. పంటకాలం అయిపోయాక చివరరోజులలో వారే మార్కెట్టుకు వెళ్ళి ఆహారపదార్థాలు కొనుక్కోవలసివచ్చే సరికి, నిలువదోపిడీ ధర నిచ్చుకోవలసివచ్చింది.

రైతాంగాన్ని అన్నివిధాలా దగాచేసి దోపిడి చేయడానికి నోట్ల ముమ్మరం సాధనం అయింది. యుద్ధసంక్షోభ భారాన్ని పస్తుపడుండే రైతుమీాదకు నెట్టారు.

దాని ఫలితం రైతు మరింత దరిద్రావస్థకు లోనయ్యాడు. అతని భూమి ధనిక రైతుల చేతులలోకి కేంద్రీకరింపబడింది. క్షామం సంభవించింది. బెంగాలు క్షామంలో 30 లక్షల మంది ఆహుతి అయ్యారు.

ఎడ్లు, ఇనుము, నాగలి మొదలైనవాటి ధరలు విపరీతంగా పెరిగాయి. ఇండియాలోని బీదరైతుకు వ్యవసాయం చేయడం అసాధ్యమైపోతున్నది. అతడు దివాలాతీయవలసి వస్తోంది. నోట్లముమ్మరం కౌలు రేట్లను విపరీతంగా పెంచింది. భూమినుండి తొలగించడం, అన్యాయంగా వసూళ్లుచేయడం హెచ్చయింది. వీటితో రైతుజీవితం దుర్భరమైపోయింది.

## కార్మికులు - యుద్ధసంక్షోభమూ

యుద్ధకాలంలో పారిశ్రామికాభివృద్ధిని అరికట్టిన విధానాన్నే సామ్రాజ్యవాదం కొనసాగిస్తూ ఉంది. అందువల్ల

యుద్ధానంతరం ఉద్యోగాలకు స్వస్తి చెప్పగానే సైన్యంనుంచి పరిశ్రమలనుంచి ప్రభుత్వపు సర్వీసులనుంచీ మధ్యతరగతి క్లర్కులూ ఇతరులు లక్షలాదిగా నిరుద్యోగరాశిసికి బలియౌతున్నారు. వారికి మరో ఉద్యోగమూ దారీతెన్ను లభించే స్థితిలేదు. ఇప్పటికప్పుడే పదిలక్షలమంది ప్రభుత్వ ఉద్యోగాలనుంచి బైటకు నెట్టబడ్డారు. రైల్వేలు, ఓడరేవు కంపెనీలు, సివిల్‌స్టాఫ్‌లు, జనరల్ రిట్రెంచిమెంటు (ఉద్యోగాలనుంచి తీసివేత) ఆర్డర్లకెదురుచూస్తున్నారు.

యుద్ధకాలంలో భారతీయ పరిశ్రమలు కార్మికులను కొట్టి పెంపొందినాయి. కొత్త పరిశ్రమల స్థాపనకు అనుమతి యీయబడలేదు. కాని సామ్రాజ్యవాదులు ఇండియానుంచి యుద్ధావసర వస్తువులకు ఆర్డర్లీయడం, ప్రజలను నిలువు దోపిడీ చేసే ధరలకు వస్తువులమ్మడం వలన, పెట్టుబడిదారులు తమ ఫ్యాక్టరీలను 24 గంటలూ పనిచేయించగలిగారు.

జీవిత వ్యయప్రమాణం హెచ్చుడంవల్ల కార్మికులకు వచ్చే నిజమైన జీతాలు తగ్గిపోయాయి. కార్మికులు సంఘటితమై ఉన్న పరిశ్రమలలో, కార్మికులు సమ్మెచేసిన ప్రదేశాలలో కొంతవరకు యుద్ధఅలవెన్సు ఇచ్చారు. కాని తక్కిన చోట్ల ఈ పరిహారం (ఎలవెన్సు) హాస్యాస్పదంగా ఉన్నది.

కార్మికుడు సంపాదించే రూపాయి విలువ, నోట్ల ముమ్మరం వల్ల దాదాపు ఆరు అణాలకు తగ్గిపోయింది. యుద్ధభారం కార్మికుని మూపుపై బడింది.

దీనికితోడు ఆహారంలో పుష్టికర పదార్థాలు తగ్గిపోయాయి. కార్మికుల శారీరక సామర్థ్యం తగ్గిపోయింది. పని

చేయలేక గైరుహాజరవడం ఎక్కువ అయింది. వారి జీవిత స్థాయి చాలా పడిపోయింది.

గత ఏడేండ్లుగా, ఈ అధ్వాన్నపరిస్థితిని కార్మికవర్గం ఎదిరించి పోరాడుతోంది.

యుద్ధం ముగిసినప్పటినుండి జీవితవ్యయపరిమాణం యింకా పెరుగుతూ వచ్చింది. కార్మికవర్గం యొక్క జీవితం ఇంకా త్వరగా అధ్వాన్నమౌతూ వచ్చింది. రైతులలో అధిక భాగానికీ, చాలామంది కార్మికులకూ, ఉద్యోగస్తులకూ జీవన పరిమాణం నూరింట యాభై వంతులకు అంతకన్నా తక్కువకు కూడా పడిపోయింది.

ప్రభుత్వ అంచనాలు వాస్తవానికి ఎప్పుడూ చాలా తక్కున అంచనాలే. అయినా వాటి ప్రకారమే— జీవితవ్యయ ప్రమాణం పెరుగుదల యిలాఉంది.

| | అగస్టు 1939 | 1945 | సెప్టెంబరు 1947 |
|---|---|---|---|
| బొంబాయిలో | ,, 100 | 224 | 285. |
| అహమ్మదాబాద్ | ,, 100 | 272 | అగస్టు 1947—322 |
| షోలాపూరు | ,, 100 | —— | సెప్టెంబరు 1947—360 |
| కాన్పూరు | ,, 100 | 308 | అక్టోబరు 1947—420 |
| మద్రాసు | ,, 100 | 228 | అక్టోబరు 1947—285 |
| త్రిచూరు (కొచ్చిన్) | ,, 100 | —— | సెప్టెంబరు 1947—301 |
| ఆల్ ఇండియా ఆహార ధరల ప్రమాణం (హోల్ సేల్) | ,, 100 | అగస్టు 1945 239_4 | ఫిబ్రవరి 1948—348_5 |
| బియ్యం_గోధుమలు, జొన్నలు వగైరాధాన్యం | | | ఫిబ్రవరి 1948—405 |

కార్మికుడి తిండి యీనాడు యుద్ధం పూర్వంకన్నా నాలుగురెట్లు ధర పెరిగింది.

కార్మికుల జీతాలపై ఈదాడి కార్మికుల్లో క్రోధాన్ని ప్రజ్వరిల్ల చేసింది. దీన్నుంచి తప్పించుకుంటానికి సామ్రాజ్యవాదం 1947 లో రోజుకు ఎనిమిది గంటలపని నియమం పెట్టింది. కొన్ని తరగతుల కార్మికులకు జీతంతో కూడిన శెలవులిస్తూ చట్టం చేసింది. ప్రభుత్వ ఉద్యోగుల జీతాలను నిర్ణయించేందుకు పే కమీషన్‌ను నియమించింద.

కాని అసంతృప్తిని ఆపడం సాధ్యంకాదు. యుద్ధకాలంలోనే శ్రామికవర్గంయొక్క జీవనస్థాయి సన్నగిల్లింది. సరకుల ధరల పెరుగుదలతో సమానంగా ప్రతిఫలం వారికి ముట్టనే లేదు. అందుచేత వారు ప్రతిఘటన ప్రారంభించారు.

1942 నాటినుంచీ సమ్మె తరంగం మహావిజృంభణతో అన్ని పరిశ్రమల శాఖలలోకి పాకింది. 1942 లో సమ్మెలలో పాల్గొన్న కార్మికులసంఖ్య 7 లక్షల 72 వేలు. 57 లక్షల 79 వేల పనిరోజులు నష్టం అయినాయి. 1945 లో సమ్మెలలో పాల్గొన్న కార్మికుల సంఖ్య 7 లక్షల 47 వేలు. 40 లక్షల 54 వేల పనిరోజులు నష్టం అయినాయి. 1946 లో సమ్మెలలో పాల్గొన్నవారిసంఖ్య యిదివరకెప్పుడూ లేనంతగా అంటే 19 లక్షల 61 వేలకు పెరిగింది. కోటీ యిరవైఏడులక్షల పదిహేడువేల పనిరోజులు నష్టమైనాయి. 1947 మొదటి ఎనిమిది నెలల్లో 13 లక్షల 23 వేలమంది సమ్మెల్లో పాల్గొన్నారు. కోటి 11 లక్షల 95 వేల 863 పనిరోజులు పాడయినాయి.

ఈ సమ్మె తరంగంయొక్క విజృంభణ ఆర్థిక విధానంలో సంక్షోభం అంతకంతకూ తీవ్రతరం అవుతూవున్న విషయానికి నిదర్శనం. ఆ సంక్షోభఫలితంగా వస్తూన్న దరిద్ర దశను ప్రజలు తీవ్రంగా ఎదుర్కొవడానికి ప్రారంభించారన్న దానికి అది ఒక నిదర్శనం.

పారిశ్రామిక కేంద్రాలలోని పరిస్థితులు బట్టలమిల్లులు, రైల్వేలు మొదలగువానిలో కల్లోలం వ్యాపింపచేస్తున్నాయి. నిరుద్యోగము, మిల్లుల మూసివేతలపై కార్మికులలో కోపం తీవ్రమవుతూంది. పరిశ్రమలను ప్రభుత్వపరం చేయాలనీ, జీవితాని కవసరమైనంత జీతాలు కావాలనీ, పరిశ్రమలలో అరాచకం పోగొట్టి ఒక క్రమబద్ధమైన ప్రణాళికను ప్రవేశపెట్టాలనీ పోరాటం ప్రారంభమైనది.

సంక్షోభఫలితాలను కార్మికుల నెత్తిరుద్ది తాము తప్పించుకోవాలని సామ్రాజ్యవాదులూ, బూర్జువా వర్గమూ ప్రయత్నిస్తూంది. తక్కువమందిచే ఎక్కువ పనిచేయించీ, జీతాలబిల్లు తగ్గించి, కార్మికుల సౌకర్యాలకు సంబంధించిన బిల్లులను నిలుపుచేయించీ దేశం పేరు చెప్పి ఉత్పత్తి ఎక్కువ చేయమని తొందరపెట్టీ వారు సంక్షోభసమస్యను పరిష్కరించాలనుకొంటున్నారు.

కాని జీవనానికి అవసరమైన జీతాలివ్వడం, పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడం, లాభాలను అదుపులో పెట్టడం జరిపితేనే కార్మికవర్గం సంతృప్తిపడుతుంది. అంటే ప్రజాతంత్ర విప్లవకార్యక్రమాన్ని అమలు జరపాలనే కోరికను ముందుకు తేవడాన్ని కార్మికులు అనుభవంమీద గ్రహిస్తున్నారన్న

మాట. ఇక్కడకూడా రెండే రెండుమార్గా లున్నాయి. ఒకటి పెట్టుబడిదారుల, సామ్రాజ్యవాదుల పద్ధతి. రెండవది ప్రజ లవలంబించే విప్లవకరపంథా.

ఇదివర కెప్పుడూ జరుగనంతగా మధ్యతరగతి ప్రజా సామాన్యం ఈ ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొంటుంది. విద్యార్థులు విద్య చౌకగా లభించాలనీ, స్కూలు జీతాలు తగ్గించాలనీ, పోరాటాలు సాగుతున్నారు. ధనికులకుమాత్రమే అనుకూలంగాఉన్న ఈనాటి పరిస్థితులకు మధ్యతరగతి ప్రజలలో ఎంత అసంతృప్తివున్నదో దీనివలన తెలుస్తుంది. యుద్ధం రోజులలో మధ్యతరగతికి చెందిన గుమాస్తాలు, ప్రభుత్వోద్యోగులు, మాధ్యమిక, ప్రాథమిక, పాఠశాలల ఉపాధ్యాయులు, నరకయాతనల ననుభవించారు. దొంగవర్తకాలవలన బాధపడ్డది విశేషంగా వారే. కరువుభత్యంకానీండి, మరొకటి గానీండి అందరికన్నా తక్కువ వారికి వచ్చింది. ఇప్పటికి వారి ఓర్పు క్షీణించింది, వారూ సమ్మెలకు దిగుతున్నారు.

సంస్థానప్రజలుకూడా ఆహారపు కరువులు, దొంగవర్తకాలు, విపరీతమైన ధరలు, అవసరమైన సరుకులు దొరకకపోవడం మూలంగా విపరీతమైన బాధల ననుభవించారు. ఆర్థిక పరిస్థితులు అతివేగంగా క్షీణిస్తూండడం ప్రజలలో అద్భుతమైన చైతన్యాన్ని కలిగించింది. వాటిని ప్రతిఘటించడానికై జరిగిన పోరాటాలను తరుచుగా కార్మికవర్గమే ముందుండి నడిపింది. "క్విట్ కాశ్మీర్"వంటి ప్రజోద్యమాలు విజృంభించాయి. సంస్థాన ప్రజలు దారిగానక తిరువాన్కూరు, హైద

రాబాదులలో సంస్థాన ప్రభుత్వాన్ని ధిక్కరించి ఎదుర్కొన్నారు. సంస్థానాధీశులంతా వణకిపోతున్నారు.

నిరంకుశత్వాన్ని ప్రతిఘటించి ఇక్కడకూడా ప్రజా సంఘటన దృఢపడిందంటే ప్రజాతంత్రి వెల్లువ సర్వత్రా వ్యాపించిందన్నమాట.

ఇటువంటి పరిస్థితులలో నుండే ప్రజాతంత్ర విప్లవం పరిపక్వస్థితికి వస్తుంది. ప్రజారాజ్య నిర్మాణానికి దారితీస్తుంది.

ఈనాటి వ్యవస్థను పీడిత ప్రజానీకంలో ఎవ్వరూకూడా సహించలేరు. వారి ఉద్యమాలన్నీ వాటంతట అవి ప్రస్తుత సమాజ వ్యవస్థను మార్చేవైపుకే కదులుతున్నాయి.

## సామ్రాజ్యవాదంతో సహకరించుటకు గల ఆర్థిక పునాది

యుద్ధపరిస్థితులు ప్రజలను తెగించేలాగ చేస్తే, బూర్జువావర్గాన్ని సామ్రాజ్యవాదులతో కొత్త సంబంధాలు పెట్టుకొనేటట్లు చేశాయి.

బీదల్నీ, కార్మికుల్నీ, కష్టజీవులైన రైతుల్నీ, యుద్ధం పీల్చి పిప్పిచేసినా, ఇండియా దేశపు బూర్జువావర్గాన్ని అమితైశ్వర్యవంతంగా చేసింది. ధనరూపమైన పెట్టుబడి అమితంగా వారి చేతులలోకి వచ్చింది.

పరిశ్రమలలో లాభాలకేసిచూస్తే కళ్ళు తిరిగిపోతాయి. ఇండియా ప్రభుత్వపు ఆర్థికసలహాదారు ఇచ్చిన ఈ అంకెలు చూడండి.

## సాధారణ పరిశ్రమలలో లాభాలసూచిక

(1928 నాటి లాభాలు 100 గా) బట్టలమిల్లులకు ప్రత్యేకం

| | | | |
|---|---|---|---|
| 1939 | 72—4 | — | 154-6 |
| 1940 | 99. 9 | | 220.1 |
| 1941 | 135. 4 | | 489.1 |
| 1942 | 169. 4 | | 760.7 |

(Recent Social and Economic trends in India 1946నుంచి)

ప్రభుత్వం యిచ్చిన పెద్దపెద్ద ఆర్డర్లవలన మిల్లులు 24 గంటలూ పనిచేయకలిగాయి. తయారైన సరుకు విడుదల కాదేమోననే భయం లేకుండా ప్రభుత్వపు ఆర్డర్లున్నాయి. ప్రభుత్వం సరుకులు తీసికొని పోతుండడం వలన సామాన్య ప్రజలకు వస్తువులు దొరకడం కష్టమయింది. దానితో వాటికి విపరీతమైన ధరలు పెట్టడం దొంగవర్తకం చేసి విపరీతమైన లాభాలు తీయడానికి అవకాశం దొరికింది. ప్రజాసామాన్యాన్ని దోచుకోవడంలో సామ్రాజ్యవాదులకు ఇండియా బూర్జువా వర్గం మహాసంతోషంతో భాగస్వామ్యం వహించింది. విపరీతంగా ధనరూపమైన పెట్టుబడి దానిచేతులలో చేరింది.ఇండియా దేశపు పరిశ్రమలు ఎప్పుడు అంతమంచి రోజుల్ని చూడలేదు. మార్కెట్టు అంత బాగా ఎప్పుడు వుండలేదు. కోట్లమొత్తంలో లాభాలు ఏనాడూ కురిసి వుండ లేదు.

అదనపులాభాలపన్ను, ఇతరపన్నులూ ఉన్నా భారత పెట్టుబడిదారీవర్గం యుద్ధంలో విపరీతమైన లాభాలు గడించింది. నోట్లముమ్మరం సృష్టించీ, ఎక్కువధరలు అనుమ

తించీ, ప్రభుత్వం ఇండియా బూర్జువావర్గంతో వ్రాత కోతలు లేని ఒడంబడిక చేసికొన్నదని చెప్పవచ్చును. ప్రభుత్వానికి సరుకులు వారు సప్లయిచేయడానికి, దానికిబదులుగా ప్రజల్ని దోచుకొని పెద్దలాభాలు కూడదీసుకోడానికి వారు ఒప్పందం చేసుకొన్నారనవచ్చును.

ఇండియా బూర్జువావర్గం ప్రభుత్వానికి ఋణం ఇవ్వడానికి ఇష్టపడలేదు. వారి నాయకత్వం – కాంగ్రెసు – నాయకత్వం – ఆగస్టు పోరాటంద్వారా ప్రభుత్వంమీద వత్తిడి తెస్తూంది. అందుచేత, ప్రభుత్వానికి కావలసిన ధనాన్ని ఇచ్చేటందుకై, బూర్జువావర్గాన్ని ఆర్థిక సహకారానికి అంగీకరించేలాగచేయడం సాధ్యంకాదు. నిజానికి 1942 లో దేశంలోని పెద్ద పరిశ్రమలలో ముఖ్యమైన రెండు పరిశ్రమలు ప్రభుత్వంమీద వత్తిడి తీసుకొని రావడానికై జంషెడ్‌పూరులోను, అహమ్మదాబాదులోను పనిచేయడం మానివేశాయి.

తాత్కాలికంగా వారినిఊరుకోపెట్టడానికి పెద్దలంచం కావాలి. ధరలపెంపుదల, నోట్లసుమ్మరం, అంతులేకుండా పెరిగేలాభాలు వారిని ఊరుకోబెడతాయి. పరిశ్రమల యజమానులు తమ ఉత్పత్తిలో కొంత భాగాన్ని ప్రభుత్వానికి కంట్రోలు రేట్లకి ఇవ్వవలసి ఉన్నా, మిగతా సరుకును ప్రజాసామాన్యానికి దొంగవర్తకపు రేట్లకు అమ్మి విశేషలాభాలు గడించవచ్చు. అందుచేతనే పెట్టుబడిదారులు చేసే దొంగవర్తకాన్ని ఆపుచేయ డానికి ప్రభుత్వం ప్రయత్నించలేదు. పైగా టెక్స్టయిలుబోర్డు ఇతరబోర్డులలోను వారినే నియమిం

చింది. స్టాండర్డుక్లాత్ స్కీముమవంటి వాటికి గోతులు తవ్వి ఎగరగొట్టినా ఊరుకోంది.

బజారులోనూ, దొంగబజారులోను గూడ వచ్చిన ధరల పెరుగుదల చూస్తే పెట్టుబడిదారులు యుద్ధకాలంలో సామ్రాజ్యవాద ప్రభుత్వయంత్రపు సహాయంతో ప్రజలని దోచుకొనీ, నోట్ల ముమ్మరం ద్వారానూ, కార్మికుల కిచ్చే జీతాలవిలువ తగ్గించీ, ఎంత ధనం దోచుకోకలిగారో అర్థం చేసుకోవచ్చు.

పరిశ్రమల, యజమానుల, వర్తకుల, వ్యాపారుల చేతిలో ధనరూపమైన పెట్టుబడి పోగుబడటంతో ఇండియా బూర్జువా వర్గం యొక్క ఒక పెద్ద సమస్య పరిష్కారమైంది. బీదదేశంలో ధనరూపమైన పెట్టుబడి దొరకడం అనేది పెద్ద సమస్యగా ఉండేది. అది యిప్పుడు తొలగింది. పెట్టుబడి రాదనే భయం యింకలేదు. వారికి అడ్డం వచ్చిన దానికల్లా పెట్టుబడి సమకూరుతుంది.

ధనం పోగుపడడంతో ఇండియా బూర్జువావర్గం – పెద్ద వ్యాపారాలు – పెద్ద ఎత్తులతో పెట్టుబడులు పెట్టేందుకు నాలుగుమూలలూ చూడసాగారు. ఇండియా కోటీశ్వరులు తయారుచేసిన టాటా – బిర్లా ప్లాను, ఇండియా పెట్టుబడిదారులు పెద్ద యెత్తుమీద పెట్టుబడులు పెట్టడానికి సిద్ధంగా వున్నారనీ, పెద్ద పందెములు ఒడ్డటానికి పెద్ద ధనికుల్ని ఆహ్వానిస్తున్నారనీ ప్రపంచానికి ఎరుకపరచడానికై అడ్వర్‌టైజుమెంటే. దోపిడీచేసి,కూడపెట్టిన ధనం చూచుకొని యిండియన్ పెట్టుబడిదారులు ఎంత పెద్ద ఎత్తులతో, ఎంత ధైర్యంతో

వుంటున్నారో చెప్పటానికి అది ఒక కొలతబద్ద యని చెప్ప వచ్చు.

కాని, పెట్టుబడిదారులు తాము బ్రిటిష్ - అమెరికన్ పెట్టుబడిదారులమీద ఆధారపడి వున్నామనే విషయం గుర్తించనంత అజ్ఞానులు కారు.

ఇండియా దేశపు పరిశ్రమలలో పాతయంత్రాలకు బదులు కొత్త యంత్రాలు పెట్టేటందుకు వీలులేకుండా చేసి బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు అడ్డుపెట్టగలిగారు. కొత్త పరిశ్రమలు స్థాపించడానికై కొత్త యంత్రాలు తెచ్చుకోకుండా అడ్డగించారు. ఈస్టరన్ గ్రూపుకమీషన్ ద్వారానూ ఆఖరుకు గ్రాడిరిపోర్టును కూడా అమలు జరుపడానికి నిరాకరించీ వారు యుద్ధకాలంలో భారతపరిశ్రమలను జీర్ణావస్థలో అట్టి పెట్టారు.

ఇండియా పెద్దవ్యాపారులు తలపెడుతూన్న పెద్ద ఎత్తులకు కావలసిన యంత్రాలమాట అటుంచండి. ఇదివరకున్న పరిశ్రమలలోనే యంత్రాలను మార్చి కొత్తవి పెట్టాలంటే ఎన్నో కోట్ల రూపాయల విలువగల యంత్రాలు కావాలి. యంత్రాలు సరఫరా చేయగలశక్తి ఒక్క బ్రిటన్ - అమెరికాలకే ఉన్నది.

చేతిలో ఎంతో ధనం, మనస్సులో ఎన్నో పెద్దఎత్తులూవున్నా వెనుకబడి ఉండడంమూలంగానూ, వలసదేశాలలో వుండే ఇబ్బందుల మూలంగానూ, బ్రిటన్‌మీద ఆధారపడి ఉండడం మూలంగాను ఇండియాలోని పెద్దవ్యాపారులకు ఎటుకదలటానికి సందు లేకుండా పోయింది. వారి

ఇబ్బందులను బ్రిటను పూర్తి స్వార్థంకోసం వుపయోగించు కొంటూంది.

ఇండియాకు రావలసిన 1600 కోట్ల స్టెర్లింగు నిలవలను వుపయోగించుకోవచ్చుననీ, విదేశీ నాణాలు సంపాదించడంలో ఇబ్బంది పడనక్కరలేకుండా విశేషంగా యంత్రసామగ్రి దిగుమతి చేసుకోవచ్చుననీ, పెద్దపెట్టుబడిదారులు ఆశపడ్డారు. ఈసొమ్ముతో బేరాలు కుదుర్చుకోవచ్చుననీ సాధ్యమైనంత వేగంగా యంత్రసామగ్రిలు తెచ్చుకోవచ్చునని తలచారు.

కాని, ఈస్టెర్లింగు నిలవలో హెచ్చుభాగాన్ని ఇవ్వకుండా వుండేటందుకు బ్రిటిష్-అమెరికను సామ్రాజ్యవాదులు కలసి పనిచేసారు. ఏదో చిన్నసౌకర్యాలకీ, కొద్దిపాటు డబ్బు తీసుకోవడానికీ ఇండియా ఒప్పుకోక తప్పనిసరి అయ్యేటట్లు చేసారు.

స్టెర్లింగ్ నిలువలను ఇవ్వాలనే వుద్దేశ్యం బ్రిటన్‌కు ఎప్పుడూ లేదు. ఏదోకొంతకొంత ఇస్తామనే ఆశచూపిస్తూ, కొత్తకొత్త ఆర్థిక సౌకర్యాలు పొందాలని వాళ్ళఎత్తు.

ఇండియాకు యీనిలువలు దక్కడం అమెరికాకు ఇష్టంలేదు. ఆడబ్బుతో యంత్రాలు కొనుక్కోలేకపోతే, ఇంక ఇండియా బూర్జువావర్గం యంత్రాలకోసం బ్రిటను అమెరికాల దయా, ధర్మ, భిక్షాలమీద ఆధారపడి వుండాలసి వస్తుంది.

1945 డిశంబరు 6 వ తేదీన అమెరికా, బ్రిటనులు వ్రాసుకొన్న ఆంగ్లో - అమెరికను రుణపత్రం 10 వ క్లాజులో యీనిబంధం ఉంది.

"స్టెర్లింగు ఏరియాకు చెందిన దేశాలతో పరిష్కారం చేసుకొనేటప్పుడు పోగుపడివున్న నిలువలను మూడు తరహాలుగా విభజించాలి. (1) వెంటనే పని నడవడానికై యే దేశపు నాణెంలోకయినా మార్చుకునేటందుకు వీలుగా వెంటనే యివ్వవలసిన సొమ్ము (2) అదేవిధంగా 1951 మొదలుచేసుకొని కొన్నియేళ్లలో వాయిదాలమీద యివ్వవలసిన సొమ్ము. (3) యుద్ధకాలంలోనూ యుద్ధానంతరమున్నూ చేసిన ఋణాలను తీర్చుకొనేప్పుడు అలాంటి ఋణపరిష్కారంవల్ల ఆయా దేశాలకు రాగల పరస్పర ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని చేసే కొట్టివేతలూ మొదలైన సర్దుబాట్లక్రిందకు వచ్చే సొమ్ము."

ఆవిధంగా పరిష్కారం చేసుకొంటే ఏదో లాభాలు ఉంటాయనే ఎరపెట్టి నిలువలలో పెద్ద మొత్తాన్ని రద్దుచేయుమని ఈ సబ్ క్లాజు (3) బహిరంగంగా చెపుతూంది.

ఆవిధంగా బ్రిటన్ ఇండియాకు యీయవలసిన అప్పునే బ్రిటిష్-అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇండియాను అణచిపెట్టడానికి వుపయోగిస్తున్నారు. యంత్రాలరూపంలో ఏదో లాభం ఇస్తామనే ఎరచూపి, ఋణం తగ్గించడానికి ఇండియాపై ఒత్తిడి తెస్తున్నారు. లేదా ఋణం అంతా కావాలంటే మావల్ల మీరు పొందగల యితర ప్రయోజనాలను వదలుకోవలసివస్తుందని బెదరిస్తున్నారు.

అందుచేత ఏదో అంత్యపరిష్కారం చేసుకొనేవరకూ వారు స్టెర్లింగ్ నిలువలలో కొంచెంకూడా ఉపయోగించుకొని యంత్రసామగ్రి తెచ్చుకోడానికి అవకాశం యివ్వడం

లేదు. విపరీతమైన ధరలకు విదేశాలనుంచి ఆహారం తెచ్చు కొనేటందుకై మాత్రమే కొంత సొమ్ము యిచ్చారు.

పైగా పరిశ్రమలు అభివృద్ధిచేసుకోవాలన్నా, యంత్రాలు తెచ్చుకోవాలన్నా ఇండియా బూర్జువావర్గం తన మీద పూర్తిగా ఆధారపడాలనే విషయం చూపించడంకోసం సరుకులు ఎగుమతిచేసి, యంత్రాలు తెప్పించుకోండని సలహా చెబుతున్నారు.

స్టెర్లింగ్ నిలవలనుంచి యంత్రాలు తెప్పించుకోలేక పోతే ఇండియా తన సరుకుల్ని విదేశాలకు ఎగుమతిచేసి సరిపడే డాలర్లూ, పౌనులూ సంపాదించుకోవలసివస్తుంది. విదేశాలనుండి రుణం తెచ్చుకోగల ఆశా, నిలవలు చేతికొచ్చే అవకాశమూ లేకపోతే యంత్రాలు తెప్పించుకొనేటందుకు కావలసిన సొమ్ము సరుకులు ఎగుమతిచేసి సంపాదించుకోవలసిందే తప్ప దానికి మరోమార్గం లేదు.

కాని ఎగుమతులద్వారా సంపాదించుకొనే సొమ్ము పెద్ద పెట్టుబడుదారుల అవసరాలకి ఏమాత్రమూ చాలదు. ఫలితంగా వారు తాము తమ ఉనికికికూడా బ్రిటన్ అమెరికాలమీద ఆధారపడివున్నామనే సత్యం ఎంతకష్టమనిపించినా అంగీకరించక తప్పదు. తనకుకావలసిన యంత్రసామగ్రిని తెప్పించుకొనేటందుకు అవసరమైన సొమ్మును ఎగుమతుల ద్వారా సంపాదించుకోవాలంటే ఏళ్ళుపడుతుంది. ఈ విధంగా ఎన్నిఏళ్లుగడచినా అరిగిపోయిన యంత్రాల్ని మార్చి కొత్తవి తెప్పించుకోవడమే సాధ్యంకాదు.

ఇండియను బూర్జువా వర్గం బ్రిటిష్ - అమెరికన్

సామ్రాజ్యవాదులమీద ఆర్థికంగా ఆధారపడి ఉందని నిరూపించి బ్రిటన్ - అమెరికాలు తమకు అనుకూలమైన ఆర్థికపు ఒడంబడికలకు తలవొగ్గేటట్లుచేయడానికే సామ్రాజ్యవాదులు స్టెర్లింగ్ నిలువలు యివ్వడానికి నిరాకరిస్తూన్నారు. యంత్రాలు కావలసివస్తే ఎగుమతులద్వారా ధనం కూర్చుకోండని సలహా యిస్తున్నారు.

ఇంగ్లీషువాళ్ళని అమెరికనుల వలసదేశాలలో సరుకులు పిరివిగా అమ్ముకోనిస్తామనే ఆశచూపి యిండియన్ బూర్జువా వర్గాన్ని ఆంగ్లో-అమెరికను సామ్రాజ్యవాదుల ఆర్థికచక్రంలో చిక్కించుకొనేందుకై స్టెర్లింగునిలవలను నిరాకరించి ఎగుమతులలో యంత్రాలు తెప్పించుకోమని చెప్తూన్నారుకూడా.

స్టెర్లింగ్ నిలవలలో అధమం కొంచెమేనా ఇవ్వండని మాటిమాటికీ ప్రాధేయపడడం గమనిస్తే యిండియన్ బూర్జువావర్గం సామ్రాజ్యవాదుల దయాధర్మాలమీద ఎంత ఎక్కువగా ఆధారపడి ఉందో మనం అర్థంచేసుకోచ్చు,

ఆర్థికసంక్షోభం కారణంగా ఇండియా బజారుల్లో సరుకు విడుదల కాకపోవడంచేత ఇండియను బూర్జువావర్గం అప్పుడే విదేశాలకు సరుకులు పంపడానికి ఆలోచనలు చేస్తూ ఉంది. ఏదో ఒకచోట సరుకువిడుదల అయ్యేటందుకు మార్గం చూపించకపోతే ఇండియా పరిశ్రమలు పూర్తిగా కూలిపోతాయనేది వాళ్లు ఎరుగుదురు.

విదేశాలలో మార్కెట్టుకావాలంటే బ్రిటన్ - అమెరికాల వలసదేశాల మార్కెట్లు వెతుక్కోవలసిందే. అందుచేత అక్కడి బజారుల్లోకి సరుకు రానిచ్చేటందుకు ముందు

తమ యిష్టం వచ్చిన మరగులు పెట్టేటందుకు వారికి వీలు దొరుకుతూంది. ఈ వ్యాపారంలో యిండియన్ బూర్జువా వర్గానికి వచ్చే విదేశనాణాలు వారికి కావలసినదానిలో ఏ మూలకీ చాలవు. ఫలితంగా నామమాత్రంగా వున్న స్వతంత్రంకూడా దూరంగా నెట్టి, భిక్షాపాత్రతో వచ్చి, సామ్రాజ్యవాదంమీద పూర్తిగా ఆధారపడవలసి ఉంటుంది.

ఇండియను పెద్ద పెట్టుబడిదారులు పెద్ద ఆశతో ఆగ్నేయాశియా దేశాలన్నీ తమ సరుకుల విడుదలకు మార్కెట్లుగా వుపయోగపడతా యని చూస్తూన్నారు. జపాను చేతినుండి పడిపోయిన కాగడాను తాము పుచ్చుకోవచ్చుననీ పుచ్చుకోవాలనీ అనుకొంటున్నారు. సామ్రాజ్యవాదులలో కొందరు పనికట్టుకొని వారిలో ఈ భ్రమలు కలిగించారు. ఏది ఏమయినా విదేశాలలో మార్కెట్లు దొరకకపోతే తాము విస్తరించడం సాధ్యంకాదని పెద్దపెట్టుబడిదారులు అర్థంచేసుకొన్నారు. యూనియన్ ప్రభుత్వంలోని మంత్రులు ఆగ్నేయాసియా దేశాలకు సరుకులు ఎగుమతి చేయడాన్ని గురించి మాట్లాడుతున్నారుకూడాను. సామ్రాజ్యవాదులతో చేరి ఆగ్నేయాసియా దేశాల ప్రజల్ని దోచుకోవాలనే ఆశ నేడు బూర్జువా రాజకీయాలలో ప్రధానస్థాన మాక్రమిస్తూంది. వలసరాజ్యాల పద్ధతిని ఎలావున్నది అలాగే వుంచి పెట్టుబడిదారీ పద్ధతులమీద పరిశ్రమలను అభివృద్ధి చేయాలనే ధోరణికి పర్యవసానమే విదేశపు మార్కెట్లకోసం తాపత్రయపడటం.

వెంటనే కావలసిన అవసరాలకోసం ఇండియా

బూర్జువావర్గానికి సామ్రాజ్యవాదులతో సహకరించడం అత్యావసరం. పాతయంత్రాలు మార్చడానికి, పరిశ్రమలు నిలబెట్టుకొనేటందుకై సరుకులు ఎగుమతిచేయడానికి, యంత్రసామగ్రి తెప్పించుకోడానికి, స్టెర్లింగు నిలవలు తెచ్చుకోడానికి సామ్రాజ్యవాదులతో ఇండియా బూర్జువావర్గం సహకరించాలి సామ్రాజ్యవాదుల సహకారం లేకుండా వారు పరిశ్రమలు క్రమంగా నడుపుకోలేరు; వాటిని విస్తరింపచేయనూలేరు.

ఇవి ఒక విషసంధిరోజులని పెట్టుబడిదారులు ఎగుగుదురు. యుద్ధంవలన సర్వనాశనమైన దేశాలు కోల్కొని పోటీకివచ్చేలోపున తమ పరిశ్రమలు వ్యాప్తమై కొత్తమార్కెట్లను ఆక్రమించాలి. లేదా దివాలాతీయవలసిందే. అందుకే సామ్రాజ్యవాదుల సహకారానికి వారంత తాపత్రయపడటం.

అందుచేతనే సహకరించే ఈవాంఛ వలసవిధానాన్ని నిలబెట్టడానికి దారితీస్తోంది. సంయుక్తంగా పరిశ్రమలు నడిపేటందుకై ఇచ్ఛాపూర్వకంగా విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తున్నారు. ఆవిధంగా విదేశపునాణాలబాధా, ప్రభుత్వంద్వారా రుణం తీసుకోవాలనే యిబ్బందీ లేకుండా చేసుకోవాలని వారి ఉద్దేశ్యం. ఈసహకారం వల్ల సంయుక్త యాజమాన్యం క్రింద ఏర్పడే సంస్థలు (జాయంటు కంపెనీలు) అమలులోనికి వస్తాయి (యింకా అమలులోనికి రాలేదు). ఇండియన్ పెట్టుబడిదారుల చేతులలో తగినంత యంత్రసామగ్రి లభిస్తుంది. అందుకే ఇతర వలసదేశాల మార్కెట్లలోనికి ప్రవేశింపనిచ్చేందుకు ప్రతిగా విదేశ పెట్టుబడులను ఎన్నో, విశేషమైన సౌకర్యాలు కలిగించడానికి ఆమోదిస్తున్నారు.

ఇండియన్ పెట్టుబడిదారులు ప్రణాళికలు తయారు చేసుకొన్నా, జాయింటు పరిశ్రమలు అమలులోకివచ్చి ఉండ లేదు. యంత్రసామగ్రి తెచ్చుకొనేటందుకు మరో మార్గము లేక ఇండియను పెట్టుబడిదారులు యంత్రాలపై గుత్త అధి కారంగల సామ్రాజ్యవాదులు అడిగినవన్నీ యివ్వడానికి సిద్ధముగా ఉన్నారు. వలసలలో పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి అంటే ఇంతే.

ఇండియను బూర్జువావర్గం, దేశంలో కల్లోలాలు లేకుండా చేసుకొని, కార్మికులిని అణచివేసి, చవకగా కార్మి కులు పనికి దొరికేటట్లు చేసేవరకూ సామ్రాజ్యవాదులు వారితో బేరానికి దిగరు. ఆబేరంతో బాటు ఆర్థిక రాజకీయా లకు సంబంధించిన ప్రధాన సమస్యలపైకూడా ఒప్పందం కుదరాలి.

సామ్రాజ్యవాదులు కోరగా, ఇండియను బూర్జువా వర్గం ఆమోదించిన కోరికల్నిగనుక చూస్తే సామ్రాజ్యవాదు లతో సహకరించడం అంటే ఏమిటో పూర్తిగా అర్థమవు తుంది.

హవానాలో జరిగిన వ్యాపారపు ఒడంబడిక ప్రకారం విదేశీ పెట్టుబడి, దేశీయ పెట్టుబడితో సంపూర్ణ సమానత్వా న్నికోరుతూంది. ఏపరిశ్రమన్నా ప్రభుత్వం తీసుకొంటే పూర్తి ప్రతిఫలం ముట్టచెప్పాలట. అంటే దాని అర్థం పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడాన్ని నిలపమని అడగడమే. ఈకోరికను ఆమోదిస్తూ ఈమధ్య ఇండియా ప్రభుత్వం తన విధానాన్ని స్పష్టపరుస్తూ ఒక ప్రకటనను చేసింది.

ఐదేళ్లవరకు పరిశ్రమలను ప్రభుత్వపరంచేయడం వుండదని వారు చెప్పేశారు. హవానా వ్యాపార ఒడంబడిక దేశీయ విదేశీయ పెట్టుబడులమధ్య భేదం చూపరాదని కోరింది. ముందుగా చర్చించితేగాని విదేశీయ పెట్టుబడులమీద సుంకాలు విధించరాదంది. దానికి పూర్తిగా రక్షణయివ్వాలన్నది. అంటే కార్మికులనుండి రక్షణ కావాలన్నమాట. పరిశ్రమల విషయంలో ప్రభుత్వం కలుగచేసుకోదని హామీ వుండాలన్నమాట.

పరిశ్రమలు బూర్జువా పద్ధతిలో అభివృద్ధి పొందాలన్నా విదేశపు మార్కెట్లలోకి ప్రవేశం ఇవ్వాలన్నా వారు కోరిన షరతు లివి.

ఇండియాకు అమెరికా రాయబారిగా వచ్చిన తలబిరుసు గ్రాడీ అనేక ఉపన్యాసాలలో ఇవే షరతులను బహిరంగంగానే తెలియపరచాడు. అమెరికను సామ్రాజ్యవాదుల కోరికలకు అనుకూలంగా, ఇండియాను దోచుకోవడంలో ఆటంకాలనేవి ఉండకుండా ఇండియా సుంకాల పద్ధతిలో పూర్తిగా మార్పులు చేయాలనే విషయాన్ని 1947 ఏప్రియల్‌లో న్యూయార్కులో ఉపన్యసిస్తూ గ్రాడీ యిలా స్పష్టపరిచాడు.

"నేను ఇండియాలో విదేశపు కంపెనీలు ఉత్పత్తి విధానాన్ని కొనసాగించకుండా ఆటంకాలు కలిగిస్తూన్న ఈనాటి సుంకాల చిక్కును, ఆమాదిరిగానే అధికంగా ఆర్థిక సహకారం చేయడానికి వీలులేకుండా అడ్డంకులుగా ఉన్న ఇతర అడ్డాలను తొలగించడానికి ఒడంబడికలూ, ఒప్పందాలూ కుదుర్చుకోవాలి. సూక్ష్మంగా చెప్పాలంటే విదేశీయ

పారిశ్రామిక సంస్థలు గడించే లాభాలమీద పన్నులు వేయడం పనికిరాదన్నమాట.

ప్రపంచం కోలుకోవడం జరగాలన్నా, అమెరికా సహాయసానుభూతులు లభించాలన్నా, రక్షణసుంకాలను తీసివేయాలని గాంధీ అన్నాడు. (కలకత్తా, అక్టోబరు 28, 1947).

రెండు ప్రభుత్వాలమధ్య ఒడంబడికలు చేసుకొనీ, కొందరికి ప్రత్యేకసౌకర్యాలు చూపించీ, వాణిజ్యసంబంధాలు ఏర్పరచే పద్ధతి పోయి, ప్రపంచమంతా ఒకే ఒక వ్యాపార విధానం క్రిందికివస్తేతప్ప ప్రపంచాభివృద్ధికి ఆటంకాలుతప్పవు.

1947 నవంబరులో గ్రాంధీ కలకత్తాలో మాట్లాడుతూ ఇలాగ అన్నాడు: ఇండియాప్రభుత్వం పరిశ్రమ లన్నింటినీ ప్రభుత్వపరం చేయాలనే సంకల్పంతో పనులు సాగిస్తే ఇండి యాకు అప్పులివ్వడం విషయమై ఎక్స్పోర్టు అండ్ ఇంపోర్టు బ్యాంకు ఎటువంటి దృక్పథం అవలంబించేది చెప్పలేను. ప్రభుత్వ పరిశ్రమలకు, వ్యక్తిగత పరిశ్రమలకు మధ్యంతరంగా ఉండే విధానాన్ని అవలంబిస్తేమాత్రం అటువంటి ఇబ్బంది ఉండకపోవచ్చు.

ఆ విధంగా పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడానికి నిజంగా విరుద్ధంగా ఆతడు తన భావాల్ని వ్యక్తపరిచాడు.

ఈ తలతిరుగుడు డిమాండులకు ఇండియాప్రభుత్వం నీళ్ళునములుతూ, మాటవరుసకు అక్కడా ఇక్కడా ఒకటి రెండు సవరణలు ప్రతిపాదించి ఒప్పుకొంది.

1947 డిశెంబరులో కలకత్తాలో అసోసియేటెడ్

ఛాంబర్స్ ఆఫ్ కామర్సు సభలో వుపన్యసిస్తూ నెహ్రూ ఇలాగ అన్నాడు:

"విదేశీ పెట్టుబడులు వేటికీ ఇండియాలో ప్రత్యేకహక్కులను అంగీకరించం. దేశంలో కొన్నివేళ్ళవరకూ కావలసినన్ని అవకాశాలుంటాయి. ఇండియా అభివృద్ధి క్రమంలో ఇతర దేశాలతో సహకారాన్ని వాంఛిస్తున్నాం. ఇండియాలో ఉన్న బ్రిటిష్ పెట్టుబడిదారులు, ఇతర దేశాల పెట్టుబడిదారులు విస్తృతములయిన యీ అవకాశాల నుపయోగించుకోగలరనీ ఉపయోగించు కొంటారనీ విశ్వసిస్తున్నాము."

ఇండియాపై పెత్తనం చేయాలని తాపత్రయ పడుతూన్న విదేశ పెట్టుబడులకు యీవిధంగా స్వాగతమిస్తూ, ప్రత్యేక సౌకర్యాలు వుండవని మాటవరుసకు ఓమాట అన్నా పెద్ద విశేషం లేదు. ఇండియా ప్రభుత్వం విదేశీయుల సహాయానికి ఎలా దేబిరిస్తూందో దీనినిబట్టి గ్రహించవచ్చును.

కార్యరూపంలోకి వచ్చేటప్పటికి ప్రభుత్వం విదేశీయ పెట్టుబడిదారుల కోరికలన్నింటికీ తలవూపుతూంది.

జనవరి నెలలో న్యూఢిల్లీలో సమావేశమైన పరిశ్రమలకు సంబంధించిన సభలో ఇండియా పెట్టుబడుదారులకు ప్రభుత్వం రహస్యంగా ఒక హామీ తెలిపింది. అధమము అయిదేళ్ళవరకూ పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడం అనే మాట వుండదని తెలిపి, గ్రాడీ డిమాండును ఆమోదించారు. గ్రాడీకోరిన తలబిరుసు కోరికలను గురించి ఆ సమావేశంలో విదేశీయ పెట్టుబడులపై చేసిన తీర్మానంలో ఒక్కమాట కూడా తడవలేదు. ఇండియాలోని విదేశీయ పెట్టుబడులు

జాతీయక్షేమాలననుసరించి పనిచేయవలసి వుంటుందనీ, ఇండియా పెట్టుబడిదారులూ, విదేశీయపెట్టుబడిదారులూ చేసుకొనే లోపాయికారీ ఏర్పాట్లకు ప్రభుత్వపు అనుమతి గావాలనీ మాటమాత్రం ఒకటి పెట్టారు.

వాటికి ఫలితంగా వచ్చేది పారిశ్రామిక విప్లవంకాదు. జమీందారీ బానిసత్వంనుంచి, వ్యావసాయిక ఆర్థిక విధానము విముక్తి పొందటం జరుగదు. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదుల స్వార్థాలకు దెబ్బ తగులకుండా, దేశంలో పేరుకొని ఉన్న పెట్టుబడికి దారి చూపించేటందుకై ఒకమాదిరి పారిశ్రామికాభివృద్ధి మాత్రమే కలిగిస్తుంది. ఆ అభివృద్ధి ప్రపంచాన్ని కొల్లగొట్టేటందుకై ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదుల దోపిడీ ఎత్తుగడల చట్రంలో కుదించుకొని వారి యుద్ధ వ్యూహంలోకి ఇండియాను కూడా ఈడవడానికి తోడ్పడుతుంది.

దీనినే బూర్జువా ఆహ్వానించినట్లయితే బూర్జువా ఉద్దేశాలయొక్క జాతీయ వ్యతిరేక స్వభావాన్ని, సంకుచిత తత్వాన్ని నిరూపించుతుంది. కాని ప్రజాసామాన్య దృష్టిలో ఇది భూస్వామిక విధానాన్ని కొనసాగించుటయే అన్నమాట. తక్కువ వేతనాలను అలాగే సాగించుటయే అన్నమాట. పారిశ్రామిక విప్లవం లేదన్నమాట. నిరంతర దారిద్ర్యం, నిరుద్యోగం, సంక్షోభం, క్షామం, ఇవీ పెట్టుబడిదారి వ్యవస్థకు అంటగట్టినందున కలిగే ఫలితాలు. విదేశ సామ్రాజ్య వాదులతో సహకరించి సంయుక్తంగా దోపిడీ సాగించుటవలన ఫలితాలు. భారతీయ బూర్జువా, దాని ప్రతినిధియైన జాతీయ

నాయకత్వమూ, బ్రిటన్ అమెరికాలపై ఆర్థికంగా ఆధారపడే స్థితికి - వాటికి లొంగిపోయే పరిస్థితికి-ప్రజల దారిద్ర్యము పెంపొందే స్థితికి - ఇండియాను కొనిపోతున్నారు.

వలస దేశవ్యవస్థ సంకెళ్లనుండి, భూస్వామ్యవిధానం నుండి, సంస్థానాధీశులనుండి, విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారుల నుండి, ప్రజాతంత్రవిప్లవం ద్వారానే ప్రజలు తమను విముక్తి చేసుకోగలరు. అట్టి ప్రజాతంత్ర విప్లవానికి వ్యతిరేకంగా ఆర్థిక, రాజకీయ సమ్మేళనమే పెట్టుబడిదారీ వర్గం విదేశ సామ్రాజ్యవాదులతో కలిసిపోవడానికి అర్థం. వ్యావసాయిక విప్లవానికి వ్యతిరేకంగా, పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడానికి వ్యతిరేకంగా, జీవనానికి సరిపడే వేతనాలు, ప్లానింగ్ లకు వ్యతిరేకంగా, పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడం ద్వారానే సాధ్యమయేటటువంటి విస్తృత పారిశ్రామిక విస్తరణకు వ్యతిరేకంగా - పెట్టుబడిదారీ వర్గం విదేశసామ్రాజ్యవాదులతోటి కలయిక పనిచేస్తుంది. ప్రస్తుతవ్యవస్థను - అంటే సామ్రాజ్యవాదం క్రింద బూర్జువా చిన్న భాగస్వామిగా పనిచేసే ప్రస్తుతవ్యవస్థను ఆ కలయిక కాపాడుతుందన్నమాట.

## సామ్రాజ్యవాదానికి బూర్జువా సహకారం అవసరం

బూర్జువా సహకారం అటుపక్కనుంచి సామ్రాజ్యవాదులకూ కావాలి. లేకపోతే ఒక ప్రశ్న అడుగవచ్చు. బూర్జువా అంత పరాధీనపడి ఉంటే, సామ్రాజ్యవాదులు పాతపద్ధతినే ఎందుకు కొనసాగించరాదు? చిన్న భాగం మాత్రం వాళ్ళకు ఎందుకు ఈయాలి?

మొదటిది: యుద్ధం, ఇండియా బ్రిటనుల మధ్య ఆర్థిక సంబంధాలలో కొంతమార్పు తెచ్చింది. స్టెర్లింగ్ రుణాన్ని తిరిగి చెల్లించడంఅంటే యీయకుండా వస్తువులను కొల్లలుగా దిగుమతి చేసుకొనే శక్తి బ్రిటన్‌కు తగ్గిపోవడమన్నమాట. ఆ విధంగా యిండియా ముడిపదార్థాలపై ఆధారపడే అవకాశం సన్నగిల్లడం అన్నమాట. ఇంతేగాక తన వస్తువులను ఇండియాకు ఎగుమతిచేసుకొనే సామర్థ్యంకూడా తగ్గిపోతుంది. అందుచే ఇండియాలో కొత్తగా పెట్టుబడి పెట్టవలసిన అవసరం బ్రిటనుకు ఏర్పడింది. అలా పెడితే, పూర్వం తీర్చవలసిన అప్పులు తీర్చివేయగలుగుతుంది. భారతీయుల వర్గం తమవైపు మొగ్గేటట్లు చేసుకోగల్గుతుంది. అందుచే, బ్రిటన్ తన సామ్రాజ్యవాద ప్రయోజనాలకోసం, కొత్తపెట్టుబడిని పెట్టుకోగల్గాలి. అదేసమయాన తమదేశంలో ప్రధాన పరిశ్రమలతో పోటీరాకుండా చూచుకోవాలి.

రెండవది: భారతీయ బూర్జువాను బుట్టలోవేసుకోక పోతే, అమెరికా దానితో ఒడంబడిక చేసుకుంటుందని బ్రిటన్ భయపడుతూంది. అమెరికా సహాయం పొందిన భారతీయ బూర్జువా, తనకు రెండవ ప్రతిద్వంద్విగా తయారు కావచ్చునని అది భయపడుతుంది. అందుచే కొన్ని సౌకర్యాలు బ్రిటన్ భారతీయ బూర్జువాకు ఇచ్చి సహకారాన్ని సంపాదించాలి.

మూడవది: ఇంతేగాక భారతీయ పెట్టుబడిదారీవర్గం ప్రతికూలపక్షంలో ఉంటే బ్రిటనుకు చాల శక్తివంతమైన శత్రువు అవుతుంది. పూర్వంలాగా బలహీనమైనది కాదది

పూర్తిగా బ్రిటిష్ పరిశ్రమలనే నెలకొల్పే ప్లాను మొదలు పెడితే, భారతీయ బూర్జువాకు ఏమాత్రం సౌకర్యాల నీయకుండా తిరస్కరించితే, భారతీయ పెట్టుబడిదారీవర్గం అందుకు వ్యతిరేకంగా శక్తివంతమైన జాతీయోద్యమాన్ని ఉపయోగించుకోగలదు. పూర్తిగా బ్రిటిషు పరిశ్రమలనే స్థాపించడం, ప్రభుత్వసహాయం వాటికి కేంద్రీకరింపజేయడం అసాధ్యమయేటట్లు భారతీయ పెట్టుబడిదారీవర్గం చేసింది. బ్రిటిష్‌వాళ్లు పెట్టుబడి పెట్టనీయకుండా వారి దోపిడీని సాగనీయకుండా అడ్డంకులు పెట్టగల స్థితిలో అదివుంది.

ఇక రాజకీయంగా చూద్దాం. పూర్తిగా సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని భారతీయ బూర్జువాను తమ వైపుకు లాగుకోకుండా నడపటం ఎలా అసాధ్యమో అలాగే పట్టి బ్రిటిష్ పరిశ్రమలను స్థాపించడంకూడా సాధ్యంకాదు. శాంతి భద్రతలను, జాతీయ బూర్జువా సహాయంలేనిదే కాపాడలేరు. సమ్మెలను అణచలేరు. ప్రజలను కంట్రోలు చేయగలిగిన బూర్జువాకు ప్రాతినిధ్యం వహించిన — జాతీయ నాయకత్వ సహాయం లేనిదే బ్రిటిష్‌వాళ్ళ ప్రాణాలకు రక్షణలేదు.

అందుచేత పాత వ్యవస్థను రక్షించడానికి ఆర్థికంగాను, రాజకీయంగాను బేరాలు అవసరమైనవి.

ఒడంబడిక బేరంకుదరాలంటే, భారతీయ బూర్జువాను ఆర్థికంగాను, రాజకీయంగాను సంతృప్తి పరచాలి. అందుచేత అధికారం అప్పగించామనడం పెద్దగా భారతీయ బూర్జువాను సంతృప్తిపరచడానికే. విశాల ప్రదేశంలో మనుష్యబలంపైన, సహజసంపదలపైన అధికారం భారతీయ బూర్జువాకు — చిన్న

భాగస్తుడుగానైనా - సంక్రమించడం, వారు కంటున్న కలలు సార్థక మవడమే.

విప్లవంయొక్క దృష్టిలో, యికమీద బూర్జువాజీ వలసదేశ వ్యవస్థను కాపాడుతుందని దీని కర్థం.

"సమానుల మధ్య ఒడంబడికలు చేసుకోవాలంటూ దీనితోపాటు యిపుడు, వర్తకం- పరిశ్రమలు-వాణిజ్యం మొదలగు వాటికి సంబంధించిన ఒడంబడికలకై రాయబారాలు సాగుతున్నాయి. ఈఒడంబడిక లన్నిటికీ పైన చెప్పిన షరతులే వర్తిస్తాయి. ఈఒడంబడికలు యిండియాను బానిసగా చేస్తాయి. కాని యిండియాను దోచుకోవడంలో బ్రిటనుయొక్క చిన్న భాగస్తుడుగా బూర్జువాకు అవకాశం లభించుతుంది. ఎగుమతులు పారిశ్రామిక యంత్రసామగ్రి మొదలైన వాటికి సంబంధించిన సౌకర్యాలు ప్రజావసరాలకు తగినట్లుగా రాకపోయినా, వలసదేశ బూర్జువా స్వార్థ సంకుచిత అవసరాలకు అది చాలు. బ్రిటిష్‌వారితో సహకరించడానికి విద్రోహానికి అది చాలు. ఈ రెండువర్గాల (బ్రిటిష్ - ఇండియన్ బూర్జువా వర్గాల) సహకారానికి ఆర్థిక, రాజకీయ ప్రాతిపదిక ఇదే.

# 3 యుద్ధానంతర విప్లవ విజృంభణ సామ్రాజ్యవాదుల - ఇండియా బూర్జువా వర్గాల - నూతన పాలసీలు నూతనవర్గ సమ్మేళనం

యుద్ధకాలంలో సామ్రాజ్యవాదు లవలంబించిన తీవ్రతరమయిన దోపిడీ విధానమూ, ఆర్థిక సంక్షోభమూ కలిసి కష్టజీవులైన ప్రజాసామాన్యాన్ని దుర్భరమైన కష్టాలకూ కరువులకూ గురిచేసింది. ప్రజల రాజకీయచైతన్యం ఎక్కువయి పోరాటానికి సంసిద్ధులయ్యారు. ఆ రెండూ వెనకవైపునుండి బ్రహ్మాండమైన శక్తితో పనిచేస్తూ యుద్ధానంతర కాలంలో కూడా ప్రజలలో విప్లవపోరాటాలు విజృంభించటానికి తోడ్పడుతున్నాయి.

బ్రిటిష్‌సామ్రాజ్యవాద నీతిజ్ఞులు పైకి తాము శాంతముగా అధికారం వొప్పచెప్పేసి, ఇండియా వీడిపోతున్నామని చెప్తూన్నా తెరవెనుక ప్రజాపోరాటాల నణచివేయడానికై సైనిక సన్నాహాలు రహస్యంగా చేసుకొంటూనే ఉన్నారు. లీగ్‌నూ, కాంగ్రెస్‌నూ ఒకదానికొకటి పోటీపెట్టి అంతర్యుద్ధం రెచ్చగొట్టడానికి వెనుకనుంచి ఎన్నో కుట్రలు చేస్తూనే వున్నారు. కాంగ్రెసు, లీగునాయకులు రాజీపంథాల నవలం

బిస్తూ, పోరాటాలకు వ్యతిరేకంగా విచ్ఛిన్నకరధోరణిలో పని చేస్తూన్నారు. ఇన్ని కష్టాలనూ ఎదుర్కొని పట్టణాలలో కార్మికులూ, వుద్యోగులూ సాగిస్తున్న పోరాటాలు, పల్లెటి ప్రాంతాలలో రైతులూ, కౌలుదార్లూ, బానిసలూ సాగిస్తున్న పోరాటాలు, జమీందారీ యుగాలనాటి నిరంకుశపాలన క్రింద నలిగిపోతున్న సంస్థానప్రజలు సాగిస్తున్న పోరాటాలు 1945-46 లలో క్రమేపీ తీవ్రమై నలుమూలలా వ్యాపించినాయి.

ఈ పోరాటాల విసురు సాయుధసైన్యాలకు కూడా తగిలింది. సామ్రాజ్యవాదుల సేనలలో తిరుగుబాట్లు, విప్లవాలు, సమ్మెలు, హర్తాళులు, ప్రారంభమయి సాయుధపోరాటాలుగా మారినాయి. గాంధీగారి అహింసాయుతమైన భారతదేశం నేడు హఠాత్తుగా ఆయుధాలు చేతబట్టింది. తీవ్రపోరాటాలు రాకుండా పాతిక ఏళ్ళుగా కాపలా కాచిన బూర్జువా వర్గపు శ్రమ పనికిరాలేదు. పోరాటాలు ఆయుధ సంఘర్షణలుగా అభివృద్ధి పొందడంతో విప్లవపోరాటంలో నూతన దశ ఏర్పడింది. సామ్రాజ్యవాదాన్ని కష్టజీవులైన ప్రజాసామాన్యం ధిక్కరించి నిలబడే అంతిమఘట్టం తటస్థపడింది. ప్రజాతంత్ర విప్లవంయొక్క విజయం తథ్యమయ్యే రోజువచ్చింది.

ఈ ఆర్థిక రాజకీయ పోరాటంలో కార్మికవర్గం ధరించిన పాత్ర మరొక ప్రధానలక్షణం. బూర్జువావర్గం పోరాటాలు వద్దంటూవుంటే జాతీయ కాంగ్రెసు పోరాటాలకు దూరంగా తప్పుకొంటూంటే - శ్రామికవర్గం సాగిస్తూన్న పోరాటాల ముందునిలచి, ప్రజా సమీకరణకు కేంద్రాలు అవుతూన్నాయి. జాతీయ నాయకులు తీవ్రంగా ప్రతిఘటి

స్తూన్నా ఎన్నో బ్రహ్మాండమైన పోరాటాలను వారు నడిపించారు.

ఆర్థికపు కోరికలకొరకై విజృంభిస్తున్న సమ్మెలు రాజకీయముతైన అసమ్మతి సమ్మెలలో కార్మికవర్గం విశేషంగా పాల్గొంటూండడం ఇది దేశవ్యాప్తమైన పెద్ద సమ్మెకు దారి తీస్తున్నాయి. దీనికి సాయుధసేనల, ప్రభుత్వోద్యోగుల తోడ్పాటు సమకూడింది.

అటువంటి తీవ్రత ఇండియాలో ఎప్పుడూ రాలేదు. ప్రజల ఒత్తిడిముందు సాయుధసేనలు అంత సులభంగా చితికి పోవడం ఇదివరకెన్నడూ జరుగలేదు. అంత తెగువతో, అంత పరాక్రమంతో కార్మికవర్గం ఎన్నడూ పోరాడి ఉండలేదు.

సామ్రాజ్యవాదం పూర్తిగా కూలిపోయేస్థితి వచ్చింది.

జాతీయ సమస్యలమీదనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక సమస్యలమీదనూ, అసమ్మతి సమ్మెలకు పిలుపునిచ్చినపుడు కార్మికులు చూపిన ఉత్సాహం గనక చూస్తే, సమ్మెలలో పాల్గొంటూన్న కార్మికులు, పోరాటాలకు ఎంత సంసిద్ధత చూపుతున్నారో గ్రహించవచ్చును. ఈ సమ్మెల సంరంభం ఇతరపనివారిలోకి, బ్యాంకుగుమాస్తాలు, బంట్రోతులు, ప్రాథమికోపాధ్యాయులు, ప్రభుత్వోద్యోగులలోకి కూడా తీవ్రంగా వ్యాపిస్తోంది.

సాయుధసైన్యాలలోకూడా ఆ మాదిరి కదలికే ప్రారంభమైనది. దేశభక్త్యావేశపూరితులైన అజాద్ ఫౌజు సైనికులను వేలమందిని పట్టుకొని కాన్సెంట్రేషన్ క్యాంపులలో పెట్టి,

1945 లో సామ్రాజ్యవాదులు హింసించారు. విజయోన్మాదంతో అజాద్ ఫౌజు నాయకులమీద రాజద్రోహ నేరాలు మోపి విచారణ ప్రారంభించారు. దానితో దేశంద్రోధోద్రిక్తమయింది. వారందరినీ బేషరతుగా వదలిపెట్టాలని గద్దించింది.

1945 నవంబరులో కలకత్తా కార్మికులు, విద్యార్థులూ అసమ్మతి హర్తాళ్ లు, సమ్మెలు, ప్రదర్శనాలు చేయడానికి దారితీశారు. కాంగ్రెసు-లీగు-కమ్యూనిస్టు పార్టీల జెండాల క్రింద కలసి వారు వీధులలోనికి కదిలారు. మిలటరీ, పోలీసులు వారిపైన కాల్పులు చేశారు. యుద్ధానంతర దశల, స్వతంత్రయోధులు మొట్టమొదటిసారి వీరమరణం పొందినది ఈ పోరాటాలలోనే.

ప్రజలలో బయలుదేరిన తుపానుముందు 1946 జనవరిలో బ్రిటిషు సర్వసైన్యాధిపతి ఖైదీల నందరిని విడిచిపెట్ట వలసివచ్చింది.

అజాద్ ఫౌజును విడిచిపెట్టాలని బయలుదేరిన ప్రదర్శనాల వెనువెంటనే, రాయల్ నౌకాదళంలోని రాయల్ వైమానికదళంలోని సైనికుల అసంతృప్తి బయటబడింది. వైమానికులూ, నావికులూ, కోరినదల్లా తమతోడి బ్రిటిష్ సైనికులతో సమంగా తిండి మొదలైనవి ఇవ్వాలని మాత్రమే.

నావికాసైనికులు సమ్మె చేసారు. ఓడరేవులోనూ, ఓడల్లోనూ తమ హక్కులు తమ కోర్కెలు తీర్చాలని "నిరశనవ్రతం" ప్రారంభించారు. తమ కోర్కెలను తీర్చాలంటూ బొంబాయి నగరంలో ప్రదర్శనాలు చేసారు. ఐ. యన్. ఏ. ఖైదీలను విడుదల చేయాలని ఇండోనేషియా

నుండి భారతసైనిక దళాలను వెనక్కు రప్పించాలనీ నినదిం చారు. తమ ఓడలమీద కాంగ్రెసు, లీగు, కమ్యూనిస్టు జెండాలను ఎగురవేసారు.

నావికా సైనిక హృదయాలలో జ్వలించిన యీ నూతన దేశభక్తిని చూచేసరికి అధికారుల గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. ఈతిరుగుబాటును అరెస్టులతోను, తుపాకీ గుండ్లతోనూ, అణచడానికి పూనుకొన్నారు. అప్పుడు నావికా సైనికులు ఓడలను స్వాధీన పరుచుకొన్నారు. ఎదురు కాల్పులు సాగించారు. బొంబాయి, కరాచి నావికా సైనికుల ప్రతిఘటన స్వల్పకాలమే అయినప్పటికీ, నూతన విప్లవదశకు ప్రారంభోత్సవము చేసింది. వారు పూరించిన దేశభక్తి శంఖారావం భారత సైనిక శిబిరాలన్నిటిలోను మారు మోగింది.

నావికులకు (ఆర్. ఐ. యన్.) సానుభూతిగా వైమానికులు (ఆర్. ఐ. ఏ. యఫ్) సమ్మె చేసారు. తిరుగుబాటుదార్లను కాల్చమని భారతీయసైనిక దళాలను ఆజ్ఞాపించింది ప్రభుత్వం. కాని వారు నావికులపై తుపాకులు కాల్చేందుకు నిరాకరించారు.

మన స్వాతంత్ర్య సంగ్రామంలో నూతన దశకు చిహ్నమైన యీ నావికా తిరుగుబాటు ప్రాముఖ్యతను భారత కార్మికవర్గం గ్రహించింది. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన "తిరుగుబాటును" బలపరుస్తూ, బొంబాయి, కలకత్తా, తిరుచునాపల్లి, మదరాసు, మధుర మొదలైన నగరాలలో పెద్ద ఎత్తున అసమ్మతి సమ్మెలు హర్తాళ్లు నడిపింది.

శ్రీయుత వల్లభాయిపటేలు వగైరా కాంగ్రెసునాయ

కత్వం వ్యతిరేకించినప్పటికీ, 1946 ఫిబ్రవరి 22 తేదీన బొంబాయిలో బ్రిహ్మాండమైన సమ్మె, హర్తాలు జరిగింది. తిరుగుబాటును రూపుమాపబూనుకున్న అడ్మిరల్ గాడ్ ఫ్రేకు బొంబాయి ప్రజలు ఎదురుసవాలు చేసారు. ఈ ఎదురు సవాలు సామ్రాజ్యవాద అధికారవర్గానికి గుండెదడ పుట్టించింది. టాంకుదళాలతో, సాయుధమోటారుదళాలతో నగర వీధుల్లో పైశాచికనృత్యం చేసారు. రెండు రోజుల్లో 200 మంది పౌరులు తుపాకిగుండ్లకు బలి అయ్యారు.

నావికాతిరుగుబాటూ దానిని బలపరుస్తూ దేశమంతటా కార్మికవర్గనాయకత్వాన సాగిన ఐక్యసమ్మె ప్రదర్శనాలూ కేవలం ఒంటరిపాటుగా జరిగిన ఘటనలు మాత్రమే కావు. భారతీయ హృదయాలలో సైనికశిబిరాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ద్వేషం రగిలి రాజుతూవుంది. భారతదేశం ఒక అగ్ని పర్వతంలా ఉంది. సామ్రాజ్యవాద - రాచరిక పరిపాలనా విధానాన్ని భస్మీపటలం గావించే అంతిమ పోరాటానికి ఆ అశాంతిజ్వాల సంసిద్ధ మవుతూవుంది. ఆ విప్లవజ్వాలా ప్రజ్వలన చిహ్నమే యీ నావికా "తిరుగుబాటు".

ఈ "విప్లవచిహ్నాన్ని" గ్రహించగలగాలంటే - ఆసంవత్సరం మొదటి ఆరునెలల్లోనూ జరిగిన ఉజ్వల ఘట్టాలనూ, ప్రజా పోరాట చర్యలనూ ఒకసారి స్ఫురణకు తెచ్చుకోవాలి.

ఆర్. ఐ. యన్. సమ్మె జరిగిన వారం రోజుల్లోనే జబల్పూరులో 300 మంది సిపాయిలు సమ్మె చేశారు. కాంగ్రెసు, లీగు, కమ్యూనిష్టు జెండాలతో పురవీధులన్నీ పెరేడ్ (ప్రదర్శన) చేశారు (మార్చి 4).

సామ్రాజ్యవాదులు చేస్తున్న "విజయోత్సవాలకు" అసమ్మతిగా మార్చి 8 న ఢిల్లీ కార్మికులు, ప్రజలు సమ్మె, హర్తాలు జరిపారు. టౌనుహాలుమీద దాడిచేసి నిప్పంటించారు.

తమపై అధికారులు చేస్తున్న అవమానకర రిమార్కు-లకు అసమ్మతిగా మార్చి 18 న డెహ్రాడూన్‌లోని గూర్ఖా సైనికులు తిరుగబడ్డారు.

జీతాల పెంపుదలకోసం ఢిల్లీ పోలీసులు నిరశనవ్రతం చేశారు. (మార్చి 19).

ఏప్రిల్ మూడవ తేదీన పదివేలమంది బీహారు పోలీసులు సమ్మె చేసారు.

సైనికుల్లోనూ, పోలీసుల్లోనూ, కలిగిన సాయుధ తిరుగుబాటు వాతావరణానికి తోడుగా, కార్మికవర్గంలో బ్రహ్మాండమైన "సమ్మెల తరంగం" వీచింది.

ఈవిప్లవ ఘటనల ప్రభావ ఫలితాలు, నిరంకుశ సంస్థానాలలో మగ్గిపోతున్న సంస్థాన ప్రజలలో మున్ముందుగా ఆచరణలోకి వచ్చాయి.

కాశ్మీర్ నిరంకుశ డోగ్రాపరిపాలన అంతం కావాలనీ, తక్షణమే ప్రజా తంత్ర రాజ్యాంగం అమలు పర్చాలనీ 1946 మే నెలలో కాశ్మీర్ ప్రజానాయకుడు షేక్ అబ్దుల్లా ఉద్యమాన్ని ప్రారంభించాడు. కాశ్మీర్ రాజు వెంటనే షేక్ అబ్దుల్లాను అరెస్టు చేశాడు. కాశ్మీర్ ప్రజానీకాన్ని చిత్రవధ చేయడం ప్రారంభించాడు. కాని కాశ్మీర్ ప్రజలు వీరోచితంగా ప్రతిఘటించారు.

నిరంకుశ సంస్థాన పరిపాలనా విధానాన్ని తుద

ముట్టించే సంస్థాన ప్రజల అంతిమ పోరాట నూతన దశకు 'కాశ్మీర్ పోరాటం' నాంది. భారత ప్రజానీకం యావత్తూ కాశ్మీర్ ప్రజాపోరాటాన్ని అన్ని విధాలా బలపర్చింది.

నావికా తిరుగుబాటు, ఐ.యన్. ఎ. విడుదల – యీ సమస్యల నాధారంచేసుకొని వచ్చిన దేశవ్యాపిత ఉద్యమం నూతనదశను సూచిస్తున్నాయి. యీ నూతనదశ కేవలం పైకి వస్తున్న అసంతృప్తి, అశాంతి మాత్రమేకాదు. స్వాతంత్ర్య సమర కార్యక్రమములో "ప్రజాతంత్ర విప్లవాన్ని సాధించడం, సామ్రాజ్యవాదాన్ని, దానితో చేతులు కలిపిన వాళ్ళనూ రూపుమాపడం" తక్షణకర్తవ్యాలుగా శాసిస్తోంది ఈ నూతనదశ.

సామ్రాజ్యవాదాన్ని ఆవరించిన పక్షపాతం, దాని ఆర్థిక విధానం భగ్నంకావడం, అది సృష్టించిన దరిద్రం ఆకలిమంటలు మాత్రమేకాదు. ప్రజావత్తిడికి, విప్లవతరంగానికి పోలీసుసైన్యంకూడా తట్టుకోలేకపోవడంలో సామ్రాజ్యవాదానికి "సర్వాంగపక్షవాతం" సంభవించింది.

సామ్రాజ్యవాదం తనకు పట్టనున్న దుర్గతిని గ్రహించింది. రెండు బూర్జువా నాయకత్వాల (కాంగ్రెసు – లీగు) తోను సంప్రతింపులు ప్రారంభించింది.

పొంగిపొరలి వస్తున్న విప్లవతరంగాన్ని చూచి హడలిపోతున్నది, సామ్రాజ్యవాదం ఒకటేకాదు. ప్రజాపోరాటం తన చేయిదాటి పోతుందనీ, కార్మికవర్గాన్ని, పీడితవర్గాన్ని పైపైకి తీసుకువస్తోందనీ జాతీయకాంగ్రెసుయొక్క బూర్జువా ముస్లింలీగుయొక్క నాయకత్వము గుండెలు బాదుకోసాగినవి.

అందుకని సామ్రాజ్యవాదంతో రాజీకి తయారైనవి. ప్రజా పోరాటాలపై దండయాత్ర ప్రారంభించినవి.

కాంగ్రెసు–లీగు నాయకత్వాలు అనుసరిస్తున్న పాలసీలు నిజంగా వారు ప్రాతినిధ్యం వహిస్తున్న బూర్జువావర్గప్రయోజనాల ననుసరించే ఉన్నాయి. అంతేకాని వారు చెప్పుకుంటున్నట్లు అనంతప్రజానీకం వాంఛిస్తున్న సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాతంత్రవిప్లవాశయాల ననుసరించి మాత్రము కాదు.

సామ్రాజ్యవాద – రాచరిక విధానానికి వ్యతిరేకంగా జ్వలిస్తున్న ప్రజావిప్లవాగ్నిని చూచి తత్తరబుట్టిన రెండు బూర్జువానాయకత్వాలు, ప్రకటించడం తడువుగా "కాబినెట్ మిషన్" ను ఆహ్వానించి సామ్రాజ్యవాదసహకారాన్ని అర్థించడానికి సిద్ధంగా ఉన్నాయి.

బ్రిటిష్‌ప్రభుత్వరాయబారవర్గం, తన ప్రణాళికతో వచ్చేసరికి, కాంగ్రెసు నాయకత్వం పోరాటానికి మరింత వ్యతిరేకంగా తిరిగిపోయింది. కార్మికులు, కర్షకులు సాగిస్తున్న పోరాటాలను అణచివేయడానికై, కాంగ్రెసు మంత్రివర్గాలు తమ అధికారులకు సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చాయి. సంస్థానాధీశ్వరులను సంతృప్తిపరచడానికై కాంగ్రెసు నాయకత్వం సంస్థాన ప్రజాపోరాటాలకు పెడమొగం పెట్టింది. కాశ్మీర్ ప్రజలు సాగిస్తూన్న ఉజ్వల పోరాటాన్ని నట్టేటిలో ముంచింది. బ్రిటిష్ రాయబారవర్గ ప్రణాళిక ప్రకారం ప్రజాపరిషత్తుకు సంపూర్ణాధికారం ఉండదు. సంస్థానాధిపతులు యథాప్రకారం ఉంటారు. విభజించి పాలించే తమ సూత్రాన్ని ఆధారంగా చేసుకొని మనపైన పరోక్షంగా పెత్తనం సాగించేందుకు

సామ్రాజ్యవాదు లీప్రణాళికను తయారు చేసారు. ఇలాంటి ప్రణాళికను నిరాకరించడానికి బదులుగా కొద్దిపాటి విమర్శన లతో కాంగ్రెసు నాయకత్వం అంగీకరించింది

విప్లవోద్యమం విజృంభించి సామ్రాజ్యవాదాన్ని కూల ద్రోయడానికి సిద్ధమయిన సమయంలో భారతదేశ పెట్టుబడు దారులకు ప్రాతినిధ్యం వహిస్తున్న కాంగ్రెసు నాయకత్వం విప్లవోద్యమానికి ద్రోహంచేసింది. స్వార్థపరత్వంతో తమకు సాధ్యమయినంత అనుకూలంగా బేరం కుదుర్చుకోవడానికై ఈఉద్యమాన్ని ఉపయోగించుకొని, తాత్కాలికంగా విప్లవో ద్యమాన్ని విచ్ఛిన్నం చేసింది. ఈఉద్యమంనుంచి కాంగ్రెసును వేరుచేసి వెల్లువలా పొంగివస్తున్న పోరాటాలను క్రూరంగా అణచివేసి జాతీయ నాయకత్వం, సామ్రాజ్యవాద వ్యతిరేక సమరాన్ని విచ్ఛిన్నం చేసింది. అంతేకాదు, ఆపోరాటాలను అణచివేసే విధానం అవలంబించింది.

ముస్లింలీగ్ నాయకత్వం ముస్లిం పెట్టుబడిదారులకు, ముస్లిం భూస్వాములకు ప్రాతినిధ్యం వహిస్తున్నది. ఇది మొదటి నుంచి కూడ, జాతీయ వ్యతిరేకమైన విధ్వంసక శక్తిగా పని చేస్తున్నది. ఇండియాను విభజించాలనే నినాదంతో నేమి, మత తత్వంపైన ఆధారపడిన విధానంతోనేమి, కాంగ్రెసు నడిపే జాతీయ స్వాతంత్ర్య పోరాటానికి ఆటంకాలు కల్పించటం వల్ల నేమి, ముస్లింలీగ్ నాయకత్వం జాతీయ వ్యతిరేక పంథాను అవలంబిస్తూ వచ్చింది. ముస్లిం ప్రజానీకం చాలా వెనుక బడి ఉన్నది. సంస్కరణవాదదృక్పథంగల జాతీయ నాయ కత్వం ముస్లిం ప్రజానీకాన్ని జాతీయ పోరాటాల్లోకి కూడ

గట్టుకొని రాలేకపోయింది. లీగ్ నాయకత్వం ఈపరిస్థితులను స్వార్థానికి బాగా ఉపయోగించుకొంది. ముస్లిం ప్రజానీకంలో ఉన్న స్వతంత్రవాంఛను తప్పుడు దారితొక్కేటట్టు చేయకల్గింది.

"ముస్లిం స్వాతంత్ర్యం" "ముస్లింలను హిందువులనుంచి రక్షించాలి" అని వాగే ముస్లింలీగ్ నాయకత్వంయొక్క పచ్చిమోసం, బొంబాయి నావికుల సమ్మె సందర్భంలో బట్టబయలయింది. అప్పుడు జరిగిన ప్రజా ప్రదర్శనాలలో ముస్లిం కార్మికులూ, ముస్లిం ప్రజలూ పాల్గొనకూడదని జిన్నా ప్రకటించాడు. దీనివల్ల ప్రజాపోరాటాలంటే ఆయన కెంత భయమో వ్యక్తమయింది.

ఈ రోజుల్లో మొదటినుంచి కొనవరకూ, ముస్లిం ప్రజలను ఈ విప్లవవెల్లువకు దూరంచేయాలని ముస్లింలీగ్ నాయకత్వం నానాతంటాలు పడింది. కాని ఈ ప్రయత్నాలలో అది కొన్నిసార్లు నెగ్గలేదు. ముస్లిం ప్రజానీకంలో ఉన్న సామ్రాజ్యవ్యతిరేకభావాన్ని బహిర్గతం చేయడానికై లీగ్ నాయకత్వం తనంతటతానే కొన్నిసార్లు ప్రదర్శనాలు జరపవలసివచ్చింది. (అజాద్‌ఫౌజ్ ఖైదీ రషీద్‌అలీని విడుదల చేయాలని కలకత్తాలో జరిగిన ప్రదర్శనాలు) కాంగ్రెసును బెదిరించడం పైననే లీగ్ నాయకత్వం తన శక్తినంతా కేంద్రీకరిస్తూవచ్చింది. వీలయినన్ని ఆటంకాలు కల్పించి ఆరు రాష్ట్రాలు కావాలనే తన గొంతెమ్మకోర్కె సాధించాలని ప్రయత్నిస్తూవచ్చింది.

కాబట్టి లీగ్ నాయకత్వంకూడా, బ్రిటిషు రాయబారవర్గ

ప్రణాళిక ప్రాతిపదికపైన రాజీబేరాలు మొదలుపెట్టింది. ఈ విధంగా లీగ్‌నాయకత్వం విప్లవోద్యమానికి ద్రోహం చేసింది. స్వార్థానికి స్వాతంత్ర్యోద్యమాన్ని గంగపాలు చేయడానికి సిద్ధమయిన పైవర్గాలకు లీగ్ ఎలా ప్రాతినిధ్యం వహిస్తున్నదో దీనితో తేటతెల్లమయింది. వెల్లువలా తోసుకువస్తున్న విప్లవోద్యమాన్ని ఆపడానికై వెంటనే ఒక అడ్డు కట్ట నిర్మించటం అత్యవసరమని సామ్రాజ్యవాదం గుర్తించింది. కాబట్టి, కాంగ్రెసును సాధ్యమయినంతవరకు తృప్తిపరచడం తప్పని సరిఅని తెలుసుకొంది.

ఈ విప్లవోద్యమం నుండి కాంగ్రెసునూ, కాంగ్రెసు నాయకత్వాన్ని వేరుచేస్తేనే కాని తమ సామ్రాజ్యవాదవ్యవస్థను నిలబెట్టకోలేనని తెలుసుకొంది. కాబట్టె సామ్రాజ్యవాదం సంధిచేసుకొంటానని ప్రాధేయ పడింది. కాంగ్రెస్‌నాయకత్వాన్ని ఏవిషయంలోను బలవంతం చేయనని అంది.

కాని, ఇలా రాజీ బేరాల్లోకి కాంగ్రెసును దింపాక సామ్రాజ్యవాదులు తమ కనుకూలంగా ఉన్న పరిస్థితులను బాగా ఉపయోగించుకొన్నారు. విప్లవమంటే కాంగ్రెసు నాయకులకుండే గుండె బెదరు, బ్రిటన్‌నుండి వారికి ఆర్థిక సహాయం అవసరంగా ఉండటం, కాంగ్రెసు, లీగు నాయకత్వాల మధ్యవున్న తగాదాలు, నిరంకుశ సంస్థానాధీశ్వర్ల ఉనికి-వీటన్నిటినీ సామ్రాజ్యవాదులు బాగా ఉపయోగించుకొని మౌంట్‌బాటన్ ప్రణాళికకు కాంగ్రెసు నాయకత్వం ఒప్పుకొనేలా చేసింది. మొదట రాయబార వర్గం ప్రకటించిన ప్రణాళికలో ప్రత్యేక దేశవిభజనప్రసక్తి లేదు. ఇది

సామ్రాజ్యవాదులపై కాంగ్రెసు నాయకత్వం తెచ్చిన ఒత్తిడి ఫలితం. కాని పూర్తిగా కాంగ్రెసు నాయకులతో గూడిన తాత్కాలిక ప్రభుత్వ మేర్పడుతూనే లీగు ప్రారంభించిన "ప్రత్యక్షచర్య"ను ఉపయోగించుకొని, మతకలహాలద్వారా కాంగ్రెసునాయకత్వముపై సామ్రాజ్యవాదం ఒత్తిడిని ఎక్కువ చేసింది. ముస్లింలీగు తాత్కాలిక ప్రభుత్వంలో చేరుతూనే లీగు మంత్రులద్వారా కూడా ఒత్తిడితెచ్చి ప్రభుత్వాన్ని నడపడమే కాంగ్రెసుకు దుస్సాధ్యమయేలా చేసింది. ఈ విధంగా భారతదేశవిభజన ఒకటే పరిష్కారమార్గ మని కాంగ్రెసు నాయకులతో ఒప్పించింది.

## మౌంట్‌బాటన్ ప్రణాళిక నిజస్వరూపం

విప్లవ పోరాటానికి కాంగ్రెసు - లీగు నాయకత్వాలు చేసిన ద్రోహానికి పర్యవసానమే మౌంట్ బాటన్ ప్రణాళిక.

బూర్జువా నాయకత్వం స్వతంత్రం సంపాదించామని డబ్బా వాయించుకొంటున్నా, ఉన్న నిజస్థితి ఏమిటంటే జాతీయ నాయకత్వం ప్రజానీకంయొక్క స్వతంత్రపోరాటానికి ద్రోహంచేసి ప్రజాతంత్ర విప్లవంయొక్క నినాదాలనన్నిటినీ గాలికి వదలి, ప్రజల కన్నుగప్పి, సామ్రాజ్యవాదులతో ఘోరమైన ఒడంబడిక చేసుకుంది.

మౌంట్ బాటన్ ప్రణాళిక దేశాన్ని విభజించింది. న్యాయమైనట్టి విప్లవాత్మకమైనట్టి జాతీయ స్వయంనిర్ణయ సూత్రం ప్రకారం మతసమస్యను పరిష్కరించుకోవడానికి మొదటి నుండీ నిరాకరిస్తూ వచ్చిన కాంగ్రెస్-లీగ్ నాయకత్వాలు మతప్రాతిపదికపై దేశాన్ని విభజించే సామ్రాజ్యవాదుల

ప్రణాళికను అంగీకరించాయి. ఇందుమూలంగా సామ్రాజ్య వాదులు తమకు అవసరమయినప్పుడల్లా రెండు రాజ్యాలు ఒండొంటితో కయ్యానికి కాలుదువ్వేలా ఉసికొల్పడానికి అవకాశం ఏర్పడింది.

హిందువులకు-ముస్లింలకు మధ్య శాశ్వతంగా పరస్పర ద్వేషాన్ని రెచ్చగొట్టడానికి సామ్రాజ్యవాదులకు అవకాశం ఏర్పడింది. యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టి విప్లవోద్యమాన్ని తప్పుదారి పట్టించడానికి మతకలహాలను ప్రేరేపించడానికీ యీ దేశవిభజన చక్కని సాధనంగా ఉపయోగపడుతుంది. యీ దేశవిభజన ప్రజాతంత్ర ఉద్యమాల ఐక్యతపైన జరిగిన దాడుల్లోకల్లా పెద్దది. ఇంతేకాకుండా, తనతో ముఖాముఖి వచ్చినప్పుడు రెండు రాజ్యాల్లోని బూర్జువా వర్గాలను బలహీన పరచటానికి సామ్రాజ్యవాదానికి ఈవిభజన ఎంతో తోడ్పడుతుంది.

రెండో విషయమేమంటే ఈప్రణాళికవల్ల సామ్రాజ్య వాదానికి చిరకాలమిత్రులైన సంస్థానాధీశులు చెక్కు చెదర కుండా అలా ఉండడమే కాక, జాతీయ నాయకత్వంతో బేరాలు సాగించేందుకు వారికి ధీమా హెచ్చింది. ఇప్పుడు సంస్థానాధీశ్వరులు స్వతంత్రులు కావడంవల్ల వారు డొమినియనులో చేరటానికి అంగీకరించటమే తమకొక గొప్ప విజయంగా జాతీయనాయకులు డబ్బావాయించుకొనే అవకాశం కల్గింది.

మూడవది, ఆర్థికరంగంలోని కీలకస్థానాలన్నీ ఇంకా సామ్రాజ్యవాదుల చేతుల్లోనే ఉన్నాయి. బూర్జువావర్గంచే ప్రజలపైన దాడిచేయించి, ప్రజాతంత్రవిప్లవాన్ని అణచివేసి

సామ్రాజ్యవాదులు, సంస్థానాధీశ్వరులు, భూస్వాములు, మత తత్వవాదులు, పెట్టుబడిదారులు, ఒక నూతన సంఘటనగా ఏర్పడడానికై సామ్రాజ్యవాదులు తమ చేతుల్లో ఉన్న యీ కీలక స్థానాలను ఉపయోగిస్తున్నారు.

ప్రజాతంత్రి శక్తులకు వ్యతిరేకంగా విప్లవాన్ని రక్తపు టేరుల్లో ముంచివేయాలని చూస్తున్న ఈ కొత్త సమైక్యత మౌంట్ బాటన్ ప్రణాళికలో ప్రతిఫలిస్తోంది. దీనితో అటూ ఇటూ ఊగిసలాడుతూన్న బూర్జువావర్గం కడకు సామ్రాజ్య వాదులకు లొంగిపోయింది. ఇది, జాతీయనాయకత్వం అనుస రిస్తూ వచ్చిన రాజీపంథా. జాతీయవ్యతిరేకమైన, ప్రజావ్యతి రేకమైన, విప్లవవ్యతిరేకమయిన పంథాను దిగజారినందుకు ఫలితం.

మౌంట్ బాటన్ ప్రణాళిక ప్రజలకు బూటకపు స్వాతంత్రి మిచ్చిందేకాని నిజమైన స్వాతంత్ర్యం ఇవ్వలేదు. ఈప్రణాళికద్వారా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశాన్ని విభజించి, బూర్జువా వర్గానికి రాజ్యాధికారంలో సుస్థిరమైన భాగమే ఇచ్చారు. కాని బూర్జువావర్గం సామ్రాజ్యవాదులకు లొంగి ఉండేంతమట్టుకే ఈఅధికారం ఇవ్వబడింది.

భారత దేశంపై, బ్రిటన్ పెత్తనం దీనితో అంతం కాలేదు. ఆపెత్తనం యొక్క స్వరూపం మాత్రం మారింది. ఇంతవరకూ బూర్జువా వర్గానికి రాజ్యాధికారంలో భాగం లేదు. పాలకవర్గానికి ప్రతిపక్షంగా మాత్రమే ఉన్నది. ఇప్పుడు జాతీయ ప్రజాతంత్రి విప్లవాన్ని ఛిన్నాభిన్నంచేసి రక్తప్రవా హంలో ముంచివేయడానికై సామ్రాజ్యవాదులు బూర్జువా

వర్గానికి రాజ్యాధికారంలో భాగం ఇచ్చారు.

రాజ్యాంగం యొక్క ప్రధాన యంత్రాలయిన, సైన్యం, నౌకాదళం, వైమానికదళం, పరిపాలకశాఖ, ఇవన్నీ సామ్రాజ్య వాదుల తొత్తుల చేతుల్లో ఉన్నాయి. వీటిలోని ఉన్నతోద్యోగు లందరూ పైవర్గాలకుచెందినవారు; బ్రిటిష్ సామ్రాజ్యవాదుల యెడ సానుభూతి కల్గి, ప్రజాతంత్ర పురోగమన మంటే మండిపడేవారు - యాజమాన్యమంతా పైవర్గాల వారిదే. మొత్తం రాజ్యాంగయంత్రాన్ని మిలటరీమిషన్ల ద్వారా, మిలటరీ సలహాదార్ల ద్వారా, సామ్రాజ్యవాదులు కంట్రోలు చేస్తారు. ఈ మిలటరీ మిషన్లనూ సలహాదార్లనూ ఇండియా ప్రభుత్వం "మనఃపూర్తిగా" అంగీకరిస్తుంది.

మతకలహాలను రెచ్చగొట్టి మత దురహంకారశక్తులు ప్రజలపైన దాడిచేసినప్పుడు, మిలటరీ, పోలీసు, సివిల్ సర్వీసు, ఎలా ప్రవర్తించిందో గమనిస్తే రాజ్యాంగయంత్రమంతా ప్రజలకు, ప్రజాతంత్రానికి వ్యతిరేకమైనట్టి సామ్రాజ్యవాదు లకు అనుకూలమైనట్టి శక్తుల అధీనంలో ఉన్నదని స్పష్టమవు తుంది - సామ్రాజ్యవాదులతో కలిసిపోయిన బూర్జువావర్గం తన శాంతిభద్రతలను కాపాడుకోవడానికి ఈ శక్తులపైన నిస్సం కోచంగా ఆధారపడివున్నది.

సామ్రాజ్యవాదులు బూర్జువావర్గ ప్రతినిధులైన మన జాతీయోద్యమనాయకులకు ప్రభుత్వాధికారం ఒప్పగించి, వ్యాపార ఒడంబడికలద్వారా, మిలటరీ ఒడంబడికలద్వారా పెత్తనం సాగిస్తున్నారు. ఈ మిలటరీ ఒడంబడిక ప్రస్తుతం సంప్రదింపుదశలో ఉన్నది.

మౌంట్ బాటన్ ప్రణాళిక సామ్రాజ్యవాదుల తిరో గమనాన్ని సూచించదు ; ఉధృతమౌతున్న భారతదేశ ప్రజా శక్తులపై సామ్రాజ్యవాదులు కుయుక్తితో ఎదురుదాడులు సాగించారని స్పష్టంచేస్తున్నది. మతకలహాలు, ఆగస్టు 15 తరువాత సామ్రాజ్యవాదవ్యతిరేక ప్రజాతంత్రపోరాటాలు దెబ్బతినడం పైవిషయాన్ని రుజువుచేస్తున్నాయి.

యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరమూ, స్వేచ్ఛా ప్రజాతంత్రాల కోసం విజృంభించిన ప్రజావెల్లువఫలితంగా సామ్రాజ్యవాదం తన పెత్తనంయొక్క స్వరూపాన్ని మార్చు కోక తప్పింది కాదు. భారతదేశం విడచివెళ్లడం ఒకటే సామ్రాజ్యవాదానికి గత్యంతరమైనప్పుడు, పెట్టుబడిదార్లను, భూస్వాములను తన అధికారంలో పొత్తుకలుపుకొని సామ్రాజ్య వాదం యిక్కడ ఉండటానికి వీలు కల్పించుకొంది. ఈ నూతన పరిస్థితిని జాతీయ స్వాతంత్ర్యమంటూ ప్రచారం చేయడం సామ్రాజ్యవాదుల పన్నాగాలను, జాతీయబూర్జువావర్గం యొక్క లొంగుబాటును కప్పిపుచ్చటం తప్ప వేరు కాదు.

ప్రజల ఆశలు నిరాశలైపోవడం ఏదో అకస్మాత్తుగా జరిగింది కాదు. సామ్రాజ్యవాదంలో ఒడంబడిక చేసుకోవడ మనే జాతీయవ్యతిరేకవిధానం ఎన్నో విషఫలితాలకు దారి తీస్తోంది.

## జాతీయప్రభుత్వం - ప్రజలు

ఆగస్టు 15 తరువాత, "జాతీయప్రభుత్వం" చేస్తున్న కార్యాలు తీసుకొంటున్న చర్యలు, మౌంట్ బాటన్ ప్రణా

ళిక ఉద్దేశాన్ని మనం సరిగ్గా అర్థం చేసుకొన్నామని రుజువు చేసాయి.

పండిట్ నెహ్రూ ఆధిపత్యాన ఏర్పడ్డ కేంద్రప్రభుత్వం ప్రజాతంత్రవిప్లవానికి సంబంధించిన యేఒక్క సమస్యను కూడా పరిష్కరించలేదు. ఈ కేంద్రప్రభుత్వ స్థాపనవల్ల ఇండియా ప్రజలు స్వేచ్ఛాస్వతంత్రాలు సంపాదించారని కానీ, లేక, స్వేచ్ఛాస్వతంత్రాలవేపు పురోగమిస్తున్నారని కానీ, అనుకోవడానికి వీలులేదు.

పైగా అందుకు విరుద్ధంగా ప్రభుత్వం ప్రజాశ్రేయస్సుకు, ప్రజాస్వేచ్ఛకు వ్యతిరేకంగా యిప్పటికప్పుడే పెద్ద ఎత్తున నడుస్తున్నది. ప్రజాతంత్రవిప్లవాలను అణచివేసి తను చెప్పుచేతల్లో ఉండే కీలుబొమ్మరాజ్యాలను నిర్మించాలని చూస్తున్న ఆంగ్లో - అమెరికా సామ్రాజ్యవాదములతో ఇండియాప్రభుత్వం చేతులు కలుపుతున్నది. ఈ ఆంగ్లో - అమెరికా ముఠాలో తమకు అనుకూలమైన స్థానాన్ని సంపాదించుకోవాలని తంటాలు పడుతున్నది.

స్వేచ్ఛను, ప్రజాతంత్రశక్తులను అణచివేయుడమే జాతీయ ప్రభుత్వవిధానమని, దీని ఇటీవల చర్యలవల్ల రుజువయింది.

జాతీయప్రభుత్వాన్ని నడుపుతూండే నాయకులున్న ప్రజాపరిషత్తు ఒక నిరంకుశ రాజ్యాంగచట్టాన్ని తయారు చేస్తున్నది. కొన్నేండ్లకు ఒక్కసారి ఓటుచేసేహక్కు తప్ప యీ రాజ్యాంగచట్టంవల్ల ఇండియా కార్మికవర్గానికి, ప్రజలకు వచ్చే లాభమేమీ లేదు. ఈ ఓటుచేసేహక్కుకూడా ఒక్క

రాష్ట్ర శాసనసభల విషయంలో మాత్రమే. ఇండియా పెట్టుబడిదారులు కలిసి దోపిడీ సాగించేందుకోసమై, లక్షలాది పీడితప్రజానీకంపై పెత్తనమిచ్చే రాజ్యాంగచట్ట మొకటి ఈ ప్రజాపరిషత్తు నిర్మిస్తుంది.

వారంటులేకుండా అరెస్టుచేయడానికి, విచారణ లేకుండా డిటెన్ చేయడానికి రాజ్యాంగచట్టంలో అవకాశాలు కల్పించారు. రాష్ట్రగవర్నర్లకు అవసరమని తోచితే ఆర్డినెన్సులద్వారా చట్టాలు చేయడానికి, అసాధారణ పరిస్థితులనే సాకుతో శాసనసభను ఉల్లంఘించి, దాని అధికారాలు తామే చెలాయించడానికి అధికారాలు యివ్వబడ్డాయి.

రాష్ట్రాల్లో లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు ఏర్పడవచ్చుననే అభివృద్ధినిరోధకమైన నిబంధన రాజ్యాంగచట్టంలో చేసారు. ఈ కౌన్సిల్లో కొంతమంది సభ్యులను గవర్నరే నామినేటు చేస్తారు. ఈవిధంగా కౌన్సిల్లో పెట్టుబడిదారీ జమీందారీ వర్గాలకు వారి తరఫున మాట్లాడే ఇతర పైవర్గాల వారికి తప్పకుండా పెత్తనం ఉండేటట్టు కట్టుదిట్టాలు చేసుకొన్నారు.

ఇంతేకాదు రాష్ట్ర రాజ్యాంగ చట్టం ఏకభాషాప్రాతిపదికపై ఏర్పడ్డ జాతులకు స్వయం నిర్ణయాధికారం ఉన్నదనే ప్రధాన సూత్రాన్ని అంగీకరించడంలేదు. వివిధ జాతులపై స్వార్థ ప్రయోజనాలకై పెత్తనం సాగించాలని అభివృద్ధినిరోధకమైన పెట్టుబడిదారీవర్గాలు ఉబలాటపడుతున్నాయని దీనివల్ల వ్యక్తమౌతున్నది.

దీనిలో దామాషా ప్రాతినిధ్యంలేదు. యిందువల్ల అభి

వృద్ధి కాముకమైన పార్టీలకూ, వివిధ అల్పసంఖ్యాక వర్గాలకూ న్యాయమైన ప్రాతినిధ్యం లభించదు. కొండ జాతుల వారికీ, ఇతర వెనుకబడిన ప్రజలకు స్వేచ్ఛనూ, స్వయంనిర్ణయ హక్కును యివ్వడంలేదు. వారు స్వపరిపాలిత ప్రాంతాలు లేక రాష్ట్రాలు ఏర్పరచుకొనే హక్కు లేదు. ఇందువల్ల వెనుకబడిన ప్రాంతాలప్రజలు తమ ఆర్థికజీవనాన్ని, సంస్కృతినీ రక్షించుకుంటానికీ, అభివృద్ధి చేసుకోవడానికీ అవకాశం లేదు.

కొత్తరాజ్యాంగ చట్టంలో, శ్రామజీవుల ప్రాథమిక హక్కులకు స్థానమే లేదు. తప్పనిసరిగా ఉద్యోగం, జీవనానికి సరిపడేజీతం, వృద్ధాప్యంలోనూ, జబ్బులోనూ ఉద్యోగం దొరకనప్పుడు, ప్రభుత్వసహాయము మొదలయిన ప్రాథమిక హక్కులకు ఇండియా రాజ్యాంగచట్టంలో ఏలాటిహామీలు కాని, రక్షణాలుకాని లేవు.

ఇలాశ్రామజీవుల హక్కులకు ఒకవేపుగ్యారంటీ ఇవ్వకుండా ఇంకొకవేపు, నష్టపరిహారం ఇవ్వనిదే వ్యక్తులయొక్క, సంస్థలయొక్క ఆస్తులు ప్రజోపయోగార్థం ప్రభుత్వస్వాధీనం చేసుకోబడవని పెట్టుబడిదారుల జమీందారుల ప్రత్యేక హక్కులకు ఆస్తులకు రాజ్యాంగచట్టంలో గ్యారంటీ యివ్వబడింది. ఇందుమూలంగా విదేశ కంపెనీలకు చెందిన పరిశ్రమలతో సహా పరిశ్రమల నన్నింటినీ ప్రభుత్వపరం చేయాలనే ప్రణాళికలను అమలు జరుగనీకుండా రాజ్యాంగ చట్టంలో హామీఇవ్వబడింది.

ఇండియాలోని పెద్దపెద్దపెట్టుబడిదార్లు పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు.

కార్మికులను అణచివేసి వారి పనికాలం హెచ్చించటంద్వారా ఉత్పత్తిని హెచ్చించాలని కోరుతున్నారు. ఈ పెట్టుబడిదార్ల ప్రణాళికను ప్రభుత్వం అమలుపరుస్తోంది.

కార్మికులచేత మరింత తీవ్రంగా పని చేయించటం ద్వారాను, తక్కువమందిపనివారిచేత సాధ్యమయినంతఎక్కువ పనిచేయించటం ద్వారాను, అధికోత్పత్తి చేయించాలని ప్రభుత్వం పూనుకొన్నది. జీతాలు హెచ్చిస్తే ధరలు పెరుగుతా యనే సాకుతో కార్మికులజీతాలు హెచ్చకుండా ఆపుచేస్తున్నది. కార్మికులు పోరాడిసాధించిన కోర్కెలను అమలుజరుపడంలో వారిని దగాచేస్తున్నది (రైల్వేఎగ్రిమెంటు). జీవనానికిసరిపడేజీత మిచ్చే విషయంలోగాని, కార్మిక జీవనసౌకర్యాల విషయంలో కాని, కార్మికులను ఉద్యోగంనుండి తొలగించేందుకు యజ మానుల కున్న అధికారాలను అరికట్టే విషయంలోకాని ప్రభుత్వం తగిన శాసనాలు చేస్తుందనే ఆశకూడా చూపెట్టడం లేదు. "మిశ్రమ ఆర్థిక వ్యవస్థ" అనే పేరుతో ప్రజలను దోచుకోవడానికి పెట్టుబడిదార్లకు సంపూర్ణ స్వేచ్ఛను ఇచ్చి వేసింది. ఉత్పత్తి తగ్గిపోయినందుకు కార్మికులను నిందిస్తూ ఉంది. కార్మికులు పనిచేయవలసిన కాలం హెచ్చాలని అంటూ న్నది. ఒక్కమాటలో చెప్పాలంటే పెట్టుబడిదార్ల లాభాలను యథావిధిగా ఉంచటానికై, ప్రభుత్వం ఆర్థిక సంక్షోభభారాన్ని కార్మికుల నెత్తిపైన వేస్తోంది.

జాతీయనాయకత్వానికి ప్రభుత్వంపై కంట్రోలు ఏర్పడి నందువల్ల నిరంకుశ సంస్థానాధిపతులపై జరుగుతున్న విప్లవ పోరాటాలను విచ్ఛిన్నం చేయటానికై జాతీయనాయకత్వానికి

మంచి బలమైన ఆయుధం దొరికింది. ప్రభుత్వం ద్వారా తెచ్చే ఒత్తిడితో నిరంకుశ సంస్థానాధీశ్వరులను ఎదుర్కో వచ్చు ననే భ్రమలనుజాతీయప్రభుత్వం అదేపనిగా కల్పించింది. ఈ భ్రమలను వినియోగించి, నేడు సంస్థానాధీశ్వరులతో రాజీలు ఒడంబడికలను చేసుకొంటూన్నది. ఈ ఒడంబడికల ఫలితంగా రాజులనిరంకుశత్వం యథావిధిగా సాగుతుంది. సంస్థానాలను యూనియన్‌లో కలుపుకొనే యీ ఒడంబడికలు తమకొక పెద్ద విజయంగా ప్రచారంచేస్తూ సంస్థానాల్లో జరుగుతూన్న ప్రజాతంత్ర పోరాటాలనుండి ప్రజల దృష్టిని మరలిస్తూన్నది. ప్రజాపోరాటాలకు జాతీయనాయకత్వం యిటీవల చేసిన విద్రోహాల్లో చిట్టచివరది నైజాం నవాబుతో చేసుకొన్న యథాతథపు ఒడంబడిక.

అనేక సంస్థానాల్లో బూర్జువా నాయకత్వం తనకేదో రాజ్యాధికారంలో చిన్నభాగమిచ్చే సంకుచితరాజ్యాంగ సంస్కరణలు పొందటానికి, అక్కడ జరిగే ప్రజాఉద్యమాలను ఉపయోగించుకొంది. ఈ సంస్కరణలతో ప్రజలకు ప్రభుత్వాధికారంరాదు. తమకొచ్చిన సంస్కరణలకు బహులుబర్త్రీగా ఆబూర్జువాలు సంస్థానాధిపతులతో చేతులు కలిపి భూస్వామ్యదోపిడీవిధానాన్ని నిలవబెట్టడానికీ ప్రజలనూ, వారి ప్రజాతంత్రఉద్యమాలనూ విచ్ఛిన్నంచేసి అణచివేయడానికీ పూనుకున్నారు.

కాబట్టి ప్రభుత్వం అనుసరిస్తూన్న విధానం అభివృద్ధి నిరోధకమైన సంస్థానాధీశ్వరులను సంతృప్తిపరుస్తూన్నదనీ, సంస్థానాధీశ్వరులనూ, సామ్రాజ్యవాదులనూ వ్యతిరేకించే

విప్లవ పోరాటాలను విచ్ఛిన్నం చేస్తూందని ఖచ్చితంగా చెప్ప వచ్చు.

పౌరసత్వాల విషయంలోనూ ప్రజా తంత్రహక్కుల విషయంలోనూ కేంద్రప్రభుత్వ ఆజ్ఞానుసారం, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజారక్షణ చట్టాలనే ఘోరమైన చట్టాలను చేసాయి. వీటిని కార్మికుల, కర్షకుల ఉద్యమాలను విద్యార్థులను అణచి వేయడానికి నిరాఘాటంగా ఉపయోగిస్తూన్నారు. వందలకొద్దీ జనాన్ని విచారణ లేకుండా డిటైన్ చేసారు. ఇంటర్న మెంటు మొదలైన ఆంక్షలు విధిస్తున్నారు.

భూస్వామ్య విధానం రద్దువల్ల రైతులకు చెందవలసిన లాభాలను వారికి దక్కనీకుండా మోసంచేయడానికి, రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవసాయ సంస్కరణలకు సంబంధించిన కొన్ని శాసనాలను ప్రవేశపెట్టారు. ఈ శాసనాలుకూడా సాంతంగా నెగ్గకుండా కేంద్రప్రభుత్వ నాయకత్వం అడ్డుకున్నది. ఈ శాస నాల ప్రకారం జమీందార్లకు విపరీతమైన నష్టపరిహారం చెల్లిం చాలి. దున్నేవారికి భూమి యిచ్చేమాట లేదు. కాబట్టి ఇది సంస్కరణ అని కూడా అనటానికి వీలులేదు. ఎందుకంటే వివిధ స్వరూపాల్లో భూస్వామ్యవిధానం అట్లే వుంటుంది. ఈ శాసనాలు, ఉధృతమవుతూన్న వ్యావసాయిక విప్లవశక్తు లను విచ్ఛిన్నంచేసే ప్రయత్నాలు తప్ప వేరేమీ కావు. ప్రస్తుత బూర్జువా ప్రభుత్వానికున్న ఆస్కారాన్ని విస్తృతం చేయ డమే వీటి ఉద్దేశం.

మైనారిటీల విషయంలో ప్రభుత్వం మితవాదవిధా నాన్ని అనుసరిస్తూన్నది. నిజంగా యిది మైనారిటీ

సమస్య పట్ల బూర్జువా అవలంబించే పంథా, మైనారటీలకు వ్యతిరేకంగా భేదబుద్ధీ, పక్షపాతం వహించి వారి ప్రజాతంత్ర హక్కులను మింగివేస్తున్నది. మత దురహంకారులైన అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాద, జమీందారీవర్గాల క్రూర మతోన్మాదదాడికి భయపడి, వెనుదిరిగి మైనారటీప్రజల దారుణహత్యకు, దారివ్వడమూ - ఇదే నేడు ప్రభుత్వ మనుసరిస్తూన్న విధానం.

పంజాబులో దారుణ హత్యాకాండ మొదలుకాకముందే మత దురహంకారశక్తులతో ప్రభుత్వం రాజీపడిందనేవిషయం మంత్రివర్గంలోకి శ్యామ ప్రసాద్ ముఖర్జీని చేర్చుకోవడంవల్ల, అకాలీ నాయకుడైన బలదేవసింగ్‌ను రక్షణశాఖ మంత్రియంతటి ముఖ్య పదవిలో ఉంచడంవల్ల రుజువయింది. మంత్రివర్గంలో చాలామంది మైనారటీలను పీడించడం ఒక పాలసీగా పెట్టుకొన్నారు. వీరందరికి పటేల్ నాయకుడు.

హిందూమత దురహంకార శక్తులతో బహిరంగంగా ప్రభుత్వం చేతులు కలపడంవల్ల పాకిస్తాన్‌కు ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులను సమీకరించాలనే సాకుతో, హిందూ మహాసభను, ఆర్. యస్. యస్. ను సర్దార్ పటేల్ పదే పదే పొగడడంవల్ల, మతోన్మాదశక్తులకు మహాధైర్యం వచ్చినది. దీని ఫలితంగా ఒక ఆర్. యస్. యస్. సభ్యుడు మహాత్మా గాంధీని హత్య చేశాడు.

సర్దార్ పటేల్ వంటి ప్రభుత్వ నాయకుల హృదయాలలో మత దురహంకారం ఎంత బలంగా వేళ్లు పాదుకొని పోయిందంటే, మహాత్మా గాంధీ హత్యానంతరం కూడా

హిందూ మతోన్మాదులను రక్షించడానికై విశ్వప్రయత్నాలు చేయబడ్డాయి. క్రోధోద్రిక్తులై, మత దురహంకారులకు వ్యతిరేకంగా ప్రదర్శనాలు జరుపుతూన్న ప్రజలను అరెస్టు చేసారు. కొన్ని చోట్ల కాల్చనుకూడా కాల్చారు. మతోన్మాదులను అరెస్టు చేయడమనే ఒక కపటనాటక మాడుతూ, సమయం వచ్చినపుడల్లా వారినిగురించి మంచిమాట లాడుతూ ప్రజల క్రోధజ్వాలలనుండి వారిని రక్షించడానికి ప్రయత్నిస్తూన్నారు. శాంతిభద్రతల పేరుతో, అహింస పేరుతో ఇదంతా జరుగుతూన్నది.

హిందూ మహాసభ నాయకుల అరెస్టులు మొదలయినవి ఎందుకు జరిగాయంటే, కోపం పట్టలేక ప్రజలే తగిన శాస్తి చేయపూనడంవల్ల ఈ మతదురహంకారుల పైన ప్రభుత్వం చర్యతీసుకోక తప్పిందికాదు. కాకుంటే ప్రభుత్వం కదలి ఉండేది కాదు. హంతకుని ఒక్కనిని తప్ప మరెవ్వరిని అరెస్టు చేసివుండేది కాదు.

జాతీయప్రభుత్వం ఆర్. యస్. యస్. ను నిషేధించడమైనా దానిపైన ప్రజల్లో రగిలి మండిన క్రోధాగ్నివల్లనే. ఆ నిషేధం కేవలం ఆ సంస్థనూ దాని వెనుకనున్న వారినీ పొడుగునా సమర్థిస్తూ వచ్చిన ప్రభుత్వవిధానాన్ని కప్పిపుచ్చుకోడానికి మాత్రమే.

ఈ విధానం మంత్రివర్గంలో ఏలాటి భేదాభిప్రాయాలకు దారితీయడం కాదని నెహ్రూ ప్రకటించాడు. ఈ ప్రత్యేకసమస్యపై కూడా రాజకీయభేదాలు లేవనీ మానసిక ప్రవృత్తిలోమాత్రమే భేదాలున్నవని అన్నాడు. అభివృద్ధి

నిరోధకమైన మతదురహంకార శక్తులు జాతీయప్రభుత్వాన్ని ఎలా తమవైపుకు ఈడ్చుకొంటున్నాయో రుజువుచేయడానికి ఇదొక్కటే చాలు.

## సామ్రాజ్యవాదంతో సహకారం

కీలకపరిశ్రమలను యితర ముఖ్యపరిశ్రమలను ప్రభుత్వ పరం చేసి, పరిశ్రమలను అభివృద్ధిపరచడానికి ప్రభుత్వం ఒక వేపు నిరాకరిస్తూ, మరొకవేపు ప్రజలకు నష్టకరంగానూ, పెట్టుబడిదారీ వర్గానికి లాభదాయకంగాను ఉండేటట్లు ఎగుమతులను ప్రోత్సహిస్తోంది. ఆంగ్లో - అమెరికా ముఠాతో ఇండియా ప్రభుత్వం సహకరించడానికి వేసు కొన్న ప్రణాళికలో ఇదొక భాగము. ఎందుకంటే సామ్రాజ్యవాదులతో సహకరించి పనిచేస్తేనే యీ ఎగుమతు లకు విదేశమార్కెట్లు లభ్యమవుతాయి. ఈ ఎగుమతుల ద్వారా ఇండియా పెద్ద పెట్టుబడిదారీవర్గం విదేశమారకాన్ని సంపాదించి, కొత్త పరిశ్రమల కవసరమయిన యంత్రసామ గ్రిని, ఆంగ్లో - అమెరికా సామ్రాజ్యవాదుల సహాయంతో కొనదలచింది. ఇలా తమ పరిశ్రమలకై మళ్ళీ ఆంగ్లో-అమె రికా పెట్టుబడిదారుల పైననే ఆధారపడవలసివచ్చింది.

ఈ విధంగా రెండువిధాల అంటే ఇండియా సరుకు లకు కావలసిన మార్కెట్లకోసమూ, పరిశ్రమల కవసరముయిన యంత్రసామగ్రికోసమూ, ఇండియా పెట్టుబడిదారీవర్గం ఆంగ్లో-అమెరికా పెట్టుబడిదార్లపైన ఆధారపడివున్నది. ఇందు వల్ల ఆంగ్లో-అమెరికన్ పెట్టుబడిదారులకు ఇండియా పెట్టుబడి దారీవర్గం దాసోహంచేస్తూ లొంగివుండడం అవసరమయింది.

ప్రభుత్వ సహాయంతో పెద్దపెట్టుబడిదారీవర్గం ఇండియా భవిష్యత్తును ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు అమ్మటానికి ప్రయత్నిస్తూంది.

ఆంగ్లో-అమెరికా సామ్రాజ్యవాదులు ఎన్నో ప్రధానమైన హక్కులు ప్రత్యేక సౌకర్యాలు కావాలని కోరుతున్నారు. విదేశ పెట్టుబడికి, స్వదేశ పెట్టుబడికి మధ్య ప్రభుత్వం భేద భావంచూపకూడదు. పరిశ్రమలను ప్రభుత్వపరంచేయకూడదు. తమఅంగీకారం లేనిదే సుంకాలు వేయరాదు. ఇండియా ప్రజలను దోచుకోవడానికి జాయింటు కంపెనీలు స్థాపించాలి. ఈకంపెనీలకు సంపూర్ణమైన రక్షణ ఉండాలి. ఈషరతులన్నీ హవానాలో చర్చించబడుతూన్న చిత్తువ్యాపార ఒడంబడికలో పొందుపరచారు. ఇందువల్ల ఇండియాలోని పెద్దపెట్టుబడిదారీ వర్గమూ ఇండియాప్రభుత్వమూ తమస్వార్థంకోసం ఇండియా ఆర్థిక వ్యవస్థను ఆంగ్లో-అమెరికా పెట్టుబడిదార్లకు తాకట్టు పెడుతున్నారని రుజువు అవుతోంది.

ఇది ఆర్థికంగానే గాకుండా రాజకీయంగాకూడా పరోక్షపాలనకు దారితీస్తుంది. కాబట్టి ఇండియా ఆర్థికవ్యవస్థ, రాజకీయ స్వాతంత్రం ఆంగ్లో - అమెరికా గుత్తవ్యాపారస్థులకు తాకట్టు పెట్టబడుతోంది.

## ప్రభుత్వ విదేశాంగ విధానం

ప్రభుత్వం అవలంబిస్తూన్న విదేశాంగ విధానం అది ఏవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తూందో ఆవర్గప్రయోజనాలను అనుసరించిఉన్నది. మొట్టమొదటనుండి నెహ్రూ అంతర్జాతీయ రాజకీయాల్లో "మూడవమువాను" ఏర్పరచాలనే

పంథాను అవలంబించాడు. ఈ పంథా పెద్దపెట్టుబడిదారులకు అనుకూలంగావుంది. ఎందుకంటే ఈ పంథావల్ల ఇండియా ప్రజాతంత్ర పథానికి దూరమైపోయి సామ్రాజ్యవాదుల పక్షం లోకి పోవడానికి దారి తీసింది.

ప్రభుత్వం తన విదేశాంగ విధానానికి కప్పిన ప్రజా తంత్రపు ముసుగు గత కొన్ని మాసాల్లో తొలగిపోయింది. ముఖ్యమైన సమస్య లన్నింటిపైనా ఇండియా ప్రతినిధివర్గం అవలంబించిన వైఖరి ప్రజాతంత్రానికి వ్యతిరేకంగాను, సామ్రాజ్యవాదులకు అనుకూలంగాను ఉన్నది. ఉదాహరణలు: కొరియా "పిల్లఅసెంబ్లీ", యుక్రేన్. యుక్రేన్ సమస్య పైన అమెరికాకు, తన నుపయోగించుకోవడానికి ఇండియా అవకాశం మిచ్చింది. భద్రతా సంఘంలో ఆగ్నేయ ఆసి యాకు, ప్రాతినిధ్యం లేదనే కుంటిసాకుతో భద్రతా సం ఘంలో సభ్యత్వానికి యుక్రేన్‌తో పోటీ చేసింది.

ఆసియా ప్రజలకు ప్రత్యేకంగా ముఖ్యమైన సమస్యల్లో (ఉదాహరణకు: చైనా ప్రజలపైన అమెరికా ఆధిపత్యంక్రింద కొమింటాంగు నడుపుతూన్న యుద్ధమూ, వియట్నాంలో ఫ్రెంచి వలసరాజ్య యుద్ధమూ,) అది నోరు మెదపలేదు. ఏచర్య తీసుకోడానికీ నిరాకరించింది. జపానుతో శాంతి ఒడం బడిక విషయంలో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్య వాదులనే బలపరచినదైంది. ఇండోనీషియా ప్రజలపై అమెరికా సాయంతో డచ్చివారు చేసేయుద్ధం విషయంలో అంటే అమెరికా సూచన ప్రకారం గుడ్ ఆఫీసెస్ కమిటీ వెలిసింది. దానిలో అమెరికాదే ప్రాబల్యం ఉంది. ఆ కమిటీ

ధర్మమా అంటూ ఇండోనీషియా రిపబ్లికన్ ప్రభుత్వానికీ - డచ్చి సామ్రాజ్యవాదానికి ఒక ఒడంబడిక జరిగింది. ఈ ఒడంబడిక ఇండోనీషియా స్వతంత్రపోరాటానికి ద్రోహం చేయడంగాక మరేమీగాదు. ఈ విద్రోహాన్ని ట్రూమన్‌తో పాటు ఇండియా జాతీయప్రభుత్వం కూడా ఆమోదించింది.

తమ విదేశాంగవిధానం ప్రభుత్వం అవలంబించే ఆర్థిక విధానంపై ఆధారపడి ఉంటుందని నెహ్రూ అన్నాడు. ఇది నిజమే అని రుజువు అయింది. విదేశాంగవిధానంలో కూడా ఇండియా ఆంగ్లో-అమెరికా ముఠాలో క్రమేణా చేరిపోతూన్నది. ఇండియా చారులు అప్పుడే సోవియటు వ్యతిరేక ప్రచారానికి పూనుకొంటున్నారు. ఉదాహరణకు యుద్ధ ప్రచారంపై సర్ మహారాజసింగ్ ప్రకటన.

సోవియట్ వ్యతిరేక ముఠాను నిర్మించాలని బ్రిటిష్ సామ్రాజ్య వాదులు బాహాటంగా చెప్పుతున్నారు. ఈ ముఠాలో తమ వలసదేశాలన్నీ ఇమిడి ఉంటాయని కూడా అంటున్నారు. ఈ ముఠాలో ఇండియా నిర్వహించవలసిన పాత్ర ఏమంటే తన ముడిసరుకులను సప్లయి చేస్తూ ఆర్థికంగా ఈ ముఠాకు సహాయ పడుతూండడం.

జనవరి 22 న బ్రిటిషు పార్లమెంటులో, పశ్చిమ యూరప్ దేశాలు ఒక ముఠాగా ఏర్పడాలనే అంశంపై బ్రిటిషు విదేశాంగమంత్రి బెవిన్ మాట్లాడుతూ యిలా అన్నాడు:

“ఈ యూనియన్‌లో ఈ దేశాలయొక్క (బ్రిటన్, ఫ్రాన్స్, హాలెండ్ మొదలగునవి) ఆధిపత్యంక్రింద వున్న

వలసదేశాలను తీసుకురావాలి. ఇందుమూలంగా ఈ అన్యోన్య సహకారం యూరోపు మొదలుకొని ఆఫ్రికా మధ్య ప్రాచ్య దేశాలగుండా దూరప్రాచ్య దేశాలవరకూ విస్తరిస్తుంది. ఈ పశ్చిమ యూరపుదేశాల సంఘటనకు ఆర్థిక సహాయం అత్యవసరం. ఇందుకై ఒక్క బ్రిటన్ వలసదేశాలతోనేకాక ఫ్రెంచి, డచ్, బెల్జియం, పోర్చుగీసు వలసదేశాలతో కూడా సన్నిహితమైన సహకారం అవసరం. ఇవన్నీ ముడిసరుకులు ఉత్పత్తిచేసే వలసదేశాలు. వీటిని యెంతో అభివృద్ధిచేసే అవకాశం వుంది."

దీనితోపాటు, ఇండియా, పాకిస్థాన్ బర్మా, సిలోన్ మొదలైన ఆగ్నేయ ఆశియా దేశాలొక ఒడంబడికచేసుకుంటున్నాయని వార్తలొస్తున్నాయి. ఇది బ్రిటన్ అంగీకారంతో జరుగుతూన్నది. ఈ కూటమి కేవలం స్వరక్షణ కొరకట. కాని ఈ కూటమి ఉద్దేశం ఆగ్నేయఆసియాలో కమ్యూనిజం వ్యాప్తి చెందకుండాఅరికట్టడమనిబహిరంగంగానే ప్రకటించడంజరిగింది. అంటేదాని అర్థం నిజంగా స్వతంత్రపోరాటాలన్నిటినీ అణచివేయడమే. ఈ దేశాల నన్నిటినీ నేరుగా సామ్రాజ్యవాద శిబిరంలోకి లాక్కోవడమే. ఈ కూటమి నేర్పరచటంలో యిండియన్‌బూర్జువా సామ్రాజ్యవాదుల ముఖ్య ఏజెంటుగా పనిచేస్తున్నది. ఆగ్నేయఆశియాదేశాలన్నీ తమవలెనే స్వతంత్రపోరాటాలు మానివేసి సామ్రాజ్యవాద శిబిరంలో చేరాలని వారి కోరిక. ఎందుకంటే యీ దేశాలలో జరుగుతూన్న విప్లవాత్మకపోరాటాల ప్రభావం యిండియాప్రజలపై పడకుండా అరికట్టాలి.. అంతేగాక యీ దేశాలలో వలసరాజ్య

విధానాన్ని సుస్థిరంగా నిలుపబెట్టి సామ్రాజ్యవాదుల సాయంతో తాము కూడా అక్కడ కొంత స్థావరం ఏర్పరచుకోవాలని ఆలోచన.

ఇండియా రక్షణకై తగిన ఏర్పాట్లు చేసేందుకు బ్రిటన్ నుంచి ఇండియాకు మిలటరీ రాయబారవర్గాలు వస్తాయని వార్తలు వస్తున్నాయి. బ్రిటిష్ కామన్వెల్తును వదలి ఇండియా పాకిస్తానులు సొంతంగా తమ దేశరక్షణ విధానాలను నిర్ణయించుకో కూడదని పై వార్తలు బాహాటంగా చెబుతున్నాయి అంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదులపై ఆధారపడని రక్షణ విధానాలను ఈ దేశాలు అవలంబించరాదన్నమాట.

అంటే ప్రభుత్వమూ, పెద్ద పెట్టుబడిదారులూ ఇండియాను స్వతంత్రపోరాటాలనుండి ఆంగ్లో - అమెరికా ముఠాలోకి లాక్కొనిపోతున్నాయి.

## బూర్జువావర్గంయొక్క నూతనపాత్ర

ప్రస్తుతపు ప్రభుత్వం జాతీయనాయకుల ఆధ్వర్యం క్రింద ఏర్పడింది. పైగా, ప్రజాపోరాటాలవెల్లువ ఉధృతంగా వుండే సమయంలో అధికారంలోనికి వచ్చింది. ఇలాంటి ప్రభుత్వం యీవిధానాలను ఎందుకు అనుసరిస్తోంది?

ఎందుకంటే ఇన్నేండ్లుగా ప్రజాపోరాటాలను నడిపి ఇప్పుడు ప్రభుత్వంలోవున్న జాతీయనాయకులు, జాతీయ బూర్జువావర్గానికి, అనగా పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు.

ఇండియా ప్రభుత్వనాయకులు పటేల్, నెహ్రూలతో సహా ఇండియాపెట్టుబడిదారీ వర్గప్రతినిధులు. ఆగస్టు 15

తరువాత ప్రభుత్వం ఏర్పడినాక (ఇది అధికారం హస్తగతం కావడమంటున్నారు. కాని నిజంలో యిది అధికారాన్ని పంచుకోవడం మాత్రమే.) జాతీయ బూర్జువా వర్గానికి ప్రజలతోనూ, ప్రజలపోరాటాలతోనూ ఉన్న సంబంధాల్లో పెద్ద మార్పువచ్చింది.

పూర్వం సామ్రాజ్యవాదులనుండి ఏమిగుంజుకోవాలన్నా అధికారంలో భాగం కావాలన్నా, తగుకోర్కెలు నెరవేర్చుకోవాలన్నా బూర్జువా వర్గమూ, దానినాయకులూ ప్రజలపైన ప్రజాపోరాటాల పైనా ఆధారపడక తప్పిందికాదు. గతంలో, మంచి సమయాల్లో అది ఊగిసలాడుతూ వచ్చింది. సామ్రాజ్యవాదంతో ఒక ఒడంబడికకు రావడానికి ప్రయత్నించింది. పోరాటాలు తన చేయిదాటిపోకుండా అరికడుతూ వచ్చింది. ఐనప్పటికీ బూర్జువా వర్గానికి, తన పరిశ్రమలను అభివృద్ధి చేసుకొనడానికి గతంలో ఎప్పుడూ అవకాశమే దొరకలేదు. దానికెప్పుడూ ప్రజలపై రాజకీయాధికారం లేదు.

యుద్ధానంతరం విప్లవవెల్లువలు వెల్లివిరిసినందువల్ల ప్రజాతంత్ర శక్తులను దారుణంగా అణచివేయడానికై సామ్రాజ్యవాదం తన ఎత్తులు మార్చుకోవలసి వచ్చింది.

సామ్రాజ్యవాదం భారత బూర్జువాలకు గొప్ప మేలు చేసింది. వారు తమ సంకుచిత స్వార్థ ప్రయోజనాల కొరకు భారత ప్రజలను పాలించడానికి వీలుగా ప్రభుత్వాధికారాన్ని అప్పగించింది.

కానీ వీరు పుచ్చుకున్న ప్రభుత్వం సామ్రాజ్యవాదం

మీద ఆధారపడివుంది. అది సామ్రాజ్య వాదానికి ఉపగ్రహమైన ప్రభుత్వం మాత్రమే.

కాబట్టి యీ క్రొత్తరాజ్యాంగంలో, జాతీయబూర్జువావర్గం సామ్రాజ్యవాదులతో కలిసి అధికారం పంచుకొంటున్నది. ఇద్దరిలో పైచేయి ఇంకా సామ్రాజ్యవాదులదే.

ఇదీ, జాతీయప్రభుత్వం అనుసరిస్తున్న అభివృద్ధినిరోధక విధానంలో నున్న రహస్యం. బూర్జువావర్గం సామ్రాజ్యవాదులకు ప్రతిపక్షంగా ఉండి పనిచేయటం మానుకొంది; సామ్రాజ్యవాదులనుండి కొన్ని అధికారాలను సంపాదించుకోడానికి ప్రజాపోరాటాల కార్యక్రమాన్ని వదలుకొంది. తన ఆర్థికాభివృద్ధికై సామ్రాజ్యవాదులపై ఆధారపడుతోంది. సామ్రాజ్యవాదులతో తమకు అభిప్రాయభేదాలువచ్చి, తగాదాలు ఏర్పడితే సామ్రాజ్యవాదులతో బేరమాడటానికి తన చేతిలోకి క్రొత్తగావచ్చిన రాజ్యాంగంపైన ఆధారపడుతోంది.

ఈ బేరంలో ఇండియాప్రజలను ఉపయోగించుకోడానికి వారిపై తనకు వచ్చే తగాదాలను బూర్జువావర్గం, ప్రభుత్వాలమధ్య సంప్రదింపు జరపడంద్వారా పరిష్కరించుకొంటుంది. సుంకాలు తగ్గించటం, జాయింటు కంపెనీలు నిర్మించడం మొదలైన క్రొత్త సౌకర్యాలు కలుగజేసే సామ్రాజ్యవాదులతో వచ్చిన తగాదాలను పరిష్కరించుకొంటుంది.

కాబట్టి బూర్జువావర్గం ప్రజలను వదలిపెట్టి సామ్రాజ్యవాదులతో పొత్తు కుదుర్చుకొంటుంది. కాబట్టే యీ బూర్జువావర్గ ప్రభుత్వం ప్రజాసామాన్యానికి, ప్రజాతంత్ర

సూత్రాలకు వ్యతిరేకమైన విధానం అవలంబిస్తోంది.

ఇంతకుముం దంతా, బూర్జువావర్గమూ, దీనికి ప్రాతినిధ్యం వహిస్తున్న జాతీయనాయకత్వమూ, ప్రజాపక్షంలో ఉన్నారు. కాని యిప్పుడు బూర్జువావర్గం యీ పక్షం వదలిపెడుతూన్నది. ఆగస్టు 15 న అధికారపు అప్పగింతవల్ల పరిస్థితుల్లో వచ్చిన ముఖ్యమైన మార్పే ఇది.

ఇకముందు ప్రజాతంత్రవిప్లవం, బూర్జువాప్రభుత్వాన్నిదాని విధానాలను కాంగ్రెసుయొక్క బూర్జువా నాయకత్వాన్ని ఎదుర్కొని నడపవలసి వుంది.

## మతకలహాలదాడి వెనుకనున్న తతంగం

ప్రభుత్వంలో ప్రజానాయకు లున్నందువల్ల, ఈ ప్రభుత్వం ప్రజాపోరాటాల వెల్లువ ఉధృతంగావున్న కాలంలో ఏర్పడినందువల్ల ప్రభుత్వంయొక్క వర్గస్వభావమూ, ఈ వర్గంలో వచ్చిన మార్పూ మరుగుపడ్డాయి.

అభివృద్ధినిరోధక సంస్థానాధీశ్వరులూ, తక్కిన సామ్రాజ్యవాదుల తొత్తులూ మతకలహాలను రెచ్చగొట్టడంద్వారా ప్రజాతంత్రశక్తులపై దాడి ప్రారంభించారు. జాతీయ ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు. ఇది చూచి అభివృద్ధినిరోధకులు విప్లవాత్మకమైన ప్రభుత్వంపై "దాడిచేస్తున్నా"రనీ, కాబట్టి ప్రభుత్వాన్ని బేషరతుగా బలపరచడం ప్రజల కర్తవ్యమనీ అనేకులు అపోహపడ్డారు. ఇది పరిస్థితులను సంపూర్ణంగా అపార్థం చేసుకున్నందువల్ల కలిగిన ఊహ.

పంజాబ్, యు. పి. రాష్ట్రాల్లోనూ, సంస్థానాల్లోనూ మతకలహాలను రెచ్చగొట్టడం, అమాయకులైన వేలాది

హిందూ - ముస్లిం ప్రజానీకాన్ని హత్యచేయడం, సంస్థానాల్లో వున్న మైనారిటీ ప్రజలను నిశ్శేషంగా హతంచేయడం, అమాయకులైన పురుషులు, స్త్రీలు, శిశువులు ఎందరో నానా బాధలపాలుకావడం, ఈ పరిస్థితులు ఆర్థిక అరాజకత్వానికి దారితీయడం -

ఇవన్నీ సామ్రాజ్యవాద ఫ్యూడల్ వర్గాలకు చెందిన విప్లవ వ్యతిరేకశక్తులు ముందుగానే ఆలోచించి చేసిన కుట్రలే. వీటి ఉద్దేశ్యం, భారతదేశంలోని ప్రజాతంత్రవిప్లవాన్ని రక్తప్రవాహంలో ముంచి విప్లవశక్తులను విచ్ఛిన్నం చేయడం, సమ్మెలద్వారా,సంస్థానాల్లో విజృంభించిన సాయుధ పోరాటాలద్వారా ప్రజాతంత్ర విప్లవము వేపు పురోగమిస్తున్న ప్రజలపైనే ఈ విప్లవవిఘాతశక్తులు దాడిచేశాయి.

విప్లవస్వరూపం ధరిస్తున్న ప్రజల అసంతృప్తిని మతోన్మాదచర్యలలోకి దింపి,ప్రజాశక్తులను ఛిన్నాభిన్నం చేయడమే విప్లవవిఘాతశక్తుల ప్రయత్నం. ఈ ప్రయత్నంద్వారా ప్రజా ఉద్యమాలకు వ్యతిరేకంగా స్వార్థపరులైన పెట్టుబడిదారీ, జమీందారీ వర్గాలలో ఒక నూతన సంఘటన నిర్మించవచ్చుననీ, ఈ నూతన సంఘటనలో బూర్జువావర్గం మరింత మితవాద ధోరణిలోకి దిగజారి, సంస్థానాధీశ్వరులకూ, మతదురహంకారులకూ లొంగిపోతుందనీ; అప్పుడు ప్రజలకు వ్యతిరేకంగా మరింత బలవత్తరమైన సంఘటనను నిర్మించవచ్చుననీ; విప్లవవిఘాతశక్తుల ఎత్తు.

ఇదిసాధించవలసిన విధానమేమంటే, ప్రభుత్వంలో బాహాటంగా మతతత్వవాదులుగా ఉన్నవారిని బలపరచాలి.

హిందూమత దురహంకారశక్తులను సంతృప్తిపరచేందుకై సంస్థానాధిపతులు నిరంకుశత్వానికి సంబంధించిన సమస్యలై ప్రభుత్వం సంస్థానాధీశులకు లొంగిపోయేలాచేయాలి. పటేలు అనుసరించుతూన్న మతోన్మాద విధానాన్ని బలపర్చాలి. నెహ్రూయొక్క ఊగిసలాటవిధానాన్ని ఓడించాలి. ఇదీ విప్లవ విఘాత శక్తులు వేసుకొన్నపంథా.

విప్లవ విఘాతక శక్తులు దీర్ఘంగా ఆలోచించి పన్నిన ఈకుట్ర ప్రజల్లోనూ, రాజకీయ పార్టీల్లోనూ కలవరమూ, గందరగోళమూ, ఊగిసలాటా కల్గించటంలో కొంతవరకు నెగ్గింది. కుట్రయొక్క ఉద్దేశమేమిటో మరచిపోయి భయం చుట్టుకొని ప్రభుత్వాన్ని బలపరచాలనే పోకడ పొడచూపింది.

సామ్రాజ్యవాదులకూ, వారి ఏజంట్లకూ సరిగ్గా ఇదే కావలసింది. వారికి కార్మికవర్గమూ, ప్రజాతంత్ర శక్తులూ ప్రభుత్వాన్ని బలపరచడంఇష్టమే. కారణమేమంటే ఇలాజరిగితే ప్రజాతంత్రవిప్లవాన్ని ముందుకు తీసుకొనిపోవాలనే ప్రయత్నాలికవుండవు. జాతీయప్రజాతంత్ర శక్తులపురోగమనాన్ని ఎదిరించే ప్రభుత్వవిధానాన్ని వ్యతిరేకించటం కాని, విమర్శించటం కాని వుండదు

ఇందువల్ల, అభివృద్ధినిరోధకుల ఎత్తుగడలు తప్పకుండా ఫలిస్తాయి. నేడు పెద్ద ఎత్తున మతకలహదావాగ్ని వ్యాపించడము ఎలా సాధ్యమైంది? జాతీయబూర్జువా నాయకత్వం జాతీయప్రయోజనాలకు విరుద్ధంగా సామ్రాజ్యవాదులతో చేసుకొన్న రాజీమూలంగా విప్లవశక్తులను ఛిన్నాభిన్నం

చేసింది. తద్వారా అభివృద్ధినిరోధకులు ప్రజల అసంతృప్తిని తప్పుడుదోవలు పట్టించడానికి అవకాశమిచ్చింది.

సామ్రాజ్యవాదుల కుట్ర వారితో బూర్జువావర్గం చేసుకొన్న రాజీ, ఈరెండిటివల్ల మతకలహాలు వచ్చాయి. కాని వేరుకాదు. సామ్రాజ్యవాదులు మన దేశంలో మతకలహాలు చెలరేగడానికై బలమైన పునాదులు వేశారు. ఇది నాలుగు విధాలుగా చేశారు. (1) హిందూ-ముస్లింల మధ్య పరస్పరవైరం తెచ్చిన దేశవిభజన (2) మతవైషమ్యాలు విపరీతంగా రగుల్గొనేలా సరిహద్దునిర్ణయం (3) సంస్థానాలకు స్వతంత్రంగా వుండటానికి అవకాశం ఇవ్వటం - ఇందువల్ల సంస్థానాలు ఇండియా - పాకిస్థానులు రెండిటితోనూ బేరమాడుతూ రెండిటి మధ్యా ద్వేషభావాన్ని ఎక్కువ చేయడం (4) ముఖ్యులైన సైనికాధికారులకు, ఇతర ప్రభుత్వోద్యోగులకు, మత దురహంకారమనే విషాన్ని బాగుగా ఎక్కించటం, దీని ఫలితంగా మత కలహాలను వ్యాపింప చేయడానికి రాజ్యాంగ యంత్రాన్ని బాగా ఉపయోగించారు.

సామ్రాజ్య వాదులు మత కలహాలను రెచ్చగొడుతూ న్నారు. మత కలహాలవల్ల ఏర్పడ్డ క్లిష్టపరిస్థితుల్లో జాతీయ బూర్జువా నాయకత్వం సామ్రాజ్యవాదుల పెత్తనం క్రిందికి వస్తారనీ, ప్రజానీకం పైవర్గాల ప్రతినిధులైన జాతీయ నాయకుల చేతిక్రిందికి వస్తారనీ సామ్రాజ్యవాదుల ఉద్దేశ్యం. ప్రజల ఐక్యతను, ప్రజాతంత్ర ఉద్యమాలనూ అణగద్రొక్కాలని కూడా సామ్రాజ్యవాదుల ఆశయం.

ఈమత కలహాలకు ముఖ్య ప్రేరేపకులు, ఫాసిస్టు శక్తు

లైన హిందూమహాసభ, ఆర్. యస్. యస్. ముస్లిం మత దురహంకారులు, సామ్రాజ్యవాదులు వెనుకనే దిగవిడచి వెళ్లిన ప్రభుత్వాధికారులు. వీరందరికీ సంస్థానాధీశ్వరులు, ఇతర భూస్వాములు అధిపత్యం వహిస్తున్నారు. కాంగ్రెసు, లీగు నాయకుల్లో కొందరు ఈ మతకలహాలను వ్యతిరేకించినాకూడా బూర్జువావర్గమూ, కాంగ్రెసు - లీగు నాయకత్వంలో ఒక భాగమూ మతకలహాల్లో ప్రధానపాత్ర వహించి పనిచేశాయి.

జాతీయ బూర్జువా నాయకత్వంలోకూడ ఒక తరగతి వారు, మతకలహాలను రెచ్చగొట్టడం ఒక విధానంగా అవలంబిస్తున్నారు - మైనారిటీ ప్రజలపట్ల వారి విధానంలో ఇదొక భాగం. బ్రిటిషు సామ్రాజ్యవాదంతో రాజీచేసుకొనడమూ, ఇండియా - పాకిస్థానుల మధ్యవున్న తగాదాల సందర్భంలో సామ్రాజ్యవాదులపై ఆధారపడడం - ఈ రెండు విధానాలూ ఒక డొమినియన్ ప్రభుత్వం ఇంకొక డొమినియన్ ప్రభుత్వాన్ని బెదిరించి లొంగతీసుకోవటానికై మైనారిటీ ప్రజలను హత్యచేయించే పరిస్థితికి దారితీశాయి. ఉదాహరణకు ముస్లింలను హత్య చేయించడం, పాకిస్థానును భయపెట్టి లొంగదీయడానికి చేసిన ప్రయత్నాలలో ఒకటి. ఇట్లా అరాచకానికి, అరాచకంతో బదులుచెప్పే ఈ విధానం బ్రిటిషు సామ్రాజ్యవాదులకు చాలా చక్కగా ఉపయోగ పడుతుంది.

సామ్రాజ్యవాదులలో రాజీపడ్డ యీనాయకుల రాజకీయపు ఎత్తులకోసం మైనారిటీలను బలియిస్తున్నారు.

బూర్జువా నాయకత్వంలో ఒక భాగం సాయుధులైన

మతోన్మాద గూండా మూతాలను ప్రోత్సహిస్తున్నది. రక్షణ యిస్తున్నది. ఎందుకంటే రాజకీయప్రతికక్షులపైన ప్రజాతంత్ర ఉద్యమాలపైనా ఉపయోగించడానికి సంస్థానాధిపతులనూ, ఇతర స్వార్థపరులనూ, బలపరచడానికీనూ ఈగూండా గుంపులను పోలీసులగా, హోంగార్డులుగా, సైనికులుగాకూడా చేర్చుకుంటూన్నారు.

ఈ జాతీయనాయకత్వంలో మరొకభాగం, కలహాలకు ప్రోత్సాహకారణమైన రాజీవిధానాన్నే అనుసరిస్తున్నారు. తీరా కలహాలు వచ్చేసరికి, వాటివలన పరిపాలన, వ్యాపారం మొదలైనవాటిలో ప్రతిష్టంభనా, తొక్కుళ్ళాటా ఏర్పడేటప్పటికి భయపడే, విస్తుబోయే ఏదో నామ మాత్రమైన చర్యలు తీసుకుంటున్నారు. ఈవిపరీతమైన కలహాలనూ, అరాచకత్వాన్నీ ఆపేందుకు, కార్మికులు, కర్షకులు, అభ్యుదయ కాముకులైన బుద్ధిజీవులు – వీరే ధైర్యసయిర్యాలతో మతకలహాలను ప్రతిఘటించే శక్తులు. మతకలహాలు ప్రజాతంత్ర ఉద్యమాలనన్నిటినీ సర్వనాశనంచేయడమే యిందుకు కారణం. వీరు మతకలహాలను ఎదుర్కొని పోరాటంలో తమకున్న అన్ని అవకాశాలనూ ఉపయోగించుకోవాలి. మతకలహాలను అరికట్టే ప్రభుత్వచర్యలనుగూడా ఉపయోగించుకోవాలి.

కాని, సామ్రాజ్యవాదంతో పొత్తుకుదుర్చుకొనివారితో సహకరించే బూర్జువావర్గ విధానాన్ని, జాతీయ స్వయంనిర్ణయసూత్రంపట్ల బూర్జువావర్గానికియున్న వ్యతిరేకతనూ, ఓడించగలిగితేతప్ప, మతకలహాలు మాటిమాటికి చెలరేగుతూనేవుంటాయి.

ఒక్క మతకలహాలేకాదు; అనేకరకాలైన కలహాలు బయలుదేరుతాయి. ఒకజాతికీ, ఇంకొకజాతికీ, పైకులాలవారికీ వెనుకబడిన కులాలవారికీ, కొండజాతిప్రజలకు, ఇతరులకూ కలహాలు రానురాను ఎక్కువైపోతాయి. సంపూర్ణ ప్రజాతంత్రమూ, ప్రజల స్వయంనిర్ణయాధికారమూ సాధించేవరకు రాజ్యాంగసంస్థలపై సామ్రాజ్యవాదుల పెత్తనం పూర్తిగా పోయేవరకూ ఈ కలహాలు అంతంకావు.

కాబట్టి, ఈకలహాలకు ఆస్కారమే లేకుండా పోవాలంటే, కాంగ్రెసు లీగు నాయకత్వాల అభివృద్ధి నిరోధక విధానాలను పట్టుదలతో ఎదుర్కొని పోరాడాలి. సామ్రాజ్యవాదాన్ని పూర్తిగా తుడిచివేసి సంపూర్ణ ప్రజాతంత్రం నెలకొల్పినప్పుడే యీ వివిధ కలహాలను అరికట్ట గలుగుతాం.

## రాజీవాదుల, మతోన్మాదుల కుళ్లు బట్టబయలు చేయాలి

సంస్థానాధీశ్వరుల పట్ల, సామ్రాజ్యవాదుల పట్ల, కాంగ్రెసు, లీగు నాయకత్వాలు అవలంబించిన రాజీవిధానమే మత కలహాలను ప్రేరేపించింది. ఇక ముందుకూడా మతకలహాలు ఎక్కువ కావడానికి కారణభూతమవుతుంది.

రాజీ పంథావల్ల విప్లవఘాతుక శక్తులు బలపడుతాయి. ఇండియా విషయంలో కూడా యింతే.

జాతీయ నాయకులందరూ ఈరాజీ పంథా తొక్కిన ప్రబుద్ధులే. మత దురహంకార శక్తులు ప్రజలపై విజృంభించి దాడి చేయడానికి వీరందరూ సమానంగా బాధ్యులే.

సంస్థానాధీశ్వరుల, సామ్రాజ్యవాదుల దాడిని ఒక గొట్టాలంటే, జాతీయనాయకుల రాజీవిధానాలను బట్టబయలు చేయాలి. ఈ రాజీవిధానాలకు మతకలహాలదాడులకు ఉన్న సన్నిహితసంబంధం ప్రజలు అర్థంచేసుకోవాలి.

కాబట్టి మతసమస్యపై వివిధ జాతీయనాయకులు అవలంబిస్తున్న వైఖరినిబట్టి వారికి ప్రధానమైన తేడాలు ఉన్నాయని అనుకోడం తప్పు. బహిరంగంగా మతతత్వవిధానం అవలంబిస్తున్న పటేలూ, మతకలహాలను వ్యతిరేకించి, ముస్లింమైనారిటీలకు రక్షణ యివ్వాలనే నెహ్రూ - వీరిద్దరూ రాజీపంథావల్ల యేర్పడ్డ సుడిగుండంలో తిరుగుతున్నారు. నెహ్రూ స్వతంత్రపంథా అనుసరించడంలేదు. కాబట్టి ఆయనకు సర్దార్ పటేలును అనుసరించక తప్పదు.

ముస్లిం మతదురహంకారానికి ప్రతీకారంగా మాత్రమే హిందూమతదురహంకారం బయలుదేరిందని నెహ్రూ భావన కాదు. కాశ్మీరుసమస్యపైన పాకిస్థానుప్రతీకార చర్యలు తీసుకుంటామనే బెదిరింపుల్లోకి దిగాడు. గాంధీజీ హత్యానంతరంకూడా హిందూమహాసభ, ఆర్. యస్. యస్. సంస్థల విషయంలో ఖండితంగా ప్రవర్తించలేక పోయ్యాడు. కేంద్రరాష్ట్రప్రభుత్వాలు, గాంధీహత్య నుపయోగించుకొని నిజంగా మత దురహంకారవ్యతిరేకమైన, ప్రజాతంత్రవిప్లవశక్తులపై చేసే దాడికి అంగీకరించాడు. దీన్నిబట్టి నెహ్రూ సర్దారుపటేలుకు లొంగిపోయాడని రుజువవుతున్నది.

దీన్నుండి, మతకలహాలను అణచి, శాంతిని స్థాపించటంలో కార్మికవర్గంయొక్క పార్టీప్రభుత్వానికి తోడుపడ

దని అర్థం తీయకూడదు. కానీ, అలా తోడ్పడంవల్లనే మత కలహాలకు మూలకారణాలను పోగొట్టలేమని పార్టీకి తెలుసు. మతకలహాలను అణచివేసేందుకు అధికారవర్గం తీసుకుంటూ వున్న చర్యలు మైనారిటీలను అణచివేయడానికై వేసిన ఎత్తులని కూడా పార్టీ గుర్తిస్తున్నది.

మతకలహాలను అరికట్టేందుకు గల ప్రతిఅవకాశాన్నీ పార్టీ వినియోగిస్తుంది. వాటిని అణచడానికి ప్రభుత్వం చిత్తశుద్ధితో ప్రయత్నించినపుడల్లా, సాయపడుతుంది. మతకలహాలు విప్లవవ్యతిరేకదాడిగా పార్టీ పరిగణిస్తుంది. కాని, జాతీయ ప్రభుత్వం ప్రస్తుతం తానవలంబిస్తున్న విధానంతో వాటిని జయప్రదంగా అణచగలదనే భ్రమను పార్టీ పెట్టుకోదు.

మతకలహాలను ప్రతిఘటించే సందర్భంలో వాటిని ఖండిస్తూ నెహ్రూలాంటివారు చెప్పే ప్రతిమాటనూ ఉపయోగించడమూ బాహాటంగా మతతత్వాన్ననుసరిస్తూన్న నాయకుల విధానాన్నెదుర్కోవడమూ, పార్టీ కర్తవ్యమని వేరే చెప్పనక్కరలేదు. మతకలహాలకు వ్యతిరేకంగానే నెహ్రూలాంటివారాడే మాటలకూ, చేసే ప్రచారానికీ, తీసుకునే చర్యలకూ చాలా ప్రాముఖ్యత వుంది. జమీందారీ అభివృద్ధి నిరోధకవర్గాలకు అత్యంత సన్నిహితంగా వున్న పటేలు లాంటివారిని మరింత తేలికగా వేరుచేయడానికి ఇవి ఉపయోగపడతాయి.

## పటేలు - నెహ్రూ

ఒక్క మతకలహాల విషయంలోనే కాదు. ప్రజాతంత్ర

విధానాలవిషయంలో కూడా నెహ్రూ అంటే కొన్ని భ్రమలు వున్నాయి.

పటేలువిధానాలను ప్రతిఘటించేవానిగా నెహ్రూను లెక్క కట్టాం. ప్రజాతంత్రశక్తులకాయన నాయకుడనిపించేలాచేశాం. పటేలుపట్ల నెహ్రూమాటల్లో కనబరచిన వ్యతిరేకతను గోరంతలు కొండంతలుగా చిత్రించాం. పటేలుకు ఆయనలొంగు బాటును చల్లగా దాటవేయడమో, అసలు లెక్కలోకి తీసుకోకపోవడమో జరిగింది. పటేలుకు వ్యతిరేకంగా నెహ్రూను బలపరచినట్లయితే, ఈప్రభుత్వాన్ని ప్రజావాంఛలను నెరవేర్చగల సాధనంగా మార్చివేయగలమనే భ్రమను ఈవిధంగా కలిగించాం.

నెహ్రూను ఈవిధంగా అంచనా వేయడం మార్క్సిజానికి విరుద్ధం. బూర్జువా నాయకవర్గాలతోకను ప్రజలను ముడిపెట్టటం తప్ప మరొకటికాదు. బూర్జువా నాయకవర్గానికి పటేలు ఏలా ప్రాతినిధ్యం వహిస్తున్నాడో నెహ్రూకూడా అంతే అన్నది స్పష్టంగా గమనించాలి. పరాయి సామ్రాజ్యవాదులతో చేతులుకలిపిన బూర్జువావర్గప్రధానాలనూ, దానిప్రయోజనాలనే వీరిద్దరూ పాడుతున్నారు. నిజానికి బూర్జువా క్యాంపులో నెహ్రూ పటేళ్ళ కున్న భేదాభిప్రాయాల్లాంటి భేదాభిప్రాయాలన్నీ ఆవర్గమంతటి యొక్క ప్రధానవైఖరి సరిహద్దుల్లోపలే, అంటే సామ్రాజ్యవాదంతో అది పొందుకుదుర్చుకున్న వైఖరిలోకి మణిగేవిగానే వుంటాయి. నెహ్రూ, పటేళ్ళిద్దరూ సామ్రాజ్యవాదంతో చేతులు కలిపినవర్గానికే ప్రాతినిధ్యం వహిస్తారు. వారికున్న భేదాభిప్రాయాలన్నీ ఆవర్గంయొక్క విద్రోహకర

రాజీవిధానపు చట్రంలోపలనే పరిష్కరించుకొంటున్నారు. ఇకముందు పరిష్కరించుకొంటారుకూడా. యీవర్గంయొక్క విధానాన్ని వ్యతిరేకించి పోరాడకుండా కార్మికవర్గం ముందుకు సాగజాలదు. కాబట్టి బూర్జువాశిబిరంలో "పటేలు నెహ్రూ విభేదాల" లాంటి భేదాలమీద ఆధారంచేసుకుని కార్మికవర్గం తనరాజకీయవిధానాన్ని, పాలసీని నిర్ణయించుకోవడం మార్క్సిజానికి వ్యతిరేకం.

ఈనాడు నెహ్రూ పటేలుకి లొంగిపోతున్నాడేగాని, అతనిని ప్రతిఘటించడంలేదు. విదేశాంగవిధానంలోనూ, సంస్థానాలవిషయంలోనూ, కంట్రోళ్ళరద్దు విషయం లోనూ, పరిశ్రమలవిషయంలోనూ, ఇంకా ఎన్నోవిషయాల్లో జరుగుతున్నదిదే. అనేక ప్రధాన అంశాల్లో నెహ్రూ పటేలునే తలదన్నిపోతుంటాడు. కార్మికుల సమ్మెలను దేశానికి వెన్నుపోటని ఆడిపోశాడు. ఎందువల్ల నెహ్రూ ఇలా పటేలుకు లొంగిపోతున్నాడు? పటేలు విధానం కాకుండా ఆయనకు స్వతంత్రవిధానం ఏదీ లేదు కాబట్టే. స్వతంత్రవిధానా న్నవలంబించాలంటే పెద్దపెట్టుబడిదారీవర్గాలను ప్రతిఘటించాలి. అది ఆయన చేయలేదు.

దీన్నంతటినిబట్టి, నెహ్రూ అంటే పెట్టుకున్న భ్రమలపై మన విధానాన్నంతటిని ఆధారపర్చడం కార్మికవర్గశ్రేయస్సుకే విరుద్ధం అన్నది స్పష్టమాతున్నది.

ఈ నాడు తక్షణం నెరవేర్చవలసిన కర్తవ్యం జాతీయ ప్రజాతంత్రవిప్లవాన్ని పరిపూర్తిచేయడం తప్ప మరొకటి కాదు. కాంగ్రెసునాయకులతో కూడియున్న కేంద్రప్రభుత్వం

యీ కర్తవ్యాన్ని నెరవేర్చజాలదనేది సుస్పష్టం.

కాబట్టి కాంగ్రెసునాయకులలో ఏర్పాటైన కేంద్ర ప్రభుత్వం జాతీయప్రజాతంత్రవిప్లవానికి బద్ధశత్రువనే విషయం సుస్పష్టం. పెట్టుబడిదారీవ్యవస్థయొక్క చరమావస్థలో, అది సర్వవ్యాపితసంక్షోభా న్నెదుర్కొంటున్నదశలో, ప్రజాతంత్ర ఉద్యమాన్ని జయప్రదంచేసేందుకు బూర్జువావర్గం నాయకత్వం వహించగలదని నమ్మకోగూడదని మార్క్సిజం, లెనినిజం బోధిస్తూంది. ఈ దశలో బూర్జువావర్గం ప్రజాతంత్ర ఉద్యమానికి ద్రోహంచేసి, ఎదిరిపక్షంలో చేరిపోతుందనీ, కార్మికవర్గమే ప్రజాతంత్ర ఉద్యమానికి నాయకత్వం వహించాలనీ మార్క్సిజం - లెనినిజం స్పష్టంచేస్తూంది.

## జాతీయనాయకులు - ప్రజలు

ప్రభుత్వాధికారంలో వున్నవారు ఇంకా ప్రజా నాయకులే అన్న విషయాన్నీ, ఈప్రభుత్వం వెనుకటి సామ్రాజ్యవాద ప్రభుత్వాల్లాంటిది కాక, జాతీయప్రభుత్వంగా ప్రజలు భావిస్తున్నారన్న విషయాన్నీ మనం మరచిపోగూడదు.

ఈ జాతీయప్రభుత్వం పరాయి సామ్రాజ్యవాదులతో చేతులు కలుపుతున్నదనీ, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు దేశాన్ని అమ్మివేస్తుందనీ, నాయకు లనుసరిస్తున్న విధానాలు మతకలహాలకే దారితీస్తున్నవనీ, పెద్ద పెట్టుబడిదారీ వర్గాల ప్రయోజనాలను దృష్టిలోపెట్టుకునే ప్రభుత్వం వ్యవహరిస్తున్నదనీ, ప్రజాసామాన్యం యింకా గుర్తించడంలేదు. దేశానికి చేకూర్చిన ప్రభుత్వంగానే ప్రజలు దానిని భావిస్తున్నారు. కాంగ్రెసు నాయకులంటే భ్రమలకూ, జాతీయవ్యామోహానికి

ప్రజలు పూర్తిగా లోనయ్యారు. జాతీయప్రభుత్వంపట్ల ప్రజలకు గల భ్రమలు త్వరత్వరగా తొలగిపోతున్నా వారికి నెహ్రూ పట్ల, కాంగ్రెసు పట్లగలవిశ్వాసం ఇంకాపోలేదు. ఎన్నోసార్లు ఆశాభంగంకలిగినా, పాతభ్రమలను వారింకా అంటిపెట్టుకునే ఉన్నారు.

జాతీయప్రభుత్వం అంటే ప్రజలకు గల వ్యామోహాన్ని గమనించకుండా సాగించే విమర్శలు నిష్ప్రయోజనం కావచ్చు.

ప్రభుత్వవిధానాలను విమర్శించేటప్పుడు ఖచ్చితమైన ఉదాహరణాలను ఆధారంగా తీసికొనకపోతే అటువంటి అనేక ఉదాహరణలను ఆధారంగా తీసుకొని ఓపికతో వాదించి జాతీయప్రభుత్వవిధానాలకు మన నిర్వచనం సరైనదని ప్రజలు గుర్తించేలా చేయకపోతే కాంగ్రెసుపట్ల ప్రజాసామాన్యానికింకా ఉన్న గాఢవిధేయతను దృష్టిలో ఉంచుకొనకపోతే మన విమర్శలేమీ పని చేయవు. ప్రజలు రాజీకోరునాయకత్వాన్ని వదిలేట్లు చేయలేవు.

ప్రస్తుతం దేశంలోని ఆర్థికపరిస్థితులు అధ్వాన్నం కావడమూ అనేకవిషయాల్లో ప్రజలకు ఆశాభంగం కలగడమూ అభివృద్ధినిరోధకవిధానాలను జయప్రదంగా తూర్పార బట్టగలందులకు అనుకూలపరిస్థితులను కలిగిస్తున్నాయి. ఇటువంటి పరిస్థితులు యిదివరకు లేవు.

ప్రజాతంత్రఆశయాలను సాధించేందుకు ప్రజలు పూనుకొనేలా చేయాలంటే, కార్మికవర్గం ప్రజాసామాన్యాన్ని బూర్జువా నాయకత్వం నుండి వేరుచేయాలి. జాతీయ ఐక్యత అంటే నూతన దృక్పథంతో నూతన ఉద్యమాన్ని నిర్మించాలి.

103

# భారతదేశంలో ఆర్థిక సంక్షోభం పెట్టుబడి దారులు సూచించే పరిష్కారమార్గం

## ప్రజలు సూచించే పరిష్కారమార్గం

వలసదేశాలఆర్థికవిధానంలో ఏర్పడిన సంక్షోభమే ప్రజా విజృంభణకు కారణభూతమైనది. యుద్ధకాలంలో ప్రజలను దోచుకోవడం, యుద్ధానంతర పరిస్థితులూ ఈసంక్షోభాన్ని తీవ్రతరం చేశాయి.

భారతదేశంలో ఏర్పడిన ఆర్థికసంక్షోభంయొక్క ప్రధానలక్షణాలివి.

1. జమీందారీ భూస్వామ్య విధానాలవల్లనూ, చిన్న స్కేల్లో జరిగే వుత్పత్తి నష్టపడిపోడంవల్లనూ, వ్యవసాయోత్పత్తి పూర్తిగా దెబ్బతినిపోతూవుంది.

2. యుద్ధకాలంలో అభివృద్ధికి అనుకూలపరిస్థితు లున్నప్పటికీ యుద్ధకాలం నడిమధ్యనుంచే పారిశ్రామికఉత్పత్తి తగ్గిపోతూవచ్చింది. వలసదేశ విధానం ఎంత అధ్వాన్నంగా ఉందో దీన్నిబట్టే బోధపడుతుంది.

3. యుద్ధకాలంలో వచ్చిన నోట్లముమ్మరంలో వలసదేశ సంక్షోభం మరింత స్పష్టంగా కనిపిస్తుంది. యుద్ధభారాన్ని భారత ప్రజాసామాన్యంపై రుద్దడానికే సామ్రాజ్యవాదులు నోట్లముమ్మరాన్ని ప్రారంభించారు.

4. ఒకవైపు ధనం (పెట్టుబడిదారులచేతుల్లో) కుప్పలు పడుతూంది. మరోవైపు దరిద్రదేవత నగ్నస్వరూపంతో ప్రత్యక్షమవుతూవుంది. ఈ భేదం నానాటికీ ఇంకా తీవ్రతర మవుతూవుంది. రైతు, కూలీ ప్రజాసామాన్యం రోజురోజుకీ ఇంకా ఎక్కువగా బీదతనానికి గురిఅవుతారు. వారికి బొత్తిగా బ్రతుకుతెరువు లేకుండాపోతుంది.

ధనికవర్గం, సామ్రాజ్యవాదులూ, భూస్వాములూ, జమిందారులూ యుద్ధానంతరంకూడా తమదోపిడీని కొనసాగించుతూనే ఉంటారు. ఉత్పత్తిలోవచ్చిన తగ్గుదల ఫలితంగా తమలాభాలు దెబ్బతినకుండా ఉండేందుకు ఆర్థికభారాన్ని ప్రజలనెత్తిన రుద్దడానికి ప్రయత్నిస్తారు. రైతు కూలీ, మధ్య తరగతి ప్రజల్ని దోచుకొని వ్యవసాయ సంక్షోభంవల్ల తమ హక్కులకు తమలాభాలకు భంగం కలగకుండా చూస్తారు. ఈదోపిడి తీవ్రతరమై ప్రజల ఆర్థిక పోరాటానికీ, మరింత ఉచ్ఛస్థాయిలో రాజకీయ పోరాటానికీ దారితీసుంది.

మధ్యయుగపు భూస్వామ్యపద్ధతిపైన ఆధారపడిన వలస రాజ్య ఆర్థికవిధానం యుద్ధానికి పూర్వమే ఎప్పటినుంచో భగ్నమౌతూ వచ్చింది. 1929 నాటి ప్రపంచపెట్టుబడిదారీ సంక్షోభం ఆరంభమైనప్పుడే వ్యావసాయికవిప్లవ పరిస్థితు లేర్పడ్డాయి. 1939 లో రెండవ ప్రపంచయుద్ధారంభంలో ఆ పరిస్థితులింకా తీవ్రతరమైనవి. ఈపాటికే పాతబడ్డ భూస్వామ్య సంబంధాలు వ్యవసాయోత్పత్తిని అరికట్టే సంకెళ్ళయినాయి. రాయల్ కమీషనే శాశ్వతజమిందారీ పద్ధతిని రద్దుచేయాలని సిఫార్సు చేసింది. (అయితే భూస్వాములకు తగిన నష్టపరిహారం

యివ్వమనిగూడ సిఫార్సు చేసిందనుకోండి)

కాని (1930-40) ఒక్క దశాబ్దంలో అప్పుడప్పుడూ, భారతదేశ వివిధప్రాంతాలలో చెలరేగిన రైతుపోరాటాలు, జమిందారీవిధానాన్ని ఎటువంటి నష్టపరిహారమూ లేకుండా రద్దుచేయడమూ, భూమిని దున్నే రైతులకే, పునర్విభజన, సమాజానికి అత్యవసరమని రుజువుచేశాయి.

ఇన్నిటి నెత్తివన్ని, రెండవ ప్రపంచయుద్ధకాల ఆర్థిక విధానం వ్యవసాయ వ్యవస్థను పూర్తిగా తారుమారు చేసింది. 1943 నాటి, సర్వనాశకరమైన బెంగాలు క్షామమూ, బీహారూ, ఒరిస్సా, మలబారు, ఆంధ్రరాష్ట్రాలలో వచ్చిన కరువులూ, భూమి వ్యవస్థ శీఘ్రగతిలో భగ్నమైపోతున్నదని చాటిచెప్పినవి.

నోట్లముమ్మరం, హెచ్చుధరలూ, జీవితావసర వస్తువులకొరత మొదలైన లక్షణాలుకల్గిన యుద్ధకాలపు ఆర్థిక వ్యవస్థతో కష్టజీవులైన రైతులు పూర్వంకన్నా విపరీతంగా దరిద్రులైనారు. వ్యవసాయపు ఖర్చులు భరించరానంతగా పెరిగినవి. బీద, మధ్యరైతుల కుటుంబాదాయవ్యయాలు తల్లక్రిందులైనవి. యుద్ధభారాన్ని ప్రజనెత్తిని వేయడానికి సామ్రాజ్యవాదులు తెచ్చిపెట్టిన నోట్లముమ్మరంతో రైతాంగముయొక్క ఆర్థికభార మినుమడించింది. రైతాంగం తమకున్న కొంచె కోల్పోయి త్వరగా దివాలాతెత్తడం జరిగింది.

పన్నులభారంతో కుంగిపోతున్న రైతాంగపు దీనస్థితిని భూస్వాములు పూర్తి అవకాశం తీసుకున్నారు. వారి పొలాల నన్నిటినీ కాజేశారు. బీదరైతుల పొలాలు

భూస్వాముల వశమైపోవడంవలన, భూస్వాముల చేతుల్లోనే ధాన్యమంతా చిక్కింది. భూస్వామి ముఖ్యమైన ధాన్యపునిల్వదారైనాడు. ధాన్యంలో దొంగమార్కెట్టు వాడివద్దనే ప్రారంభమైంది. బీదరైతు పొలంపశం చేసుకునీ, తన అదనపు ధాన్యాన్ని దొంగ మార్కెట్టులో చుక్కలంటే ధరలకు అమ్ముకునీ, ధనికరైతు యింకా ధనికుడైనాడు. భూస్వామీ, ధనికరైతూ, యుద్ధకంట్రాక్టరూ, వ్యాపారీ వీళ్ళు గ్రామసీమలో కొత్తధనికవర్గకూటమిగా, దొంగమార్కెటు బందిపోటు గ్యాంగుగా, తయారైన దుష్టచతుష్టయం!

ఈపరిణామాల ఫలితంగా మధ్యతరగతిరైతుల సంఖ్య తగ్గిపోయింది. బీదరైతుల, భూమిలేనిరైతుల సంఖ్య అపరిమితంగా పెరిగిపోయింది. కొద్దిమంది మధ్యతరగతి రైతులు మాత్రం, ధనికరైతులుకాగలిగారు. ఈకొత్తదశకు మధ్యతరగతి రైతాంగం చితికిపోవడం ప్రధాన లక్షణం.

భూస్వాములూ, ధనికరైతులూ చేరి, బీదరైతులను అసంఖ్యాకంగా భూములనుండి వెళ్ళగొట్టడం వలన పల్లెటిప్రాంతాల్లో ఒక నూతన వర్గీకరణ మేర్పడ్డది. బీదరైతు ఆర్థికవ్యవస్థ తీవ్రమైన సంక్షోభంలో పడ్డది.

మధ్య, బీద తరగతుల రైతులపైనా, వ్యవసాయ కూలీలపైనా పడ్డ భారం, స్టెర్లింగునిల్వల ద్వారా బ్రిటను తీసుకున్న 1,600 కోట్ల రూపాయలకన్నా యెంతో ఎక్కువ. ఈ స్టెర్లింగునిల్వలు కాక దొంగ మార్కెటుదారులూ, ఛట్టా వ్యాపారస్థులూ (Speculators) రైతాంగం నుంచి ఎన్నో కోట్ల రూపాయలు కాజేశారు.

కాబట్టి యుద్ధం పూర్తయేసరికి గ్రామసీమల్లో వర్గాల చీలిక యింకా సునిశితంగా చీలింది. వర్గవైరుధ్యాలు యింకా తీవ్రతర మైనవి. మధ్య, బీదతరగతుల రైతులూ, పొలంలేని రైతులూ, 1946 వ సంవత్సరంలో లాగా, గ్రామసీమల్లో తయారైన కొత్త ధనికవర్గం మీద, భూస్వాములమీదా, పెద్ద రైతులమీదా తీవ్రమైన పోరాటా లారంభించారు.

గ్రామసీమల్లోని కొత్త ధనికులకూ, తిండి దొంగలకూ, భూమి దొంగలకూ, అధీనమైన వ్యవసాయ వ్యవస్థ యిప్పటికప్పుడే పతనోన్ముఖమైంది. వీరంతా జలగల వలె పట్టి వ్యవసాయాన్ని నాశనంచేస్తున్నారు. బీదరైతు కష్టించాలి, యీజలగలు మాత్రం ఆకష్టఫలితాన్ని దాహం తీసుకోవాలి. ఈలాంటి విధానంకింద వ్యవసాయం త్వరితంగా క్షీణించి, కరువు నిత్యలక్షణమైంది.

ఇందువల్లభూస్వామ్య సంబాధాలుల త్రెంచివేయడానికి రైతులు పెద్దయెత్తున పోరాటాలు చేయటం జరుగుతోంది. మరోవేపున వలసదేశాల్లో పెట్టుబడిదారీ విధానాన్ని అభివృద్ధి చేయడంలో గల వైరుధ్యాలన్నీ తీవ్రంగా విషమిస్తున్నాయి. రైతుకొనగోలుశక్తి అంతకంతకూ పడిపోవటంవలన పెట్టుబడుదారులు తయారుచేసిన వస్తువుల మార్కెట్టుకూడా అంతకంతకూ సంకుచిత మైపోతున్నది. అంటే సరకులమ్ముడుపోవడం లేదన్నమాట.

పెద్ద పెద్ద పరిశ్రమలను, రైళ్లు మొదలైన రవాణా రాకపోక సౌకర్యాలను నెలకొల్పడంలో పెట్టుబడిదారులంతో సంబంధాల నేర్పరుచుకోడంకోసం ముందుకువేసే ప్రతి అడుగూ రైతాంగంలో యింకా ఎక్కువ బీదతనాన్ని

పెంచుతుంది. తత్ఫలితంగా మార్కెట్టు యింకా క్షీణించుతోంది.

అసంఖ్యాక ప్రజానీకాన్ని తమ కొనుగోలుదార్లుగా (మార్కెట్) అట్టిపెట్టుకోవాలని సామ్రాజ్యవాదులూ, జాతీయ పెట్టుబడిదారులూ చూస్తారు. కాని వారు అవలంబించే దోపిడీవిధానంవల్ల కొనుగోలుదార్లశక్తి రోజురోజుకూ క్షీణించి పోతుంది.

పెట్టుబడిదారీ విధానంలోని పరస్పరవైరుధ్య ఫలితంగా మార్కెట్టు తగ్గిపోవడాన్ని గురించి ఏంగెల్స్ ఇలా చెప్పాడు.

పరిశ్రమలు విపరీతంగా పెరిగి తాము సృష్టించుకున్న మార్కెట్టునే నాశనం చేసుకుంటాయి. యిదే దాని సహజ పరిణామం. రైతుల గృహపరిశ్రమలను నాశనం చేయడం ద్వారా పెద్దపరిశ్రమలు మొదట తమకు కావలసిన మార్కెట్టును సృష్టించు కుంటాయి.

గృహపరిశ్రమలు లేకుండా రైతాంగం జీవించజాలదు. రైతులు రైతుల్లాగా బ్రతకడం దుర్భరం అవుతుంది. వారి కొనుగోలుశక్తి పూర్తిగా పడిపోతుంది. కొత్తపరిస్థితుల కనుగుణ్యంగా రైతులు, పారిశ్రామిక కార్మికులుగా తమ జీవితవిధానాన్ని స్థిరపరచుకోకపూర్వం వారి కొనుగోలుశక్తి చాలా తక్కువగా వుంటుంది. అందువల్ల కొత్తగా అభివృద్ధిచెందే పరిశ్రమలకు మార్కెట్లుగా వారు చాలా తక్కువ ఉపయోగపడతారు (కలకత్తా నేషనల్ బుక్కు ఏజన్సీ ప్రకటించిన "మార్క్సు, ఏంగిల్సు ఉత్తరప్రత్యుత్తరాలు" అనే పుస్తకంలో 439 వ పేజీ.)

భారతదేశంలో రైతుల గృహపరిశ్రమలు నాశనం చేయబడటమే గాకుండా వారి భూములు కూడా పోయాయి. కాబట్టి జమీందారీ, భూస్వామ్యవిధానాన్ని అదేవిధంగా కొనసాగించవలసిందే అంటే మార్కెట్టు ఇంకా తగ్గిపోవడమున్నమాటే.

ఈ వైరుధ్యాలన్నీ యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరమూ విపరీతమైన శక్తితో ప్రబద్ధలై పొడుచుకొచ్చినవి.

యుద్ధానికిడబ్బు సేకరించిన బందిపోటుల పద్ధతి-అంటే నోట్లముమ్మరం- వలన ఈ వైరుధ్యాలన్నీ తీవ్రతరమై భారతీయ వ్యవసాయం పతనావస్థకొచ్చింది.

పెట్టుబడిదారీ ప్రపంచసంక్షోభంవల్ల కష్టించే రైతుకెక్కువగా దెబ్బతగులుతుంది. పారిశ్రామిక వస్తువుల ధరలకన్నా, వ్యవసాయ పంటలధరలు ఎక్కువ త్వరగాపడిపోతాయి. అందువల్ల రైతులు యింకా ఎక్కువ త్వరగా దివాలా ఎత్తుతారు.

వీటి అన్నిటివల్లా బ్రహ్మాండమైన వర్గశక్తులు కదలికలో కొస్తాయి. కష్టజీవులైన రైతులూ, గ్రామసీమల్లోని చేతిపనివాళ్ళూ సామ్రాజ్యవాద - బూర్జువా - జమీందారీ కూటమియైన ప్రభుత్వంపైన దాడి ప్రారంభిస్తారు. వలసరాజ్యసమాజవ్యవస్థను కూలద్రోయడానికి ముందుకువస్తారు. అన్ని విధాలైన భూస్వామ్యపద్ధతులూ రద్దుకావాలి! దున్నేవారికే భూమి! అన్నవి కష్టజీవులైన రైతుల రణనినాదా లౌతాయి.

భారతదేశ గ్రామసీమలు కుములుతూన్న అగ్ని పర్వతాలు, అప్పుడప్పుడూ బ్రద్దలవడం జరుగుతున్నది. బెంగాలు

తెభాగా ఉద్యమమూ, నైజాం సంస్థానంలోని తెలంగాణా పోరాటమూ, బీహారు రైతుల 'బకాస్తు' పోరాటాలు, మలబారు, తమిళనాడుల రైతుల పోరాటాలూ అన్నీ రైతుస్థితి దుర్భరమైందని తెల్పుతున్నాయి.

ఇంకా సమీకరింపబడని యీపోరాటరంగా లన్నిటి నుంచీ వినవస్తున్నది ఒకే ఒకనినాదం – "భూస్వామ్యవిధానం నశించాలి! దున్నేవారికే భూమి!" బారులన్నీ వ్యవసాయ విప్లవం వేపుకే సాగిపోతున్నాయి.

## పరిశ్రమలు - యుద్ధం

రైతుల్లో బీదతనం వ్యాపించిపోవడం యుద్ధకాలంలో పరిశ్రమాభివృద్ధిపట్ల సామ్రాజ్యవాదులు అవలంబించిన వైఖరీ ఇప్పుడు పారిశ్రామిక సంక్షోభంయొక్క స్వభావాన్ని నిర్ణయిస్తాయి.

యుద్ధకాలంలో సామ్రాజ్యవాదులు తమ పాతధోరణినే అవలంబించారు. తమ స్వదేశ పరిశ్రమలలో పోటి ఏర్పడుతుందనే భయంవల్ల పారిశ్రామికాభివృద్ధి జరగనివ్వలేదు. అమెరికాలో ఉత్పత్తిసాధనాలు నూటికి 50 వంతులు, బ్రిటనులో నూటికి 25 వంతులు పెరిగాయి. కాని ఇండియాలో మాత్రం అలాంటిదేమీ జరగలేదు.

ఇదివరకున్న పాతయంత్రాల స్థానంలో కొత్తయంత్రాలనుకూడా సామ్రాజ్యవాదులు ఇండియాకు దిగుమతి కానివ్వలేదు. యుద్ధకాలంలో భారతదేశంలోకూడా ఉత్పత్తి అధికంగా జరగటానికి కారణం ఉత్పత్తిసాధనాలను పెంచడంవల్లకాదు. కార్మికులను షిఫ్టులపద్ధతిలో ఎక్కువపని చేయించ

డమే. అందువల్ల భారతప్రజాసామాన్యానికి కొత్త ఉద్యోగాల ఆశేమీ లేదు.

రైతుల స్థితి క్షీణించిపోవడంతో యుద్ధకాలంలోనే భారత పరిశ్రమలు దెబ్బతినిపోయేవి. యుద్ధకాలంలో పరిస్థితు లన్నీ అనుకూలంగావున్నా పారిశ్రామికోత్పత్తి తగ్గిపోతుండడం కూడా జరిగింది. యిది యుద్ధసమయం కాకుండా మరో సమ యం అయినట్లయితే పారిశ్రామికోత్పత్తి అసలు పూర్తిగా ఎగిరిపొయ్యేది.

యుద్ధకాలంలో ప్రభుత్వం ఆర్డరుయిచ్చినపనులు చేయ డంవల్లనే ఇండియాపరిశ్రమలు నిలబడగలిగాయి. 1939_40లో 28 కోట్లు 1939_40 కి 247 కోట్లు, ఒక్క 1944_45 సంవత్స రంలోనే 145 కోట్ల రూపాయల విలువగల ప్రభుత్వ ఆర్డర్లు వచ్చాయి.

1939 లో 540 లక్షల గజాలు, 1940 లో 2110 లక్షల గజాలు, 1941 లో 3720 లక్షలు, 1912 లో 8520 లక్షలు, 1943 లో 6010 లక్షలు, 1944 లో 8020 లక్షలు, 1945 లో 5750 లక్షల గజాలగుడ్డ మిలటరీ తీసుకుంది.

1939_40 లో మొత్తం తయారైన 17,33,000 టన్నుల సిమెంటులో 87,4000 టన్నులూ, 1940 లో తయారైన 17,27,000 టన్నుల సిమెంటులో 1,03,900 టన్నులు, మిల టరీ తీసుకొంది. అంటే 1940 లో మొత్తం తయారైన సిమెం టులో నూటికి 60 వంతులు, 1942 సిమెంటులో నూటికి 92 వంతులూ ఒక్క మిలటరీ కోసమే ఉపయోగించబడింది.

యుద్ధకాలంలో ప్రభుత్వమిచ్చిన ఈ ఆర్డర్లు పెట్టుబడి

దారులకు రెండువిధాల ఉపయోగపడ్డాయి, ఒకటి మార్కెటు కోసం ఎప్పటికప్పుడు వెతుక్కోకుండా ఒక నమ్మకమైన మార్కెటు లభించింది. యుద్ధావసర వస్తువులకోసమే పరిశ్రమలు ఎక్కువ పనిచేయడంవల్ల ప్రజాసామాన్యానికి అవసరమైన వస్తువుల్లో కొరతఏర్పడింది. ఈ కొరతను అవకాశంగా తీసుకొని ధరలు విపరీతంగాపెంచి తద్వారా పెట్టుబడిదారులు విపరీతలాభాలు గణించడానికి వీలుచిక్కింది.

పారిశ్రామిక వస్తువులధరలు – ఏదో ఒకటీ, రెండూ మినహా చక్కలకంటా పెరిగాయి.

బట్టలధర 1939–40 లో 100అయితే 1943–44లో 442కి 1946–47లో 462కి పెరిగింది.

బొగ్గుధర 1939–లో వందఅయితే 1943లో 174కి 1944లో 282కి 1945లో 304కి పెరిగింది.

ముడియినుము 1930లో వందఅయితే 1944లో కంట్రోలుధర ప్రకారమే 117 పెరిగింది, జనపనార 1939లో వందఉంటే 1943లో 238కి, 1944లో 270కి, 1945లో 251కి పెరిగింది.

మార్కెటు క్షీణించి పోతూవున్నపుడు, రైతులు చితికిపోతూ ఉన్నప్పుడూ, ఇంతంత విపరీత ధరలు పారిశ్రామిక వస్తువులకు రావడానికి అవకాశంలేదనే విషయం స్పష్టంగా బోధపడుతుంది.

ప్రజల కొనుగోలుశక్తికీ, పారిశ్రామిక వస్తువుల ధరలకీ మధ్య ఎంతో తేడాఏర్పడింది. అయినప్పటికీ ప్రభుత్వమిచ్చిన బ్రహ్మాండమైన ఆర్డర్లు ఒక స్థిరమైన మార్కెట్‌ను కలి

గించడంవల్ల పరిశ్రమలు కొనసాగాయి.

యుద్ధకాలంలో ఎక్కువధనాన్ని ఆర్జించిన వారివల్ల కూడా పరిశ్రమలు నిలబడగలిగాయి. వీరు సంఖ్యలో కొద్దిమందే అయినా వీరిలో కొనుగోలు శక్తివుంది. మిలటరీకి, ప్రభుత్వానికి పోను మిగిలిన వస్తువులను వీరు కొంటూ ఉండేవారు.

ప్రజాసామాన్యంలో పేదతనం వ్యాపిస్తున్నా తాత్కాలికంగా పెట్టుబడిదారులకు మార్కెట్టు సమస్యనూతిం పరిష్కారమయింది. కాని యుద్ధం సమాప్తికావడంలో ప్రభుత్వం ఆర్డర్లు తగ్గిపోవడంతో, పరిశ్రమలను మళ్ళీ మార్కెటు సమస్య ఎదుర్కొంది.

(1) కొత్తపరిశ్రమలు, ఫ్యాక్టరీలు స్థాపించబడటం లేదు. ఇందుకు సామ్రాజ్యవాదులవలంబించిన పాలసీయే ప్రత్యక్షకారణం, ఒడంబడిక కుదిరిందాకా సామ్రాజ్యవాదులు ఇండియాకు పెట్టుబడి వస్తువుల్ని (యంత్రసామగ్రి) పంప నిరాకరించారు. భారతదేశం ఒక వలసదేశమై ఉండటంవల్లనే సామ్రాజ్యవాదు లీవిధానం అవలంబించారు. (2) ప్రత్యక్షంగానో, పరోక్షంగానో యీ వస్తువులు ప్రజలవద్దకు వచ్చినా పరిశ్రమలు బీదప్రజాసామాన్యానికి వ్యతిరేకంగానే ఉపయోగిస్తాయి. ప్రజల కొనుగోలుశక్తి పూర్తిగా క్షీణించిపోవడంగానీ, లేక బొత్తిగా లోపించిపోవడంగానీ జరిగింది. అందువల్ల పరిశ్రమలు తయారుచేసే వస్తువుల్ని ప్రజలు కొనేస్థితిలో లేరు.

యుద్ధకాలంలో ధనికులూ మధ్యతరగతిలో పైవారు వగైరా కొద్దిమంది మాత్రమే కొనుగోలుదార్లుగా ఉండే

వారు. కాని ఇప్పు డాకొద్దిమందితోనే పని గడవదు. పరిశ్రమలు తయారుచేసిన ఉత్పత్తినంతా ఇప్పుడు ప్రజలకే (ఇదివరకు మిలటరీ తీసుకొనే పెద్దమొత్తాన్నికూడా) అమ్మకోవలసివుంది.

పెట్టుబడిదార్ల చేతుల్లో పోగుబడ్డ బ్రహ్మాండమైన పెట్టుబడే వారి మార్కెట్టును ధ్వంసంచేసింది. యుద్ధకాలంలో జరిగిన దోపిడీ, నోట్లముమ్మరంవల్ల సామ్రాజ్యవాదులూ, భారత పెట్టుబడిదార్లూ ప్రజల్ని పీల్చేశారు. అందువల్ల మార్కెటు ధ్వంసమైపోయింది. పెట్టుబడిదార్లు, తమ పరిశ్రమలు సాగాలంటే ముందు యీ వైరుధ్యాన్ని - యీచిక్కును తొలగించుకోవాలి.

కాని యుద్ధసమాప్తి మార్కెటుసమస్యను మరీ తీవ్రతరం చేసింది. ఒక్క రైతాంగంలోనే కాకుండా తదితర ప్రజల్లోకూడా కొనుగోలు శక్తి లేకుండా చేసింది. ప్రభుత్వ శాఖల్లోని గుమాస్తాలూ, యుద్ధకాలంలో ప్రత్యేకంగా చేర్చుకోబడిన ఉద్యోగులూ, సైనిక శాఖలోనూ, తదితర రక్షణ శాఖల్లోనూ వున్నసైనికులూ, ఆర్డినెన్సు (మందుసామాన్లు) ఫ్యాక్టరీల్లో, రవాణా, రైల్వే, డాక్, వగైరా శాఖల్లో పనిచేసే గుమాస్తాలూ, కార్మికులూ, యుద్ధకాలంలో కొంతకొనుగోలు శక్తి కలిగివుండేవారు. కాని యిప్పుడు వీరంతా ఉద్యోగాల నుండి తొలగించబడటం మార్కెటు సమస్యను యింకా తీవ్రతరం చేసింది.

దాదాపు అయిదులక్షలమంది సైనికులూ, వివిధశాఖల్లో పనిచేస్తున్న వేలకొలది ఉద్యోగులూ నిరుద్యోగు

లయ్యారని ఇదివరకే చెప్పడమయినది.

ఇందువల్ల మనకేం బోధపడుతుంది? ఇదివరకు జరుగుతూన్నంత ఉత్పత్తినైనా ఇప్పుడు కొనగలిగిన మార్కెట్టు లేదు. వస్తువులు అమ్మకం కాకుండా మిగిలిపోతాయి. అందువల్ల ఉత్పత్తి తగ్గిపోతుంది. యీ ఉత్పత్తి తగ్గుదల ఫ్యాక్టరీలను మూసివేయడానికి దారితీస్తుంది. కార్మికులు నిరుద్యోగులౌతారు. జీతాలు వగైరా తగ్గిపోతాయి. అందువల్ల ప్రజల కొనుగోలు శక్తి ఇంకా పడిపోతుంది. మార్కెట్టు మరీ స్వల్పమై సంకుచితమై పోతుంది.

యుద్ధం తీవ్రంగా జరుగుతూన్న సమయంలోనే పారిశ్రామిక ఉత్పత్తి తగ్గిపోసాగింది. 1939 లో బొగ్గు ఉత్పత్తి 270 లక్షల టన్నులుంటే 1942 లో 290 లక్షల టన్నులకు పెరిగింది. కాని తర్వాత 1943 లో 250 లక్షలు, 1944 లో 260 లక్షల టన్నులుమాత్రం వుంది. 1945 కి కూడా 1942 స్థాయికి రాలేకపోయింది.

ముడియినుము 1941 లో 20 లక్షల టన్నులనుండి 1945 కి 14 లక్షల టన్నులకు తగ్గిపోయింది. 1939-40 ఉత్పత్తితో నూటికి 20 వంతుల తగ్గుదల ఏర్పడిందన్నమాట. జనపనార 1941 లో 12 లక్షల టన్నులనుంచి 1943 లో 19 లక్షలకూ 1945 లో 11 లక్షలకూ తగ్గింది. బట్టల ఉత్పత్తి 1939-40 లో 40120 లక్షల గజాలు అయితే 1943-44 లో 48710 గజాలకు పెరిగింది. స్టాండర్డుక్లాత్ అనే పేరుతో తయారుచేసిన బూటకపు గుడ్డఫలితంగా ఈ పెరుగుదల ఏర్పడింది. 1945-46లో 46760 లక్షల గజాలకు తగ్గింది. ఇప్పుడు

బట్టల ఉత్పత్తి దాదాపు యుద్ధానికిపూర్వం జరిగినంతే జరుగుతూవుందని తెలుస్తోంది. ఈ తగ్గుదలకు మరో రెండు కారణాలు కూడా వున్నాయి. ఒకటి కొత్తయంత్రాలు లేక పాతయంత్రాలనే వాడడం, బ్లాక్‌మార్కెట్టులో అధికధరల కమ్ముకోవడంకోసం సరియైన అంకెలు బైటపెట్టకుండా తగ్గించి చెప్పటం- ఏమయినా మొత్తంమీద ఉత్పత్తి కొంత తగ్గిపోయినమాట వాస్తవం. అందువల్లనే ఈ సంవత్సరాల్లో ఫ్యాక్టరీలు మూసివేయడమూ, లక్షలకొలదీ పనిరోజులు నష్టపడడమూ జరిగింది.

యజమానులు కార్మికుల డిమాండ్సు అంగీకరించక పోవడంవల్ల 1945-46లోనూ 1946-47లోనూ సమ్మెల వెల్లువ విజృంభించింది. భారాన్నిఅంతా కార్మికులపై తోసివేయాలి అని యజమానులు ప్రయత్నించారు. కార్మికుల జీతాల్లో కోతలుకోసి ఉత్పత్తికయ్యేఖర్చుల్ని తగ్గించుకొని తమ మార్కెట్టును విస్తృతం చేసుకోవాలని ప్రయత్నించారు.

ప్రస్తుతమున్న ధరలు యిలాగే వుంటే క్రమక్రమంగా మార్కెట్టు పడిపోతుందని పెట్టుబడిదారులు గుర్తించారు. ఇదివరకులాగానే అధిక లాభాలను రాబట్టుకునేందుకు ముందు కార్మికుల ఆదాయంపైనే దాడిచేశారు. ఫ్యాక్టరీలను మూసివేశారు. యీ మూసివేతలవల్లనే ఉత్పత్తి తగ్గిపోతూవుంది. పడిపోతున్న మార్కెట్టును నిలబెట్టుకోడానికి ఉత్పత్తిని తగ్గించడం పెట్టుబడుదారు లవలంబించే విధానంలో భాగమే.

ఒకవైపు దేశంలో వస్తువులకొరత ఏర్పడివుండగా మరోవైపు ఉత్పత్తి తగ్గిపోతూ వుండడంలో వైపరీత్యమేమిటో

బాగా అర్థంచేసుకోవాలి.

ప్రజల్లో అసలే కొనుగోలుశక్తి లేకుండాఉన్న సమయంలో ఎక్కువ ధరలుపెట్టి యీనాడు పారిశ్రామిక వస్తువులు కొనడం అసాధ్యమైన విషయం. ప్రభుత్వ ఆర్డర్లు రద్దయిపోవడంవల్ల సరకులు కుప్పలు తిప్పలుగా మార్కెట్టులోకి వస్తున్నాయి. ప్రజల అవసరాలనుబట్టిచూస్తే ఆ వస్తువులు చాలినన్ని లేవన్నమాట వాస్తవమేకాని, వాటి ధరలను (బజారు ధరలూ, బ్లాక్‌మార్కెటు ధరలూ) బట్టి చూస్తే అవి సామాన్యప్రజల కందుబాటులో లేకుండా పోయాయి.

వస్తువులు అమ్మకంకాకుండా మార్కెటులో మిగిలిపోతున్నాయి కాబట్టీ, కార్మికులు ఉద్యోగాలనుండి తొలగించబడుతున్నారు కాబట్టీ, వస్తువులు ప్రజల అవసరాలకు మించి విరివిగా ఉత్పత్తి చేయబడుతున్నాయి అని సామాన్యంగా అనుకుంటారు. నోట్లముమ్మరం యింకా చలామణీలోఉంది కాబట్టీ, చాలామందిలో కొద్దిగా కొనుగోలుశక్తి మిగిలివుంది కాబట్టీ, వస్తువులు మార్కెటులో విరివిగా దొరకడంలేదనీ, ప్రజల్లో కావలసినంత కొనుగోలుశక్తి వుందనీ కొందరు భ్రమపడుతున్నారు.

నిజానికి నోట్లముమ్మరంద్వారా ఏర్పడిన దారిద్ర్యానికి తలక్రిందురూపమే ఈనాడున్న వస్తువులకొరత. యుద్ధకాలంలో కోట్లరూపాయల విలువగల వస్తువులు నోట్లముమ్మరంవల్ల దోచుకోబడ్డాయి. యీదోపిడీ ఫలితంగా జాతీయాదాయం భారతదేశ వివిధతరగతుల్లో పునర్విభజింపబడింది. ధనికులు యింకా పెద్దధనికులుగానూ, పేదలుయింకా నిరుపేదలుగానూ

తయారయ్యారు.

ఇందువల్ల పెట్టుబడిదార్ల చేతుల్లో విపరీతంగా ధనం ప్రోగుపడడం కాకుండా పెద్ద పెద్ద ఉద్యోగులూ, మధ్యతరగతిలో పైభాగానికి చెందినవారుకూడా పెద్ద ధనికులుగా మారారు. కాని ప్రజాసామాన్యం మాత్రం ఇంకా గర్భదరిద్రులుగా మారారు. కొనుగోలుశక్తి బాగా తగ్గిపోయింది.

ఈ ప్రజాసామాన్యమే తమకు కావలసిన వస్తువులను ఇప్పటి హెచ్చుధరలకు కొనుక్కోలేక బాధపడుతున్నారు. కాని పైవారుమాత్రం బ్లాక్‌మార్కెట్టులోనూ, బహిరంగంగానూ ఇప్పుడు వస్తువులను కొంటున్నవారు వీరే. ఇందువల్ల డబ్బుకొల్లలుగా ఉందనీ, కొనుగోలుశక్తి అంతులేకుండా ఉందనీ భ్రమలు కల్గుతున్నవి.

చట్టావ్యాపారం (స్పెక్యులేషన్) చేయడానికీ, బ్లాక్ మార్కెట్టు చేయడానికి వర్తకులు పెద్ద పెద్ద మొత్తాలను విరివిగా కాజేస్తున్నారు. చౌకడబ్బుతో కొనేసిన వీటిని మళ్ళీ త్వరలోనే అమ్ముకొని బజారుసరుకులను కొంటున్నారు. బజారు సరుకుల ధరలు రోజురోజుకూ పెరిగి పోతున్నాయి. కాబట్టి, వాటిద్వారా ఎక్కువ లాభాలు సంపాదించాలని యీవర్తకుల ఉద్దేశ్యం. యీసరకుల్లో కొన్నిటిని అమ్ముకున్నా బ్లాక్‌మార్కెట్టుధరలవల్ల వాళ్ళకు మంచిలాభాలువస్తున్నాయి. బ్లాక్ మార్కెట్టులో కావలసినన్ని వస్తువులు దిగుబడివున్నప్పటికీ దొంగవ్యాపారం సాగిపోతూనే వుందన్న విషయం నేడు ప్రతివారికీ తెలిసిందే; కాని ఇప్పటిధరలు ఇలానేవుండిపోతే బ్లాక్‌మార్కెటుఅంతా సరకులతో నిండిపోవడం, ఇకముందు సరుకుల్ని

విడుదలచేయడం అసాధ్యమయ్యే పరిస్థితులేర్పడుతాయి. సరకులు తక్కువగా వున్నాయి అనే ఉద్దేశ్యంతో కొనగలిగిన వారు నేడు వస్తువులకోసం ఎగబడుతున్నారు. కాని అసలు విషయం నేడు వస్తువులకు కొరతలేదు. ఇప్పటి హెచ్చుధరలకు కావలసినన్ని వస్తువులున్నాయి కాబట్టి మార్కెటు సరకులతో నిండిపోయి వున్నదన్న రహస్యం బయట బడినప్పుడు వాటిని విడుదలచేయడం అసంభవమైపోతుంది.

నోట్లముమ్మరం, దానివల్లకలిగే స్పెక్యులేషనూ (చట్టావ్యాపారం) ఈ రెండూ సంక్షోభంయొక్క నిజస్వభావాన్ని మరుగపరుస్తాయి. కాని ఉత్పత్తి తగ్గిపోవడంవల్ల సంక్షోభం వస్తున్నదనీ దాని స్వభావం ఫలానా అనీ హెచ్చరికచేసినట్లయింది.

ప్రభుత్వం కంట్రోలును తొలగించింది అంటే ఇందుకు కారణం బ్లాక్ మార్కెటు బాగా సరకులతో నిండిపోయింది అనీ, బ్లాక్ మార్కెటు ధరలప్రకారం వస్తువులన్నింటినీ అమ్మడం ఇక సాధ్యంకాదనీ బూర్జువావర్గం గ్రహించిందన్న మాట.

మార్కెటును విస్తృతం చేసుకోడానికి కంట్రోళ్ల తొలగింపు ఒక సాధన. ఇందువల్ల ధరలు బ్లాక్ మార్కెటు ధరలకంటే తగ్గుతాయి. కాని కంట్రోలు ధరలకంటే పెరుగుతాయి. కంట్రోలు తొలగించడంవల్ల కొనుగోలుశక్తి కలిగిన వారందరకూ వస్తువులు అందుబాటులో వుంటాయి కాని కొనుగోలు శక్తిలేని ప్రజాసామాన్యంమాత్రం ఎప్పుడూ ఆ వస్తువులకు దూరంగానే వుండిపోతుంది. పై తరగతులవారికి యథే

చ్ఛగా కావలసినన్ని వస్తువుల్ని అడ్డంకిలేకుండా అమ్ముకో డానికి కంట్రోళ్ళ తొలగింపు ఒక సాధనంగా ఉపయోగపడు తుంది.

ఈ విధంగా పెట్టుబడిదారుల అధికలాభాసక్తి అడుగడు గునా సంక్షోభాన్ని ఇంకా తీవ్రతరం చేస్తుంది. ఎక్కువ లాభాల్ని రాబట్టుకోడంకోసం పెట్టుబడిదార్లు సరకుల ధర లను తగ్గనివ్వరు. అందువల్ల ప్రజల కొనుగోలుశక్తికీ, ఈ హెచ్చుధరలకూ ఎక్కడా లంగరు అందదు. హెచ్చుధరలను పెట్టి ప్రజలు కొనలేక పోవడంవల్ల సరకులు అమ్మకం కాకుండా నిలిచిపోతాయి. అధికలాభాపేక్షగల పెట్టుబడి దారులు ఈ లాభాన్ని కార్మికులనెత్తిపై రుద్దుతారు, యిక్కడి ప్రజలు సరుకుల్ని కొనలేరు. కాబట్టి పెట్టుబడిదారులు లాభ సాటి అయిన కొత్తమార్కెట్టుకోసం ప్రయత్నిస్తారు. వీటి అన్నిటి ఫలితంగా వుత్పత్తి బాగా దెబ్బతినిపోతుంది.

యుద్ధకాలంలో సామ్రాజ్యవాదులు సాగించిన దోపిడి ఫలితంగానూ, పారిశ్రామికాభివృద్ధిని సామ్రాజ్యవాదులు అరి కట్టడంవల్లనూ, నోట్లముమ్మరం వల్ల జాతీయాదాయంలో పున ర్విభజన జరగడంవల్లనూ, లాభాలకోసం పెట్టుబడిదారులు సాగించిన దాడిఫలితంగానూ, భారతదేశ వ్యవసాయం వలస దేశ విధానంపై ఆధారపడి ఉండడంచేతనూ, ఈసంక్షోభం బయలు దేరింది.

ఈసంక్షోభాన్ని పెట్టుబడిదారులూ, జాతీయప్రభు త్వమూ ఏవిధంగా పరిష్కరించ పూనుకుంటున్నారు? ఉత్పత్తి తగ్గిపోకుండా ఉండటానికి వారు వేసేప్లాను లేమిటి?

వారు వేసే ప్లానులన్నీ వలసదేశ ఆర్థిక విధానంయొక్క సామ్రాజ్యవాద ఆర్థిక విధానంయొక్క సుడిగుండంలోనే తిరుగుతూ వుంటాయి.

ఇండియా పెట్టుబడిదార్లకూ, జాతీయ ప్రభుత్వానికీ ప్రజాసామాన్యం అన్నా, ప్రజాఉద్యమం అన్నా తలకొప్పి, భయం. పెట్టుబడిదార్ల ఆస్థిపై చేయివేయడానికి వారికి అంత కంటే హడలు. పరిశ్రమలను సంఘపరం చేయాలిఅనే నినాదం వాళ్లు అసలు అంగీకరించరు. పురాతన జమీందారీ భూస్వామ్యవిధానంయొక్క సంకెళ్ళనుంచి ప్రజాసామాన్యాన్ని విముక్తుల్నిజేసి వారి బీదతనం తగ్గించడానికి ఏమాత్రమూ కృషిచేయరు.

జమీందారీ, భూస్వామ్యవిధానాన్ని రద్దుచేయడం వల్ల ప్రజల్లో కొనుగోలుశక్తి పెరుగుతుంది. అందువల్ల పెట్టుబడిదార్లకు చక్కని మార్కెటు లభిస్తుంది. కాని జమీందారీ భూస్వామ్యవిధానాన్ని రద్దుచేయడం సాంఘికవిప్లవానికి దారి తీస్తుందని, జమీందారులతోపాటు పెట్టుబడిదారీవర్గాన్నికూడా కూలద్రోసి జాతీయార్థికవిధానా న్నంతటనీ ప్రజాసామాన్యం తన చేతిలోకే లాక్కుంటుందేమో అనీ పెట్టుబడిదారులు భయపడుతున్నారు.

అందువల్లనే పెట్టుబడిదారీవర్గం రాజకీయంగా, ఆర్థికంగా సామ్రాజ్యవాదులతోనూ, జమీందారీ, భూస్వామ్య వర్గాలతోనూ రాజీపడుతోంది.

కాంగ్రెసుప్రభుత్వాలు ప్రవేశపెట్టే జమీందారీ బిల్లులు జమీందార్, భూస్వామ్యవిధానాలను పూర్తిగా రద్దు

చేయడం కాకుండా ఏదో ఒక రూపంలో వాటిని నిలబెట్ట టానికే ఉపయోగిస్తాయి. జమీందారీ, భూస్వామ్య ఆర్థిక విధానంతో ఈవిధంగా ముడిపెట్టుకోవడంవల్ల అధిక సంఖ్యాకంగా ఉన్న రైతాంగంలో తమమార్కెట్టు విస్తృతం కాకుండా తామే అరికట్టుకుంటున్నారు. కాంగ్రెసుమంత్రులు తెచ్చే వ్యవసాయిక చట్టాలవల్ల నష్టపరిహారం చెల్లించుకోవలసి రావడం, దున్నేవారికే భూమిలభించకపోవడం, జరుగుతుంది. ఈబిల్లులవల్ల ధనికరైతువర్గానికి మాత్రం కొద్దీ, గొప్ప లాభాలు కలిగితే కలగవచ్చు. కాని భూసంబంధాల్లో ముఖ్యమైన మార్పులేమీరావు. రైతాంగంలో పేదరికం రోజు రోజుకూ పెరుగుతూనే వుంటుంది.

ఇలాంటి అనుకూల పరిస్థితుల్లో రైతాంగంలో పైతరగతికి చెందినవారికి మాత్రం కొన్నిసౌకర్యాలు లభిస్తాయి. వీరిలో కొనగోలుశక్తి పెరుగుతుంది. వీటిని అవకాశంగా తీసుకొని ఈవర్గం పేదరైతుల భూముల్ని తమచేతుల్లోకి లాక్కుంటుంది. జమీందారుల, పెద్దభూస్వాముల ఆస్తుల్లో ఒకవేళ ప్రభుత్వం కొద్దీ గొప్ప జోక్యం కలిగించుకున్నా అంతకు క్రిందమెట్టులోనూ, సంఖ్యలో అంతకంటే కొంచెం హెచ్చుగానూ ఉన్నవారికి సహాయం చేయడానికి మాత్రమే అది ఉపయోగపడుతుంది కాని బహుళసంఖ్యాకమైన రైతాంగానికి అందువల్ల లాభించేదేమీ ఉండదు.

నీటిపారుదలసౌకర్యాలద్వారా, ఎరువులద్వారా, విద్యుచ్ఛక్తి సరఫరాద్వారా, వ్యవసాయాన్ని కాపాడాలనీ, కొత్తభూముల్ని సాగులోకి తేవాలనీ ప్రభుత్వం ఆలోచి

స్థావుంది. ఎన్ని ఆలోచనలు జరిగినా భూస్వామ్యయుగం నాటి భూసంబంధాలతోనే జరపాలి. సామ్రాజ్యవాదులు కూడా ఇలాంటి ఆలోచనలే చేస్తుండేవారు. భూసంబంధాలలో మార్పు తీసుకొనిరాకుండా వ్యవసాయంలో అద్భుతమైన అభివృద్ధి తీసుకురావాలని వీరి ఆలోచనలు.

భూస్వామ్యయుగసంబంధాలతోనే మధ్యతరగతిని సంపత్సమృద్ధంగా చేయాలని వేసే ప్లానులన్నీ గాలిలో ఎగిరి పోతాయి.

సామ్రాజ్యవాదులతోనూ, జమీందారీవర్గంతోనూ భారతపెట్టుబడిదారులు రాజీధోరణి అవలంబించడంవల్ల వ్యవసాయంలో విప్లవం తీసుకొనిరావడాన్ని వారు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఇందువల్ల రైతుల జీవితస్థాయిని పెంచడంలోనూ ఉత్పత్తిని అభివృద్ధిచేయడంలోనూ, తమ దివాలాకోరుతనాన్ని వెల్లడించుకున్నారు. బహుళసంఖ్యాకంగాఉన్న రైతాంగాన్ని కొనుగోలుదార్లుగా తయారుచేసుకోలేక పోవడం చేత వారు పరిశ్రమల్నికూడా అభివృద్ధిచేయలేక పోతున్నారు. అందువల్లనే భారతదేశంయొక్క వలసదేశ స్వభావాన్ని మార్చివేయగల నిజమైన పారిశ్రామికాభివృద్ధి ఏమీ జరగలేదు. సామ్రాజ్యవాదులతోనూ, జమీందారీ వర్గంతోనూ, పెట్టుబడిదార్లు కలసిపోవడంవల్ల పెట్టుబడిదారీ విధానాన్ని అభివృద్ధి చేయాలని చేసే ప్రతిప్రయత్నమూ దెబ్బ తినిపోతోంది. మార్కెట్టు పడిపోతోంది. మార్కెట్టు పడి పోవడంవల్ల పారిశ్రామికాభివృద్ధి ఆగిపోతోంది.

యుద్ధానంతరం ఏర్పడ్డ సంక్షోభాన్నుంచి బైటపడేం

దుకు పెట్టుబడిదార్లకూ జాతీయ ప్రభుత్వానికీ తగిన ప్రణాళిక ఏమీ లేదు. నిర్బంధవిధానం మినహా వారవలంబించే విధానం ఏమీ లేదు. నిత్యదారిద్ర్యంతో కుంగిపోయే అసంఖ్యాక రైతాంగానికి జమీందారీవర్గ దౌర్జన్యం మినహా వారుయిచ్చే దేమీ లేదు. సామ్రాజ్యవాదులతో కలిసి భాగస్వాములుగా తయారైన భారత పెట్టుబడిదార్లు వ్యవసాయంలో సామ్రాజ్యవాదులు అనుసరించిన పాతపంథానే భూస్వామ్య యుగంనాటి భూసంబంధాలనే కొనసాగించ పూనుకున్నారు.

వ్యవసాయ విప్లవభయం రాజకీయంగా విప్లవము వల్ల వస్తుంది. కాబట్టి పెట్టుబడిదారీవర్గం నేటి సంక్షోభాన్ని సామ్రాజ్యవాద వలసదేశవిధానపద్ధతులపైనే పరిష్కరించాలని ప్రయత్నిస్తున్నారు. కాని భూస్వామ్యయుగ సంబంధాలను కొనసాగించడానికీ, పరిశ్రమలను అభివృద్ధిచేయడానికీ మధ్యనున్న పరస్పర వైరుధ్యంవల్ల ఈ సంక్షోభం ఆవిధంగా ఎప్పుడూ పరిష్కారం కాదు. ప్రభుత్వం నేడు అవలంబిస్తూన్న విధానం వల్ల పారిశ్రామికాభివృద్ధి జరగకపోగా ఈనాడు జరుగుతూన్న ఉత్పత్తిస్థాయిని కూడా నిలబెట్టడం అసాధ్యమై పోతుంది.

అయితే యిక ఈ పారిశ్రామికసంక్షోభాన్ని భారత ప్రభుత్వమూ, భారతపెట్టుబడిదార్లూ ఎలా పరిష్కరిస్తారు? కార్మికుల వేతనాలను బాగా తగ్గించివేయడం, కార్మికులపై సర్వతోముఖంగా దాడి సాగించడం, తొమ్మిది గంటలు పని చేయించడం, సౌకర్యాలన్నీ ఎత్తివేయడం, కార్మికవర్గవేతన పరిమాణాన్ని తగ్గించివేయడం, కొద్దిమందితో ఎక్కువ పని

చేయించడం, సాధ్యమైనంత మందిని ఉద్యోగాలనుండి తొలగించడం — వీటిద్వారా కార్మికులను పీల్చి వారిని గోచి పాతరాయుళ్ళుగా తయారుచేసి ఉత్పత్తిని తక్కువ ఖర్చులో తయారుచేసి పేద ప్రజాసామాన్యం కొనుక్కోడానికి అందుబాటులో వుండేటట్టు చేయాలని వారి తాపత్రయం. కాని ఇందువల్ల కార్మికుల కొనుగోలుశక్తి మరీ తగ్గిపోవడంవల్ల సంక్షోభం మరింత తీవ్రతరమౌతూంది.

ఈ సంక్షోభాన్నుంచి బైటపడేందుకు పెట్టుబడిదారీ వర్గం సూచించే పరిష్కారంయొక్క ఫలితాలు రైతులకు నిత్యదారిద్ర్యం, కార్మికులకు నిష్పచ్చరం, మధ్యతరగతికి దుర్భరావస్థ వీటన్నిటికీ ఫలితం ఉత్పత్తి సర్వతోముఖంగా అన్నిరంగాల్లో తగ్గిపోవడం.

ఉత్పత్తి తగ్గిపోతుందని పెట్టుబడిదారీవర్గం బిగ్గరగా కేకలు వేస్తూంది. దీనికంతటికీ కారణం కార్మికవర్గమే అని కార్మికులపై దుమ్మెత్తి పోస్తూంది. జీతాలకోత వగైరా అన్నింటికీ సహించి కార్మికవర్గం పిల్లిలాగా తలవంచాలని పెట్టుబడిదార్ల ఉద్దేశ్యం. కార్మికవర్గాన్ని బలిచేసి తద్వారా తమలాభాలకు దెబ్బతగలకుండా చూచుకోవాలనీ, మార్కెట్లు సంపాదించుకోవాలనీ వాళ్ళకోరిక. పెట్టుబడిదార్ల ఈకోరికను సాధించిపెట్టడానికే జాతీయప్రభుత్వమూ, కాంగ్రెసు మంత్రివర్గాలూ సమ్మెనిరోధక చట్టాలు ప్యాసుచేస్తున్నాయి. పెట్టుబడిదార్లు సాగించేదాడికి తోడ్పడడానికే కార్మిక ప్రతిఘటనను అణచివేస్తున్నాయి.

'రోజుకు 8 గంటలపని' పైజాతీయప్రభుత్వం, పెట్టు

బడిదార్లూ దాడి సాగించబోతున్నారు. అదనపుకూలి యివ్వకుండానే కార్మికులచేత రోజుకు తొమ్మిదిగంటల పని చేయించి కార్మికుల ఒక గంట శ్రమశక్తి ఉచితంగా హరించివేయాలనీ, తద్వారా సరకుల ధర కొంతతగ్గించి సరకు లన్నిటినీ అమ్ముకొనడంద్వారా ఎక్కువలాభాలు సంపాదించాలనీ వాళ్ళ ప్రయత్నం.

కొద్దిమందిచేత ఎక్కువపనిచేయించి లాభాలు పొందాలని పెట్టుబడిదార్లు ప్రయత్నిస్తున్నారు. ఈ విధంగా పెట్టుబడి దార్లు కార్మికవర్గంపై సాగించిన దాడికి (దక్షిణ భారతదేశం లోని టెక్స్టైల్ కార్మికులపై దాడి) జాతీయప్రభుత్వం తోడ్పడుతూవుంది. పెట్టుబడిదార్లు వేలకొలదిమంది కార్మికులను ఉద్యోగాలనుంచి తొలగిస్తున్నారు. కార్మికులను తమ యిష్టంవచ్చినట్టు బానిసలుగా ఉపయోగించుకోవాలనీ, నేటి సంక్షోభాన్నంతా కార్మికులపైమోపి తాము హాయిగా తప్పుకోవాలనీ చూస్తున్నారు, పెట్టుబడిదార్లు. జాతీయప్రభుత్వం వారికి తోడ్పడుతున్నది.

కాని యిందువల్ల సమస్య పరిష్కారం కాకపోగా మరింత తీవ్రతరమౌతుంది. ప్రజల కొనుగోలుశక్తి ఇంకా తగ్గిపోతుంది.

పెట్టుబడిదారులకు ఇంతకంటే మరో గత్యంతరం లేదు కాబట్టి తప్పకుండా కార్మికులకు జీతాలలో కోతలుకోయడం, వుత్పత్తిని కొనసాగించడానికి కార్మికులను అణచివేయడం, రైతుల్నికూడా బానిససంకెళ్ళతోనే బంధించివుంచడం జరుగుతుంది.

భారతదేశంలోని ప్రజాసామాన్యం తమ సరకుల్ని కొనలేదు కాబట్టి పెట్టుబడిదారులు సహజంగా విదేశమార్కెట్లు వేపుచూస్తారు. ఈనాడు అదనంగా మిగిలిపోయివున్న సరకులను విడుదలచేయడంకోసం, ముమ్ముందు యింకా ఎక్కువగా పరిశ్రమలను నిర్మించి వాటిచే తయారయ్యే వస్తువలన్నిటినీ ఎగుమతి చేయడంకోసం, విదేశమార్కెట్టులవేపు యింకా ఎక్కువగా అర్రులుచాచడం జరుగుతుంది.

ఇండియామార్కెట్టు పడిపోవడంవల్ల, ఇండియా పెట్టుబడిదార్లు విదేశమార్కెట్టులమీద ఆధారపడవలసి వస్తుంది. అమెరికా, బ్రిటనుల మెహర్బానీ ఉంటేనేకాని యిది సాధ్యం కాదు. పెట్టుబడిదారుల అధికలాభాపేక్షకు బలియై యిక్కడ ప్రజాసామాన్యం నిరుపేదగా తయారయింది. కాబట్టి ఇక్కడ ఇక లాభాలు గుంజడం కష్టతరమౌతుంది. అందువల్ల ప్రపంచంమీద ఎగబడక తప్పదు.

దీనినుంచి రెండుఫలితాలు కలుగుతాయి;

(1) విదేశమార్కెట్లలో ఇండియా పరిశ్రమలు పోటీకి తట్టుకోడంకోసం పెట్టుబడిదారులు కార్మికవర్గంపై సాగించే దాడిని ఇంకా తీవ్రతరం చేసారు.

(2) విదేశమార్కెట్టులో భారతపెట్టుబడిదార్లకు భాగం యిచ్చినందుకుగాను ఇండియా ప్రజలను సమిష్టిగా కలిసి దోచుకోవడానికీ, పెట్టుబడివస్తువులను సప్లయి చేసినందుకూ, ఎగుమతి సౌకర్యాలు కలిగించినందుకూ, విదేశ పెట్టుబడిదారులు కూడా ఇండియా పెట్టుబడిదారులతో కలసి సమిష్టిగా ఇండియాలో పెట్టుబడి పెట్టడానికి, భారత పెట్టుబడిదారులు విదేశ

పెట్టుబడిదారులతో ఒడంబడికలు కుదుర్చుకొంటారు. తత్ఫలితంగా పరిశ్రమలను సంఘటింపరం చేయకుండా ఉండడం, కార్మికవర్గాన్ని అణచివేయడం జరుగుతుంది. సామ్రాజ్యవాదులతో పొత్తు కుదరడంవల్ల బ్రిటన్, అమెరికా సామ్రాజ్యవాదులు అంగీకరించినంతవరకే భారతదేశంలో పారిశ్రామికాభివృద్ధి జరుగుతుంది. మొత్తంమీద వెనుకటిలాగే వలసదశ విధానమే అమల్లోవుంటుంది. దారిద్ర్య నిర్మూలనం, సౌఖ్యమయ జీవితం, ప్రణాళికలూ వగైరా అన్నీ వట్టి వాగాడంబరమే. పెట్టుబడిదారులు అవలంబించిన ఈవిధానం ఫలితంగా కాగితాలమీద వేసే ప్లానులన్నీ వట్టి సిరాదండుగగానే వుండిపోతాయి.

కాబట్టే యిప్పుడు జాతీయప్రభుత్వం ప్రణాళికలను గురించిన ఊసే ఎత్తుకోవడంలేదు. యిటీవల జరిగిన పారిశ్రామిక సభలో పరిశ్రమలు ఐదు సంవత్సరాలవరకూ ప్రభుత్వపరం చేయడంజరగదని జాతీయప్రభుత్వం పెట్టుబడిదార్లకు హామీ యిచ్చింది. సమ్మెనిరోధక చట్టాలను ప్యాసుచేస్తూవుంది. సంక్షోభంయొక్క భారాన్ని అంతా పెట్టుబడిదారులు కార్మికవర్గంపై రుద్దడానికి అనుమతించింది. పెట్టుబడిదారులకు అధికలాభాలు కట్టిపెట్టడానికే కంట్రోళ్లను తొలగించింది. భారత పరిశ్రమలలో తయారయిన వస్తువుల్ని విదేశాలకు ఎగుమతి చేయడానికి పెట్టుబడిదార్లు అంగీకరించిన షరతులనుబట్టి చూస్తే యీఎగుమతులద్వారా సంక్షోభం పరిష్కారం కాకపోగా ఇంకాతీవ్రతరమౌతుంది. బ్రిటన్, అమెరికాతో ఇండియాపొత్తుకలపిన ఫలితంగా ప్రజలు నిరుపేదలుగాతయారు కావటమే కాకుండా భారతపరిశ్రమలు, వ్యవసాయం రెండూ పూర్తిగా నలిగిపోతాయి.

కాబట్టి పెట్టుబడిదారు లనుసరించే ఈదౌర్భాగ్య విధానాన్ని కార్మికులూ, రైతులూ, విద్యార్థులూ, మధ్యతరగతి ప్రజలూ అందరూ తీవ్రంగా ఎదుర్కోవలసి వుంటుంది.

పెట్టుబడిదారు లనుసరించే ఈవిధానఫలితంగా, భూసంబంధాల్లో భూస్వామ్యపద్ధతి, కార్మికుల జీతాలకోత, పనిచేసే గంటల్ని పెంచడం, వస్తువుల్ని అధికధరలకమ్మడం, కంట్రోళ్ళను తొలగించడం, హద్దూపద్దులేని అధికలాభాలను గుంజడం, పరిశ్రమలను సంఘపరంచేయకుండా అట్టిపెట్టడం, కార్మికోద్యమాలపైన సమ్మెలపైనదాడిచేయడం, కార్మికుల్ని రైతుల్ని అణచివేయడం, అనేకమందిని నిరుద్యోగానికి గురిచేయడం, కొద్దిమందిచేత ఎక్కువ పని చేయించడం జరుగుతుంది.

ఇందుకు బదులుగా ప్రజలు సూచించే పరిష్కారం వల్ల జమీందారీ భూస్వామ్యవిధానాలు రద్దుకావడం, దున్నేవారికే భూమి లభించడం, ప్రధానపరిశ్రమ లన్నింటినీ సంఘపరంచేయడం, ఆ పరిశ్రమలపై కార్మికవర్గ యాజమాన్యమేర్పడటం, బ్యాంకుల్ని ప్రభుత్వపరంచేయడం, జీవితవ్యయానికి తగిన భృతిని యివ్వడం, ట్రేడ్ యూనియన్లను గుర్తించడం, సమ్మె హక్కు నంగీకరించడం, కార్మికులకు సాంఘిక భద్రతను నెలకొల్పడం, మధ్యతరగతి ఉద్యోగులకు జీవిత వ్యయానికి తగిన వేతనాలివ్వడం, ఉద్యోగభద్రత, పెన్షన్ సౌకర్యాలు కల్గించడం, లాభాలను అదుపులో వుంచడం, బ్రిటీషుపెట్టుబడిని స్వాధీనం చేసుకోడం జరగాలి.

ఈ పద్ధతి నవలంబించినపుడే ఉత్పత్తికీ, మార్కెటు తగ్గిపోవడానికి మధ్యనున్న వైరుధ్యం పరిష్కరింపబడుతుంది.

(పెట్టుబడిదారీ పద్ధతులపై ఉత్పత్తి జరగడంవల్లనే ప్రధానంగా ఈ వైరుధ్యం ఏర్పడుతోంది.)

కాబట్టి యీ ప్రజాపద్ధతిపైనే ప్రజలు పురోగమించాలి. ప్రజల అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఒక ప్లాను ప్రకారం ఉత్పత్తిని నిర్మాణాత్మకంగా జరపాలి. ప్రజ లందరి శ్రేయస్సుకోసం అప్పుడు ప్రజలు కృషిచేస్తారు. చేసిన పనిని బట్టి అప్పుడు విభజనజరుగుతుంది. ఈవిధంగా ఆర్థికవిధానాన్ని సర్వసమృద్ధం చేయగల అవకాశం ఉంది.

పెట్టుబడిదారులు చూచించే పరిష్కారమార్గానికీ, ప్రజలు సూచించే పరిష్కారమార్గానికీ ఒకదానికొకటి పూర్తిగా విరుద్ధం.

పెట్టుబడిదారుల పద్ధతి : ప్రజలను యింకా దరిద్రులను చేయడం, సామ్రాజ్యవాదంతో పొత్తుకలపి వలసరాజ్య విధానాన్ని రక్షించడం భారతీయ దుర్దశను యింకా ఎక్కువ చేసి శాశ్వతంగా నిలవబెట్టడం.

## కార్మికవర్గంయొక్క, ప్రజలయొక్క మార్గం :

సామ్రాజ్యవాద - భూస్వామ్య - బూర్జువావర్గాల దోపిడితోసహా వలసరాజ్యవిధానాన్ని అంతంచేసి యీ సంక్షోభాన్ని పరిష్కరించడం.

పెట్టుబడిదారులు ప్రజలను నిర్బంధంలో ముంచెత్తి, కార్మిక,కర్షక ఉద్యమాలను ఓడించి నగ్నమైన క్రూర నియంతృత్వాన్ని స్థాపించడంద్వారానే ప్రజల రాజకీయ స్వాతంత్ర్యోద్యమాలను అణచివేయడంద్వారానే తమ ఆశయం సాధించుకోగలరు. అంటే పెట్టుబడిదారుల మార్గం ఆర్థిక

దుర్దశనేగాక, రాజకీయ నిర్బంధాన్ని, దాస్యాన్నీ నెలకొల్పుతుంది.

అందుకనే కార్మికవర్గమూ, ప్రజలూ పెట్టుబడిదారీ విధానాన్ని ఓడించాలి. ప్రజలపక్షంగా సంక్షోభాన్ని పరిష్కరించాలి. అంటే పెట్టుబడిదారుల, భూస్వాముల దండయాత్రనూ, వారి ప్రయోజనాలను కాపాడే విధానాలనూ ఓడించాలి. తమ ఉద్యమం నిర్బంధవిధానభీతాహంలో నీరుగారిపోకుండా కాపాడుకోవాలి.

యీ రెండువిధానాలూ దైనందిన పాక్షిక పోరాటాల్లో సమ్మెల్లో, రాజకీయపోరాటాల్లో ముఖాముఖిగా యెదుర్కొంటాయి. పెట్టుబడిదారుల విధానంవల్లనే ప్రజాసామాన్యం నిత్యమూ వారి సవాలు కెదురునిల్చేట్లు చేస్తుంది. సర్వతోముఖంగా పోరాటవెల్లువ విజృంభిస్తుంది.

# సామ్రాజ్యవాద, బూర్జువా కుట్రకు వ్యతిరేకంగా నూతనవర్గ సమ్మేళనను నిర్మించాలి

## ప్రజాతంత్ర సంఘటనకు కార్యక్రమం

## ప్రజలయెదురు దాడి

కాంగ్రెసు మంత్రివర్గా లేర్పడటంగాని, ఆతరువాత జాతీయ ప్రభుత్వ మేర్పడడంవల్లగాని,మతకలహాల రూపంగా అభివృద్ధి నిరోధకులు సాగించిన దండయాత్రగాని, కాంగ్రెసు నిర్వహించిన విచ్ఛిన్నకర పాత్రగాని, యుద్ధానంతరం ఉప్పొంగిన ప్రజా వెల్లువను అరికట్టలేక పోయాయి. ఈవెల్లువకు కారణాలు ప్రభుత్వం ఏర్పడినంతమాత్రం చేతనే తొలగిపోయేవి కావు.ప్రజలను దోచుకోవడమే దీనికి కారణం.ఈదోపిడి దుర్భర స్థాయికి పోయింది. జాతీయ ప్రభుత్వంద్వారా అంతా చక్కబడగలదనే ఆశను కాంగ్రెసు నాయకులు మొదట్లో కల్పించగలిగారు. కాని, ఆభ్రమలు ఆగష్టు 15 నుండి చాలా త్వరగా పటాపంచలవుతూ వచ్చాయి. దానితోపాటు ప్రజావిజృంభణ ప్రస్ఫుట మవుతూవచ్చింది. ఉమ్మడి పోరాటాలద్వారా, దైనందిన సంఘర్షణల ద్వారా తమతమ హక్కులకొరకు పరస్పర సహకారంతో కృషిచేయడంద్వారా పైనపేర్కొన్న వివిధ ప్రజలందరూ, ప్రజాతంత్ర ఉద్యమం సంపూర్ణ విజయం

సాధించినపుడే తమకు దారిద్ర్యం నుండి, పీడననుండి ముక్తి చేకూరగలదని స్పష్టంగా గుర్తించగలుగుతున్నారు.

“జమీందారీవిధానం రద్దుకావాలి: దున్నేవానికే భూమి: సంస్థానాలను రద్దుచేయాలి: ప్రధానపరిశ్రమలు ప్రభుత్వపరం కావాలి: జీవనప్రమాణాని కనుగుణ్యమైన వేతనా లివ్వాలి.” ఇవీ ప్రజాతంత్రోద్యమం యొక్క ప్రధాన నినాదాలు. ఈనినాదాలకు మునుపెన్నడూలేనంత ప్రజామోదం యీనాడు లభించింది. ప్రజాజీవన భద్రతకు ఈనినాదాలే పునాదులన్న విషయాన్ని మునుపెన్నడూ లేనంత స్పష్టంగా ప్రజలీనాడు గుర్తిస్తున్నారు.

అంతేకాదు. వెనుకటిభ్రమలు వదలిపోతున్నకొద్దీ ప్రజలు మరొక విషయాన్నికూడా గుర్తిస్తున్నారు. యింత వరకూ తాము ఎంతగానో నమ్ముకున్న నాయకులతోకూడిన ప్రభుత్వం ఒక్కబాధ్యతనుకూడా నిర్వహించలేక పోతూంది. తమకు భూము లివ్వలేకపోతూంది. శాంతిని చేకూర్చలేక పోతూంది. చివరకు తిండినికూడా పెట్టలేకపోతూందన్న విషయాన్ని ప్రజలు గుర్తిస్తున్నారు.

జాతీయప్రభుత్వాన్ని నడుపుతున్నది స్వార్థపరులూ, జమీందార్, పెట్టుబడిదారీ వర్గాలే అన్నవిషయాన్ని ప్రజలు నానాటికీ స్పష్టంగా గ్రహిస్తున్నారు. జాతీయనాయకులకూ, భాగతపెట్టుబడిదారులకూ గల సన్నిహితసంబంధాన్నిగూడా ప్రజలు గుర్తిస్తున్నారు. ఈవిధంగా భ్రమలు తొలగిపోతున్న కొద్దీ ఈప్రభుత్వం మారాలనే వాంఛ ప్రజల్లో బయలుదేరుతుంది. ఈవాంఛను ప్రస్ఫుటంగా వెల్లడిచేసేలా ప్రజలకు

పరిపూర్తిగా తోడ్పడటం కమ్యూనిస్టుపార్టీవిధి.

సంపూర్ణప్రజాతంత్రాన్ని వాంఛించే వర్గాలతోకూడి వుండి ప్రజాతంత్ర వ్యతిరేకులకు ఏమాత్రమూస్థానంలేకుండా వున్నప్రభుత్వమే ప్రజాతంత్ర ఉద్యమకార్యక్రమాన్ని అమలు పరచగలదు. అటువంటి ప్రభుత్వం కార్మిక, రైతు, పట్టణ మధ్యతరగతి ప్రజల సమ్మేళనంపై ఆధారపడి వుంటుంది.

ఈవర్గసమ్మేళనకు కార్మికవర్గం నాయకత్వం వహిస్తుంది. అలాంటి నిజమైన సంపూర్ణప్రజాతంత్ర ప్రభుత్వంలో సామ్రాజ్యవాదులతో పొత్తుకలిసినవారికీ, దోపిడిదారులకూ స్థానముండదు. అప్పుడు యీనాటివలె నిరంకుశ అధికారులు గాక ప్రజలే నేరుగా పరిపాలిస్తారు.

ప్రస్తుతపరిస్థితులలో ప్రజాపోరాటం అడుగడుక్కీ ఒక్క సామ్రాజ్యవాదాన్నే కాకుండా, బూర్జువానుకూడా ప్రతిఘటించవలసివస్తుంది. బూర్జువా ప్రజాతంత్రవిప్లవంలోబూర్జువా కూడా సామ్రాజ్యవాద వ్యతిరేకపక్షంలో ఉంటూవచ్చిన దశ దాటిపోయిందనే విషయాన్ని నేటిపరిస్థితులు స్పష్టంచేస్తున్నాయి. ఆదశ సంపూర్ణప్రజాతంత్ర విప్లవసాధనకు సన్నద్ధమౌతున్నదశ. కార్మిక, రైతు, పట్టణ మధ్యతరగతి ప్రజల సమ్మేళనంపై ఆధారపడే ప్రజాతంత్రరాజ్యాంగం వెంటనే నిర్మాణంకావాలనే నినాదం తీసుకోవలసిన పరిస్థితులీనాడు ఏర్పడ్డాయి. ఈనినాదంక్రిందనే ప్రజాతంత్రవుద్యమం ముందుకు ఉరికి, పరాయిసామ్రాజ్యవాదాన్నీ, దానితో భుజం కలిపిన స్వదేశ బూర్జువాను ఓడించగలదు: ప్రజలకు విముక్తి చేకూర్చగలదు.

# నూతనవర్గసమ్మేళనం

సామ్రాజ్యవాద - బూర్జువావర్గ కుట్రలను భగ్నం చేసేందుకు, సామ్రాజ్యవాదుల, సంస్థానాధీశ్వరుల, బూర్జువా కలయికను ఓడించేందుకు విప్లవప్రజాశక్తులను యిక కొత్త పద్ధతిలో సమీకరించడం అవసరం. అంటే ప్రజాతంత్రవిప్లవ విజయాన్ని, తమ శ్రేయస్సుకు అత్యావసరంగా పరిగణించే వర్గాలన్నిటియొక్క నూతన సమ్మేళనాన్ని నిర్మించాలి. ఇటువంటి సమ్మేళనం, యిటువంటి ప్రజాఐక్యతా లేనిదే సంపూర్ణప్రజాతంత్ర రాజ్యాంగం సాధ్యంకాదు.

ఆర్థికదోపిడీకీ, రాజకీయనిర్బంధాలకూ వ్యతిరేకంగా వాటంతటవే వచ్చిన కార్మిక, రైతు, మధ్యతరగతుల ఉద్యమాలే ఈ నూతన సమ్మేళనాని కొక స్వరూపాన్ని సూచిస్తున్నాయి. వెల్లుబుకుతూన్న యీ ప్రజావెల్లువలను నూతన ప్రజాతంత్ర సంఘటనగా సమ్మిళితం చేయవలసిన బాధ్యత కార్మికవర్గంపైనా కమ్యూనిస్టుపార్టీపైనా వుంది. వివిధపోరాటాల్లో పాల్గొంటూన్న ప్రజల ఐకమత్యాన్ని ఈ నూతన సంఘటన ప్రతిబింబింపచేయాలి. ఆర్థిక దోపిడీని, రాజకీయ బానిసత్వాన్ని వ్యతిరేకించి, సాగిస్తున్న ఉమ్మడిపోరాటమే ఈ ప్రజాతంత్రసంఘటనకు ప్రాతిపదిక కాబట్టి, ఈ పోరాటాల్లో పాల్గొంటున్న ప్రజలూ, వారి పోరాటసంస్థలూ, ఈ సంఘటనలో ఉండాలి జాతీయ బూర్జువా విద్రోహ విధానాలనూ, పరాయి సామ్రాజ్యవాదుల పన్నాగాలనూ ఎదుర్కొని ఈ ప్రజాతంత్ర సంఘటన పురోగమించేందుకు అవి యెంతో ఉపయోగపడగలవు.

కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గమూ, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రిందనున్న ప్రజాసంస్థలూ యీ ప్రజాతంత్రసంఘటనకు గుండెకాయగా వుండాలి. ప్రజాతంత్ర కార్యక్రమాల్ని సాధించడంలో యివి యితరవర్గాలకు తోడ్పడుతూ ముందుకు నడపాలి. ఇతర అతివాదపక్షాలూ, ప్రజాసంస్థల్లోని వాటి అనుచరులూ, ప్రజాతంత్ర సంఘటనలో ముఖ్యభాగస్వాములుగా ఉంటారు. కమ్యూనిస్టుపార్టీ, దాని నాయకత్వంక్రింద వున్న ప్రజాసంస్థలూ, వీరితో కలసి బూర్జువా పన్నాగాలను అరికట్టగలవు. దేశపరిస్థితులు దానికి వ్యతిరేకంగా పరిణమించేలా చేయగలవు. వివిధపోరాటా లన్నింటిలోనూ పాల్గొంటున్న ప్రజాసామాన్యా న్నంతటినీ తనలోకి చేర్చుకోవడమే ప్రజాతంత్రసంఘటన లక్ష్యంగా వుంటుంది. కాంగ్రెసు, లీగు, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసామాన్యాన్ని ప్రజాతంత్ర సంఘటనలో చేర్చుకుని స్వతంత్రంకొరకు, ప్రజాతంత్రం కొరకు పోరాడే విశాలతమమైన ప్రజాఐక్యతను నిర్మించాలి.

ప్రజాతంత్ర సంఘటనలో వివిధపార్టీలూ, ట్రేడ్ యూనియన్లూ, కిసాన్ సభలూ, విద్యార్థిసంస్థలూ వున్నప్పటికీ, అది వివిధపార్టీల సంస్థల కలయికగా మాత్రమే ఉండదు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం సాగించే విశాల ప్రజాశక్తుల సమ్మేళనంగా అది వ్యవహరిస్తుంది. సామ్రాజ్యవాదుల సంస్థానాధిపతుల బూర్జువా కలయికను సంపూర్ణంగా ఓడించేందుకు దీక్షబూని పనిచేసే సంఘటనగా వుంటుంది.

ఇలాంటి ఐక్య సంఘటనను నిర్మించడంలో కమ్యూనిష్టులు అతివాద పార్టీలయొక్క, వ్యక్తులయొక్క సహకారాన్ని

అర్థిస్తున్నారు. ఐక్య కార్యాచరణలో అతివాద పార్టీలను కూడ గట్టుకు రావలెనని ప్రయత్నిస్తారు. కాని కమ్యూనిష్టులు జ్ఞప్తి యందుంచుకొనవలసిన ముఖ్య విషయమేమంటే ప్రజాతంత్రి సంఘటనా నిర్మాణం కొరకు జరిగే పోరాటాన్ని కార్మికవర్గ విధానానికీ, పోరాట కార్యక్రమానికీ రైతులనూ, మధ్య తర గతులనూ ఆకర్షించి, కార్మికవర్గ నాయకత్వాన్ని స్థాపించడా నికి జరిగే పోరాటంనుంచి వేరు చేయరాదు.

మరొకటి ముఖ్యవిషయం: ప్రజాతంత్రి సంఘటనా నిర్మాణక్రిమంలో అది ప్రజలలో పాదుకొనిపోయి ప్రజా తంత్రి పద్ధతులతో పనిచేసే, శిక్షణా, నిర్భేధ్యమైన ఐక్యత కల్గిన రాజకీయ ప్రజాసంస్థగా తయారయ్యేటట్లు చూడాలి. ఇది సమిష్టి కార్యక్రిమం కొరకూ క్రిమేణా కార్మికవర్గ నాయకత్వం స్థాపించేందుకు పోరాడడం ద్వారానే సంభవ మాతుంది.

కాబట్టి ప్రజాతంత్రి సంఘటన అతివాద పార్టీల నాయ కులు నలుగురూ చేరి యేర్పాటు చేసుకొనే ఒడంబడిక కాదని గుర్తించాలి. అది ప్రజాసామాన్యంమీద ఆధారపడిన సంఘటన. అది కార్మికవర్గానికీ, రైతులకూ, మధ్యతరగతి మేధావులకూ మధ్యన ఏర్పడే ఐక్యత. అది రాజకీయంగానూ, నిర్మాణ రీత్యానూ ఎంతవరకు కార్మికవర్గనాయకత్వాన్ని అంగీకరించు తుందో అంతవరకే దానికిబలమూ, కార్యాచరణశక్తి వుం టాయి. ఎంతవరకూ కార్మికవర్గం తనపాలసీ కార్యక్రమాలకు తన మిత్రవర్గాలను ఆకర్షించగలదో ఎంతఎక్కువగా వారి విశ్వాసాన్ని చూరగొనగలదో అంత ఎక్కువగా ప్రజాతంత్ర

సంఘటనకు బలమూ, జయాన్ని చేపట్టగల కార్యశక్తీ వుంటాయి.

కమ్యూనిస్టులు అంతాగ్రహిస్తే నేతప్ప, లేకపోతే మరల పాతతప్పులే చేసే అపాయంవుంటుంది. అంటే మితవాద ధోరణిలో, అవకాశవాదంలో కొట్టుకుపోతూ దానికే అతివాద ఐక్యతలని డబ్బాలుమోగిస్తూ కార్మికవర్గాన్ని ఊగిసలాడే వర్గంతోక వెంటనడిపే అపాయం వుంటుంది.

ఆర్థికసంక్షోభం తాకిడివల్లా, ప్రభుత్వమంటే వున్న భ్రమలు అంతకంతకూ త్వరగా తొలగిపోతూవుండడంవల్లా ప్రజాసామాన్యం అంతకంతకెక్కువ సంఖ్యతో కార్యరంగంలో కదులుతారు. అందరికన్న వెనుకబడివున్న ప్రజలు గూడా రాజకీయంగా తీవ్రసంచలనంలో కొస్తారు. ఇలాంటి ప్రజానీకాన్నంతటినీ ఒకసమిష్టి ఉద్యమంలోనికి తెచ్చి, పోరాట ఐక్యతను సాధించాలి. వివిధపాక్షికపోరాటాలనూ నిర్మాణయుక్తంగా సమైక్యపరచి, సామ్రాజ్యవాద- భూస్వామ్య- బూర్జువా ప్రాబల్యానికి వ్యతిరేకంగా జరిగే విశాలసమరంలో ఒకభాగంగా అభివృద్ధిచేయాలి. కార్మికవర్గముయొక్క స్థిరమైన నాయకత్వంవల్లనే, పోరాడేప్రజానీకంయొక్క విశాల ఐక్యనిర్మాణాత్మకంగా అభివృద్ధిఅయినపుడే ప్రజాతంత్ర సంఘటన తన కర్తవ్యాలను నెరవేర్చగలదు.

## అతివాదపార్టీలతో ఐక్యసంఘటన

కాంగ్రెసు ప్రజలకూ, లీగుప్రజలకూ, సంస్థానప్రజలకూ తదితరులకు ఉన్న భ్రమలను పోగొట్టి, వారిని కార్యోన్ముఖులనుచేసి నూతనప్రజాతంత్రసంఘటనను నిర్మించేందుకూ

ప్రజాతంత్ర విప్లవసాధనకు ఐక్యప్రజా వుద్యమాన్ని సాగించేందుకూ, ప్రస్తుతపరిస్థితిలో అతివాదపార్టీల ఐక్యసమ్మేళనం చాల బలమైన సాధనంగా ఉపయోగపడగలదు.

ప్రజాసామాన్యం అతివాదభావాలవైపు మొగ్గుతున్నారు. ఈవిషయమూ, దేశంలో కమ్యూనిష్టుపార్టీకివున్న బలమూ ఈరెండూకలసి అతివాదశక్తుల బలాన్ని ఎంతో యినుమడింపజేసి, దేశంలో నిర్మింపనున్న నూతన ఐక్యతకు వాటిని పునాదిగానూ, అగ్రగామిగాను చేయగలవు.

కాబట్టి,కమ్యూనిస్టు పార్టీ యితర అతివాదపార్టీలతో తక్షణం సంప్రదింపులు జరపాలి. ఐక్యకార్యాచరణకు, ప్రజాతంత్ర ఉద్యమానికి సంబంధించిన వివిధసమస్యలపై ఐక్యతాభావం కొరకు రాజీధోరణి నవలంబిస్తున్నవారిని, వారిఅసలు యజమానులను ఎదుర్కొనేందుకు నూతనసంఘటనను నిర్మించడం గురించి ఆపార్టీలతో ఒడంబడికలు కుదుర్చుకోవాలి. ఈసందర్భంలో కమ్యూనిస్టుపార్టీ ఒకవిషయాన్ని గమనించాలి. ప్రజల్లో పరపతి కోల్పోయి పతనమైపోయిన మోసగాండ్రు, అలాంటి గ్రూపులు, ప్రజల్లోవున్న పెట్టుబడిదారీ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక క్రోధాన్ని ఉపయోగించుకొని తిరిగి పైకిరావడానికి అతివాద బురఖాలు తొడుగుతారు. ఇటువంటిమోసపు శక్తులను పార్టీకనిపెడుతూ వుండాలి. వాటితో ఎలాంటి సంబంధమూ పెట్టుకోరాదు. ముఖ్యంగా ప్రపంచమంతటా విప్లవ ప్రతీఘాతక సంస్థలనీ, విధానాలనీ పేరుపొందినవాటితో సంబంధాలుగల గ్రూపులతో ఎలాంటి సంబంధమూ కూడదు.

ప్రజాతంత్ర సంఘటనానిర్మాణం పోరాటంతో కూడు కున్నపని. అనేక ఉమ్మడి ఉద్యమాలద్వారా, వేరు వేరు సమస్యలపై ప్రజాతంత్రశక్తులు కలసి జరిపే పోరాటాలద్వారా స్థానికంగా కొన్నిచోట్ల కమ్యూనిస్టుపార్టీకి, కాంగ్రెసు లీగు ప్రజలకూ – వీలైతే కాంగ్రెసు లీగు కమిటీలమధ్య ఐక్యసమ్మేళనం ఏర్పడడంద్వారా, మరికొన్నిచోట్ల అతివాద పార్టీలకూ, కాంగ్రెసు లీగు ప్రజలకూ, ఇంకా కొన్నిప్రదేశాల్లో కమ్యూనిస్టుపార్టీకి ఇతర ప్రజాసంస్థలకూ ఐక్యసమ్మేళనలు ఏర్పడడంద్వారా ఈ ప్రజాతంత్రసంఘటన నిర్మాణం కొన సాగుతుంది. ఈ నిర్మాణాని కంతటికీ ప్రధాన ప్రాతిపదిక, కమ్యూనిస్టుపార్టీయొక్క స్వతంత్ర కార్యాచరణ; పోరాటాలు నడపడంలోనూ, ఆ పోరాటాల్లోకి కొత్తప్రజలను ఆకర్షించడంలోనూ దానికిగల సామర్థ్యాలే. ఈ ప్రజాసంఘటనకు, కమ్యూనిస్టుపార్టీ, అతివాదపార్టీలూ, ట్రేడ్‌యూనియన్లూ, కిసాన్‌సభలూ, విద్యార్థి-యువజనసంఘాలు గుండెకాయగా వుంటాయి. కాంగ్రెసు, లీగు ప్రజలను, సంస్థాన ప్రజామండలుల అనుచరులనూ ఈ గుండెకాయచుట్టూ సమీకరించాలి. ఈ విధంగా, నూతనపరిస్థితుల నెదుర్కొనగల విశాల ప్రజాతంత్ర సంఘటనను నిర్మించాలి.

అనేకరాష్ట్రాల్లో అతివాదగ్రూపులకు నిర్మాణ స్వరూపం లేదు. అన్నిరాష్ట్రాల్లోనూ, ఏ సంస్థకూ చెందకుండా వున్న అతివాదులు వేలకొలది ఉన్నారు. అతివాదపార్టీలమధ్య ఐక్యత యిటువంటివారి నందరినీ ఐక్యకార్యాచరణకు ఉమ్మడి సంస్థలోకి ఆకర్షించగల సాధనంగా ఉపయోగపడుతుంది.

దక్షిణాదిలో ఈవిధంగా నిర్మాణ స్వరూపం లేకుండా వున్న అతివాదులను గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. అతివాదులమధ్య ఐక్యత వీరినికూడా ఐక్యపజాపోరాటంలోనికి ఆకర్షించగలదు. తక్కిన రాష్ట్రాల్లోకూడా ఇదేవిధంగా నిర్మాణరూపం లేకుండావున్న అతివాదులను, అతివాద పార్టీల ఐక్యత ఆకర్షించాలి. ఈవిధంగా ఈఅతివాదులందరూ ఇన్నాళ్ళసు తమ ఆశయాలను సాధించగల ఒక్కమహత్తర సాధనాన్ని, ఒక వేదికనూ పొందగలరు. అతివాదపార్టీల ఐక్యత యిటువంటి అతివాదులనే కాకుండా, కొన్ని కొన్ని సమస్యల్లో, అభివృద్ధికాముక కాంగ్రెసువాదులనుకూడా ఆకర్షించగలదు.

## కాంగ్రెసులీగులు: ప్రజాతంత్ర సంఘటన

ప్రజాతంత్ర సంఘటనలో కాంగ్రెసు లీగుల స్థానమేమిటో సరిగా గుర్తించాలి.

యీ రెండు సంస్థలూ లక్షలకొలది ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నాయి. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సామాన్యంఎంతో వాటి పలుకుబడికింద వుంది.

కాంగ్రెసు, లీగు రెంటింటి నాయకత్వాలూ యీప్రజలనందరినీ ప్రజాతంత్ర విప్లవం కొరకు జరిగే పోరాటాన్నుంచి ప్రజాతంత్ర సంఘటననుండి దూరంగా ఉంచేందుకు ఎంతైనా ప్రయత్నిస్తారు. యిందుకొరకు ప్రజలకు తమపట్లగల విశ్వాసాన్ని వెనుక తాముజరిపిన సామ్రాజ్య వ్యతిరేకపోరాటాల ఫలితాన్ని బాగా ఉపయోగించుకుంటారు. బూర్జువానాయకులు కాంగ్రెసులీగు సంస్థల పలుకుబడిలోనున్న విశాలప్రజానీకాన్ని

ప్రజాతంత్ర సంఘటననుండి దూరంగావుంచడంలో జయంపొంది నట్లయితే ప్రజాతంత్ర ఉద్యమశక్తులు దుర్బలమైపోతాయి. నిస్తబ్ధమవుతాయి.

కాబట్టి యీ ప్రజానీకాన్ని బూర్జువానాయకుల పలుకుబడినుండి తొలగించడానికి కమ్యూనిస్టుపార్టీ అత్యంతశ్రద్ధతో ప్రయత్నించాలి. ప్రచారంద్వారా ఉమ్మడిఉద్యమాలు, ఉమ్మడిపోరాటాలద్వారా ఈ కృషినిసాగించాలి.

ప్రజాతంత్ర సంఘటనలోనికి ఈ రెండుసంస్థల ప్రజలను వారినాయకుల అభీష్టానికి వ్యతిరేకంగా తీసుకురావడంలో చాల ప్రధానమైన ప్రాముఖ్యతవుంది. అందుచే ఈ సంస్థలలో వున్న అతివాదులు ఈ సంస్థల లోపలాబయటాకూడా, నాయకత్వంయొక్క పాలసీలను బయటపెట్టడానికి పోరాటం కొనసాగించాలి. ప్రజాతంత్రవిప్లవం ప్రజాసామాన్యాన్ని ఆవైపుకు ఆకర్షించాలి: ప్రజాతంత్ర సంఘటనలో వారిని చేరేటట్లు చేయాలి.

బ్రిటిషువ్యతిరేక పోరాటసాంప్రదాయం 60 ఏండ్లుగా కాంగ్రెసుకువుంది. జాతీయపోరాటాలను జ్ఞప్తికితెచ్చి ముందుకుపోదామని మనసారా వాంఛిస్తున్న లక్షలాది సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజలను ఉద్రిక్తపరచగలను.ఊపగలను.తమసహాకార పాలసీని సపోర్టుచేసేటట్లు ప్రజాభిప్రాయాన్ని తమకు అండగా వుంచుకునేందుకుగానూ, బూర్జువానాయకులు ఇవేళ కాంగ్రెసుపేరును ఉపయోగించుతున్నారు. కేంద్రప్రభుత్వంగానీ, మంత్రులుగాని ప్రజలను ఒప్పించలేని విషయాలను కాంగ్రెసుద్వారా నెగ్గిస్తున్నారు. ఆవిధంగా ప్రజల విమర్శనాశక్తిని

దెబ్బగొడుతున్నారు.

కాంగ్రెసులోపల వున్న ప్రజలకొరకు పోరాటాన్ని వదలివేయడం, ప్రజాతంత్రసంఘటనలో వారియొక్క ప్రధాన పాత్రను నిర్లక్ష్యపరచడం, బూర్జువానాయకులకు లక్షలాది ప్రజలను బహూకరించడంతో సమానమవుతుంది. ఈ కార్య క్రమాన్నిగాని, ప్రజాతంత్రసంఘటననుగాని కాంగ్రెసు నాయ కత్వం ఆమోదించుతుందని కమ్యూనిష్టుపార్టీకి భ్రమ లేదు. కారణమేమంటే అది బూర్జువావర్గానికే ప్రతినిధి. అలాంటి బూర్జువావర్గమంతా సామ్రాజ్యవాదుల పొత్తు చేరింది. కాని ప్రజాతంత్ర ఉద్యమానికి కాంగ్రెసు ప్రజానీకాన్ని ఆకర్షిం చుట చాలా ముఖ్యమైన విషయం.

అందుచే కాంగ్రెసులోని ప్రజాస్వామ్యవాదుల, మొదటినుండి సామ్రాజ్యవాద వ్యతిరేకులైన వారి కార్య కలాపాలకి కమ్యూనిస్టుపార్టీ ఎక్కువ ప్రాముఖ్యతను యిస్తుంది. ప్రజానీకానికి భ్రమలు పోగొట్టేపనికి ప్రజాతంత్రకార్యక్రమా నికై ప్రజలను ముందుకు నడిపే పనికి కమ్యూనిష్టుపార్టీ చాల ప్రాముఖ్యత యిస్తుంది.

## అతివాదపార్టీలు

అతివాదపార్టీల ఐక్యసంఘటననూ, దానికున్న పరిమితు లనూ రెంటినీకూడా - భారతకమ్యూనిస్టుపార్టీ గమనించాలి.

ఏపార్టీలతో ఐక్యసంఘటన ఏర్పరుచుకోవాలని కోరు తుందో ఆ పార్టీలలో ముఖ్యమైనవి ఫార్వర్డుబ్లాక్, సోషలిస్టు పార్టీ.

## ఫార్వర్డు బ్లాకు

ఫార్వర్డుబ్లాకుయొక్క పలుకుబడి వివిధరాష్ట్రాలలో ఒకేరకంగా లేక అసమానంగావుంది. దాని నాయకులలో చిత్తశుద్ధిగల ప్రజాతంత్రవాదులూ, పెట్టుబడిదారీవ్యతిరేకులూ, సామ్రాజ్యవాద వ్యతిరేకులూ వున్నారు.

ఫార్వర్డుబ్లాకు అనుచరులు సోషలిస్టు ఆశయాలకోసం ఉత్సాహితులైనవారు, ఎక్కువగా సామ్రాజ్యవాద వ్యతిరేక పెటీబూర్జువావ్యక్తులు.

ఫార్వర్డుబ్లాకు నాయకత్వంలో ఒకభాగమూ, అనుచరులు అభ్యుదయకరమైన కార్యక్రమాన్ని బలపరుచుతున్నారు. ఆలిండియా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు జెండా క్రింద ట్రేడ్‌యూనియన్ ఐక్యతకావాలని సపోర్టుచేస్తున్నారు. అతివాద ఐక్యతను సపోర్టుచేస్తున్నారు. కార్యాచరణకు సమిష్టి కార్యక్రమం కావా లంటున్నారు. కాని మరొకభాగం తీవ్రముగా కమ్యూనిస్టులపై దురభిప్రాయం కల్గివుంది. అతివాద ఐక్యతను ప్రతికూలించుతుంది. ఆలిండియా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో విచ్ఛిన్నకరపాత్రను వహించుతోంది.

విదేశాంగనీతి విషయంలో ఫార్వర్డుబ్లాకు సాధారణంగా సరియైన పోకడనే అవలంబించుతోంది. సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించుతోంది. ప్రజాతంత్రాన్ని బలపర్చుతోంది.

ఫార్వర్డుబ్లాకులోని విచ్ఛిన్న ధోరణిని; ఆపర్ట్యూనిస్టు ధోరణిని పార్టీ జాగ్రత్తగా పరిశీలిస్తూనే, అతివాద ఐక్యతలో ఒకభాగంగా ఫార్వర్డుబ్లాకుతో సంయుక్తసంఘటనకు అన్ని

విధాలా ప్రయత్నంచేయాలి. ఫార్వర్డుబ్లాకు నాయకత్వంలోని అభ్యుదయకాముకులలో అతివాదఐక్యతకై కోరిక చిత్తశుద్ధితో కూడుకునేవుంది. అలాగే వారి అనుచరుల విషయంకూడా.

## సోషలిస్టుపార్టీ

ఆర్థికసంక్షోభం ప్రజాసామాన్యంయొక్క పోరాటశక్తి ఆగస్టుపోరాటం- వీటన్నిటి ఒత్తిడిఫలితంగా, కాంగ్రెసు మితవాద నాయకత్వంపట్ల అనేకమంది కాంగ్రెసువాదులకు భ్రమలు తొలగినఫలితంగా, పెట్టుబడిదారులకు తీవ్రంగా వ్యతిరేకులయిన అతివాదభావాలతోకూడిన వ్యక్తులు సోషలిస్టుపార్టీలో చేరారు. బొంబాయిలాంటిచోట్ల సోషలిస్టుపార్టీకి కార్మికవర్గంలోకూడా పలుకుబడివుంది. కలకత్తాలాంటి స్థలాలలో ట్రేడ్ యూనియన్ నాయకులుకూడా సోషలిస్టుపార్టీలో వున్నారు. ప్రజాసంఘాలను నిర్మించాలని రైతులలో, కూలిలలో, విద్యార్థులలోపనిచేయాలనివాంఛించే నిజాయితీవ్యక్తులు సోషలిస్టుపార్టీ అనుయాయులలో చాలమంది వున్నారు.

కాంగ్రెసు మితవాదనాయకత్వం సోషలిస్టుపార్టీ అంటే భయపడుతూంది. కానీ అదేసమయంలో అది సోషలిస్టుపార్టీని దువ్వి లోబరుచుకోవాలని చూస్తూంది.

పెటీబూర్జువానుండి వచ్చినవ్యక్తులే ఎక్కువభాగం సోషలిస్టుపార్టీ సంఖ్యకుమూలం. సోషలిస్టుపార్టీ అనుచరులు పెట్టుబడిదారులను ద్వేషిస్తారు. నెహ్రూ ప్రభుత్వం పట్ల అసంతృప్తి కలిగియున్నారు. రాజీని ద్వేషిస్తున్నారు. ముందుకు పోవాలని ఉవ్విళ్లూరుతున్నారు. తాము సోషలిస్టులమని వారు అనుకుంటారు కాని నిజానికి వారు అతివాద జాతీయ

వాదులు మాత్రమే. అయినప్పటికీ, సోషలిజం కోసం వారి వాంఛ విజయమైనదే. కాని వారి వాంఛకు దూరమైపోవడానికి కారణం వక్రమార్గం త్రొక్కుతున్న వారి నాయకత్వ పాలసీయే. సోషలిస్టుపార్టీ అనుచరబృందం శ్రామికవర్గంవైపు మ్రొగ్గుతున్న వాహిని.

అతివాదపార్టీల ఐక్యతకు అర్థం, ప్రజాతంత్ర విప్లవాన్ని ముందుకునెట్టే కర్తవ్యాన్ని, ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పే కర్తవ్యాన్ని నెరవేర్చే ఉమ్మడ కార్యక్రమానికి ఆ పార్టీల అనుచరులను ఆకర్షించడం అన్నమాట. సోషలిస్టు పార్టీ కార్యక్రమంనుండి, నాయకత్వం నుండి అతివాదులైన ఆ పార్టీ అనుచరుల ఆశయాలను, ధోరణులను వేరుపరచాలి. సోషలిష్టు నాయకత్వం కార్మికవర్గ వ్యతిరేక సిద్ధాంతాలను, సూత్రాలను తెచ్చిపెట్టి సోషలిష్టుపార్టీ సామాన్యసభ్యులను విషపూరితం చేస్తూంది. సోషలిజాన్నిగురించి; అంతర్జాతీయ పరిస్థితినిగురించి తప్పుడుచిత్రాన్ని వారికి చూపించు తున్నారు. కమ్యూనిస్టుపార్టీకీ, విప్లవోద్యమానికీ వ్యతిరేకంగానిరంతరమూ సోషలిస్టుపార్టీ నాయకత్వంచే ఎడతెగని విషప్రచారం సాగించబడుతూంది. సోషలిస్టు నాయకుల 'సోషలిజం' గురించి వారి సిద్ధాంత ఊహలనుగురించి వారి సోవియట్ వ్యతిరేక కమ్యూనిస్టు వ్యతిరేక ధోరణిని గురించి నిశితంగా విమర్శించి బయటపెట్టడం—అతివాద ఐక్యసంఘటనను నిర్మించేపోరాటంలో ఒక భాగమే.

సోషలిస్టునాయకత్వాన్ని బయటపెట్టుటలో ఒక విషయం గమనించాలి. ఏ నల్గురినో అయిదుగురినో మినహాయిం

చితే నాయకత్వంలోని ముఖ్యులకు ఒకేరకమైన పాలసీ లేదు. అందుచే విమర్శ ఆయా వ్యక్తుల ననుసరించి విభిన్నంగా వుండాలి.

జయప్రకాశ నారాయణ్, అచ్యుత పట్వర్ధన్, రామ మనోహర్ లోహియా, అశోక మెహతా మొదలైన సోషలిస్టుపార్టీ అగ్రనాయకు లిచ్చిన కార్యక్రమము, అవలంబించే పాలసీ ఈ క్రింది విషయాన్ని స్పష్టంచేస్తోంది. అతివాద అనుచరుల అసంతృప్తిని వినియోగించుకొని ఒక బూర్జువా చట్టబద్ధ పార్టీగా మహాఘనత వహించిన ప్రభుత్వానికి చట్టబద్ధ ప్రతి పక్షంగామాత్రమే సోషలిస్టుపార్టీని మార్చాలన్న దురుద్దేశ పూరితమైన కోరిక వారిలో నున్నట్లు స్పష్టమౌతుంది. వారి అంతర్జాతీయ దృక్పథమూ, జాతీయ దృక్పథమూ, రెండూ దానినే సూచించుతున్నాయి.

సోషలిస్టుపార్టీయొక్క ఇటీవలి కార్యక్రమం (ఆకార్య క్రమం సోషలిజానికి పరివర్తనచెందే కార్యక్రమంగా వారు చెబుతూంటారు) ఏం తెలియజేస్తూంది? సోషలిజంవైపుకు ఇండియా, పరిణామం చెందే ఈ క్రింది ప్రథమ కార్యక్రమం అవలంబించాలని వా రంటారు. వారు చెప్పిన కార్యక్రమం అంతా హేయమైన మామూలు శాసనబద్ధ సంస్కరణాలు దాటిపోవడంలేదు. ఇందులో చెప్పిన కార్యక్రమము, శాసన సభకు బాధ్యత వహించే ప్రభుత్వం ఏర్పడాలని మాత్రమే. వీరి ప్రజాతంత్ర కార్యక్రమం ఈ హద్దును దాటిపోవడం లేదు. శాసనసభలకు బాధ్యత వహించే ప్రభుత్వాధికారాలను చేపట్టడమే సోషలిజానికి మార్గం అని ఈ రోజులలో ప్రదర్శ

నలు చేయడానికి చాలా సాహసం కావాలి.

ఈ కార్యక్రమంలో ఇండియా రిపబ్లిక్ అంటూ ఏదో కుర్రితనంగా మాట్లాడినా "నష్టపరిహారం యిచ్చిగాని, ఈయకుండగాని" ప్రయివేట్ ఆస్తిని పరిశ్రమలను స్వాధీనపరుచుకొంటామని చెప్పినా, ఎక్కడా అందుకు పోరాటం అవసరమని చెప్పబడలేదు. సోషలిస్టుపార్టీ, శాసనసభాప్రతికూలపక్షకార్యక్రమంలో గాఢవిశ్వాసాన్ని ప్రకటించుతుంది. ప్రజాతంత్రవిప్లవం అప్పుడే పూర్తిఅయినట్లు అది భావించుతోంది. ప్రజలకు అధికారం వచ్చినట్లు ఎంచుతోంది. ఇక సోషలిజానికి పరివర్తన మాత్రమే మిగిలియున్నట్లు అద భావించుతోంది.

శాసనబద్ధచర్యల ద్వారా సోషలిజం సాధించవచ్చుననే భ్రమను అది బహిరంగంగా ప్రబోధించుతోంది. ఈ శాసనబద్ధత్వాన్ని "ప్రజాతంత్రపద్ధతులు" అనే పేరిట కప్పిపుచ్చుకొంటున్నది.

శాసనబద్ధ హక్కులను కోరుతున్నపుడు సైతం సోషలిస్టు నాయకులు, ఆంధ్ర, తమిళనాడు, మహారాష్ట్ర మొదలగు జాతీయ యూనిట్లకు స్వయంనిర్ణయ హక్కును కోరడం లేదు. దానిని బట్టి ఇటీవలి భారతదేశచరిత్రను బట్టి వారేమీ నేర్చుకోలేదని స్పష్టపడుతుంది.

వారి ఆర్థికకార్యక్రమంలో, ప్రయివేటు ఆస్తిని ప్రభుత్వపరం చేసేముందు నష్టపరిహారం ఇచ్చే అవకాశాన్ని వారు సూచిస్తున్నారు. భారీపరిశ్రమలను తక్షణం ప్రభుత్వపరంచేయాలని వారు తప్పనిసరిగా కోరవలసిన కోర్కెను కోరడంలేదు.

తక్షణమేగాని, త్వరలోగాని పరిశ్రమలను ప్రభుత్వపరంచేయాలని అంటారు. ఆవిధంగా పరిశ్రమలను ప్రభుత్వపరంచేయాలనే నినాదాన్ని వాయిదావేయడానికి అవకాశాల నేర్పరచుతూన్నారు.

జమిందారీ విధానం రద్దుకావాలి. జీవనానికి సరిపడే జీతాలుకావాలి అంటూ వారు మాట్లాడుతారు. కానీ సామాజికవ్యవస్థను మార్చడానికి పోరాటాన్ని మానివేసిన తర్వాత తమ కార్యక్రమంలో కనీసం పరిశ్రమలను ప్రభుత్వపరం చేయవలసిందని కోర్కెలను అడగడానికి ధైర్యంలేకపోయిన తర్వాత ఎన్నికలలో బూర్జువానాయకత్వం ఇచ్చేవాగ్దానాల లాగానే ఇవీ వుండిపోతాయి.

దైనందిన ప్రధానసమస్యలలో సోషలిస్టుపార్టీ నాయకులు ప్రజావ్యతిరేక పాలసీలను అవలంబించుతున్నారు. కంట్రోలు రద్దుచేయడానికి అంగీకరించి పెద్దపెద్ద పెట్టుబడిదారులు ప్రజలను దోచుకోవడానికే సహాయపడుతున్నారు. తనవిధిని తాను నిర్వర్తించలేదంటూ కార్మికవర్గాన్ని నిందించే పెట్టుబడిదారీవర్గపు నిందలనే వారు ప్రతిధ్వనిస్తున్నారు.

(రైల్వేబోర్డుకు జయప్రకాశ్ లేఖ)

సామాన్య సభ్యులవత్తిడివల్ల వారు సమ్మెలకుగూడా పిలుపివ్వవచ్చు. కాని సాధారణంగా వారు సమ్మెకు వ్యతిరేకమేగాకుండా సమ్మెలను విచ్ఛిన్నంగూడా చేస్తున్నారు. (బొంబాయి బట్టలమిల్లుల కార్మికులసమ్మెలు అశోకమెహతా ఒప్పుకోలు) వారు ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుయొక్క ట్రేడ్‌యూనియన్ ఉద్యమముయొక్క ఐక్యతను విచ్ఛిన్నం

చేస్తున్నారు. యజమానులదాడికి ప్రోద్బలంచేస్తున్నారు. వారి క్రిందఉండే సామాన్యసభ్యులు ఐక్యతనుకోరుతున్నా వారు మాత్రం యీవిచ్ఛిన్న కార్యక్రమాన్నే నడుపుతున్నారు.

వాళ్లు కమ్యూనిస్టులపైనా,వారునడిపే ప్రజాపోరాటాల పైనా నిప్పులు కక్కుతుంటారు. కమ్యూనిస్టు ఉద్యమాలపై ప్రభుత్వంనడిపే నిర్బంధాలను సిగ్గువిడిచి బలపరుస్తున్నారు. (బొంబాయి విద్యార్థులపైన కాల్పులుజరిగిన సందర్భంలో అశోకమెహతా ప్రకటన) వాళ్ల శాసనసభాసభ్యులు బెంగాలు ప్రజాశాంతి రక్షణచట్టాన్ని బలపరచినట్లు హేయమైన నిర్బంధ చట్టాలను బలపరుస్తున్నారు. నిర్బంధవిధానాన్ని నిరశిస్తూ జరిపే సమ్మెలను వ్యతిరేకిస్తున్నారు.

అతివాదపక్షాల ఐక్యతను వారు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీతో ఎలాంటి సహకారమూ పనికిరాదంటున్నారు. ఇలాంటి విధ్వంసకర పాత్రను నిర్వహించడం ద్వారా సామ్రాజ్యవాదులతో సహకరించేవర్గాల ప్రయోజనాలకు తోడ్పడుతున్నారు.

చీటికీ మాటికీ తాము కాంగ్రెసు నిదిగో వదలి పెడ్తున్నాం, అదిగో వదలిపెడుతున్నాం, అని సోషలిస్టునాయకులు అంటున్నారు. అతివాద పదజాలంతో యీవిధంగా మొట్టమొదట తమఅనుచరులను కాంగ్రెసునుండి విడిపోతామంటూ చల్లపరచాలని వారు ప్రయత్నిస్తున్నారు. ఎందువల్లనంటే వారి అనుచరులు తమ నాయకత్వపు ఊగిసలాట పాలసీలకు విసుగెత్తివున్నారు. కాంగ్రెసులో వుండటంవల్ల తప్పనిసరిగా కలిగే ఫలితమే ఇది అని, ఆ సోషలిస్టు సాధారణసభ్యులు అను

కుంటున్నారు. కాంగ్రెసును విడిచిపెడతామనే మాటలు సోషలిస్టుసభ్యులను సంతృప్తిపరుచుతాయి. ఎందువల్లనంటే, కాంగ్రెసునుండి విడిపోవడంద్వారా సామ్రాజ్యవాదులతో రాజీపడే కాంగ్రెసు నాయకత్వానికి వ్యతిరేకంగా స్వతంత్రమైన, దిట్టమైన రాజకీయ కార్యాచరణకు వారికి మార్గం కన్పడుతుంది. సోషలిస్టు సాధారణసభ్యులు రాజీ ధోరణిని అసహ్యించుకొంటారు. కాంగ్రెసు నాయకత్వపు పాలసీల ఇనుపపిడికిలిని సడలించుకొని స్వతంత్రమైన, దిట్టమైన రాజకీయ ధోరణిని అవలంబించాలని వారి వాంఛ.

కాని యిది వట్టి బూటకం. క్రిందిసభ్యుల్లో 'అతివాద పార్టీ' అనే పేరును నిలబెట్టుకోడానికీ, ఈ బెదరింపు నుపయోగించుకొని కాంగ్రెసునాయకులతో బేరాలాడటానికిమాత్రమే సోషలిస్టునాయకులు తాము కాంగ్రెసునుంచి చీలిపోతామని ప్రకటిస్తున్నారు. సోషలిస్టునాయకులు చేస్తోన్న ప్రకటనల్లో భావ మిదే.

కాంగ్రెసునుండి విడిపోడానికి సోషలిస్టుపార్టీ నాయకులు నిర్ణయించినా, వారు స్వతంత్ర విప్లవపంథా నవలంబించరు. రానున్న ఎన్నికల్లో ఒక బూర్జువా ప్రతికూలపక్షంగా-పార్లమెంటరీపార్టీగా-మాత్రమే వ్యవహరిస్తారు. కాంగ్రెసునుంచి చీలిపోతామని సోషలిస్టునాయకుల నోటినుండి వెలువడే మాటల కర్థం క్రొత్తరాజ్యాంగంలో రానున్న ఎన్నికల్లో స్వతంత్రంగా పాల్గొంటామనిమాత్రమే. వోట్లద్వారా వారు తమ అదృష్టరేఖను నిర్ణయించుకోవాలనిచూస్తున్నారు. ఇందువల్ల వారు చట్టబద్ధరాజ్యాంగంలో బూర్జువా నాయకులుగా

వ్యవహరిస్తారేగాని వారిలో విప్లవతత్వం లేశమాత్రమైనా ఉండదు.

ఇక వారి రాజకీయ ప్రణాళిక : యూరోప్, అమెరికా దేశాల్లో కరుడుగట్టిన అభివృద్ధి నిరోధకులైన సోషల్ డెమాక్రెట్సునుంచి వారి సిద్ధాంతాలను నేర్చుకుంటున్నారు. సోషల్ డెమాక్రాట్ల దృష్టితోనే 'అంతర్జాతీయ పరిస్థితులను చూస్తున్నారు.

సోవియట్ యూనియన్‌ను అతినీచంగా నిందిస్తున్నారు. సోవియటు ప్రభుత్వాన్ని 'నియంతృత్వం' అంటూ దూషిస్తున్నారు. దీన్నిబట్టి యీ సోషలిస్టునాయకులు నిజమైన సోషలిష్టు విప్లవానికి ఎంతవ్యతిరేకులో సులభంగా తెలుసుకోవచ్చు.

ఇక విదేశాంగ నీతిలోనా ? బెవిన్ కపటనాటకాన్ని బలపరుస్తున్నారు. బెవిన్ ప్రచారం చేస్తోన్న "మూడవగ్రూపు" సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నారు. బెవిన్ వగైరాలు అమెరికా సామ్రాజ్యవాదంతో తాము ముడిపెట్టుకున్న రాజకీయ సంబంధాన్ని కప్పిపుచ్చుకోడానికి ఈ మూడవ గ్రూపు సిద్ధాంతాన్ని ఒక ముసుగుగా ఉపయోగించుకో జూస్తున్నారు.

సోషలిస్టులు తమ పాలసీ ప్రకటనలో అమెరికా సామ్రాజ్యవాదాన్ని గురించిన ఊసే ఎత్తుకోలేదు. ఇది వారు బుద్ధిపూర్వకంగా చేసినపనే. దీన్నిబట్టి వారు అమెరికా అడుగు బాటల్లో నడుస్తారని స్పష్టమవుతోంది.

రెండు శిబిరాలకు - ప్రజాశిబిరానికీ, సామ్రాజ్యవాద శిబిరానికీ-మధ్య ఘర్షణవుంది, అని విస్పష్టంగా చెప్పేదానికి బదులు సోషలిస్టులు, రష్యాకీ, మిత్రరాజ్యసమితిలోవున్న తది

తర దేశాలకీ మధ్యఘర్షణ వున్నట్లు చెబుతున్నారు. ఈవిధంగా చెప్పి అమెరికా సామ్రాజ్యవాదాన్నీ, దాని ప్రజాతంత్ర వ్యతిరేకతనూ, సోషలిస్టుప్రభుత్వంపై అది సాగిస్తున్న కుట్రినూ కప్పిపుచ్చుతున్నారు.

ప్రధానంగా ఈనాడు అభివృద్ధిచెందిన దేశాలకూ వెనుకబడిన దేశాలకూ మధ్య వైరుధ్యంఉంది అంటూ పెట్టుబడిదారీ విధానానికీ, కార్మికవర్గానికీ మధ్యవున్న వైరుధ్యం యొక్క ప్రాముఖ్యతను మరుగుపరచడానికి ప్రయత్నించుతున్నారు. ఈ కొత్త 'చిట్కా'తో బూర్జువాజాతీయతను రెచ్చగొట్టాలనుకుంటున్నారు. వెనకబడిన దేశాల పోరాటం ప్రపంచపెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిగే ప్రపంచ సోషలిస్టు పోరాటంలో ఒక భాగమే అనే సత్యాన్ని మరుగుపరుస్తున్నారు.

సోషలిస్టులు చెప్పుతూన్న ఈ కొత్తసిద్ధాంతం వారి నెక్కడికి తీసుకుపోతూంది? వెనుకబడిన దేశాల్లో ఉన్న సోషలిస్టులు ప్రధానంగా జాతీయవాదులుగా ఉండాలనే సిద్ధాంతానికీ, అంటే జాతీయత అనే పేరుతో సామ్రాజ్యవాదులతో అన్నివిధాలా చేతులు కలపడాన్ని సమర్థించుకోడానికి దారితీస్తుంది.

సోషలిస్టుపదజాలం చాటున సోషలిస్టుపార్టీనాయకత్వం తమ పార్టీని సామ్రాజ్యవాదులతో, బూర్జువావర్గంతో చేతులు కలిపే పార్టీగా మార్చడానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ నాయకుల తప్పుడు సిద్ధాంతాల గుట్టును బట్టబయలు చేసేట్లు పోరాడి వీరి అసలు రంగు సోషలిస్టుపార్టీ

అనుయాయు లందరికీ స్పష్టంగా కనపడేటట్లు చెయ్యాలి.

ఈ కార్యక్రమాన్ని అంతా సోషలిస్టుపార్టీ అను యాయులు అంగీకరించరు. సోషలిస్టుపార్టీ రాజకీయ ఐక్యత గల పార్టీ కాదు.

ఇందులో వివిధదృక్పధాలు కలిగినవారున్నారు. సోష లిస్టుపార్టీ అనుయాయుల నాకర్షించడంలో ఈ విషయాలను గమనించాలి.

సోషలిస్టుపార్టీ నాయకత్వంయొక్క సిద్ధాంతాలను ఎదుర్కొని ఖరాఖండిగా సిద్ధాంతపోరాటం సాగించాలి. సోష లిస్టుపార్టీ అనుయాయులు చాలామంది, మార్క్సిజాన్ని అంగీకరిస్తారు. కాబట్టి ఆ ప్రాతిపదికమీాదనే నేటిసమస్య నన్వ యించి వారిని ఆకర్షించాలి.

అనుయాయులు పూర్తిగా ఒత్తిడిచేయడంవల్లగానీ అనుయాయులే ముందుకు రావడంవల్లగానీ సంయుక్తసంఘ టన ఏర్పడాలి. అంతేకాని సోషలిస్టుపార్టీ నాయకులు తమంత తామే సంయుక్తసంఘటన అంగీకరిస్తారని మనం లేనిపోని భ్రమలు పెట్టుకోగూడదు.

## ప్రజాస్వామ్య విప్లవానికి కార్యక్రమం

ప్రజాతంత్ర సంఘటనయొక్క, అతివాదపార్టీలయొక్క కార్యక్రమంలో ఈ క్రిందివిషయా లుండాలి.

(1) బ్రిటీషుసామ్రాజ్యవాదంతో పూర్తిగా సంబంధం వదలుకోవాలి. నిజమైన సంపూర్ణ స్వాతంత్ర్యమే లక్ష్యంగా వుండాలి.

(2) ప్రజావాంఛలకే ప్రాతినిధ్యం వహించునట్టి ప్రజా

తంత్ర ప్రభుత్వం ఏర్పడాలి బ్రిటీషు, అమెరికా సామ్రాజ్య వాదులతో పొత్తుగల వర్గాన్ని నిరోధించాలి.

(3) వయోజన ఓటింగు, దామాషాపద్ధతులపై రాజ్యాంగ నిర్మాణం జరగాలి. ప్రతి మానవునికీ స్వేచ్ఛనూ, ప్రజాతంత్ర హక్కులనూ గ్యారంటీచేయాలి. కష్టజీవులైన ప్రజలందరియొక్క ప్రాథమిక, ఆర్థిక హక్కులకు హామీ ఉండాలి.

(4) విడిపోయే అధికారంతోసహా ప్రతిజాతికీ స్వయం నిర్ణయహక్కు ఉండాలి. స్వతంత్ర భాషాప్రయుక్త రాష్ట్రాలతో అన్నిజాతులూ ఐచ్ఛికంగా కలసిన ఇండియన్ యూనియన్ ఏర్పడాలి.

(5) మైనారిటీలకు రాజ్యాంగంలో న్యాయసమ్మతమైన ప్రజాతంత్ర హక్కులన్నీ పొందుపరచాలి. మైనారిటీల భాషాసంస్కృతులకు సమానమైన గ్యారంటీ వుండాలి. జాతి, కుల, మత వివక్షతలకు సంబంధించిన ప్రత్యేక ప్రయోజనాలుగాని, నిర్బంధాలుగాని రద్దుచేయాలి. దీనిని ధిక్కరించినవారు శిక్షించబడేట్లు చట్టంచేయాలి.

(6) సంస్థానాధిపతులను అధికారంనుంచి తొలగించి ఫ్యూడల్ పరిపాలనను రద్దుచేసి సంస్థానాలలో సంపూర్ణమైన ప్రజాతంత్రాన్ని స్థాపించాలి. ఇక కాశ్మీర్ విషయంలో— ఇండియా పాకిస్థాను ప్రభుత్వాలు కాశ్మీర్ మహాఘనవిజయంగా డబ్బాకొట్టుకోడంలోవున్న కుటిలనీతిని వెల్లడిచేయాలి. సంస్థానాలలో ప్రభువులను, మధ్యయుగపు నిరంకుశ పరిపాలనను అంతంచేసి, సంపూర్ణమైన ప్రజాతంత్రపరిపాలనను నెలకొల్ప

డమే, తక్షణమే జరగవలసిన కర్తవ్యమని ప్రజాసామాన్యానికి నచ్చేట్లు ప్రబోధించాలి. యీ లోపల యే ఆక్సెషన్ జరిగినా అది సంస్థానప్రభువుల క్రిందనేకాక ఇండియన్ యూనియన్ బూర్జువా పరిపాలకులక్రిందగూడా దాస్యమే అవుతుంది. సంస్థానప్రజలు సంపూర్ణంగా స్వతంత్రులైన తరవాతనే వారికి ఆక్సెషన్ విషయమై స్వేచ్ఛలభించుతుంది. అప్పుడు ఆసమస్య ప్రజాభిప్రాయంప్రకారం నిర్ణయింపబడుతుంది.

(7) కొండజాతులవారికీ వెనుకబడియున్న జాతులకూ ఆర్థికసాంస్కృతిక రాజకీయ నిర్బంధంనుంచి సంపూర్ణంగా విముక్తి చేకూర్చాలి. పూర్తి ప్రజాతంత్రహక్కులను కలుగ జేయడం, అభివృద్ధిచెందిన మిగిలిన జాతులతో సరిసమానంగా తూగిరావడానికి అవసరమైన, తగినంత ప్రభుత్వ సహాయం తక్షణంకలుగజేయాలి. ఒక రాష్ట్రంలో, అవిచ్ఛిన్నంగా కలసివున్న ఒక ప్రదేశంలో, కొండజాతులు అత్యధిక సంఖ్యాకులుగా వుండేచోట ప్రాంతీయ స్వపరిపాలన యేర్పాటుచేసుకొనే అధికారా లుండాలి. అలాంటిప్రాంతపు ప్రజలు తగిన వీల్లుంటె ప్రత్యేకరాష్ట్రంగా యేర్పాటుచేసుకునే హక్కులుండాలి. అలాంటిరాష్ట్రాలకు అక్కడి ప్రజాభిప్రాయం కోరేట్టయితే కేంద్రంనుంచి విడిపోయే హక్కు ఉండాలి.

(8) ఇండియన్ యూనియన్ పాకిస్తానులమధ్య కష్టజీవులైన ప్రజల ప్రయోజనాల కనుగుణంగా, ఆర్థికసహాకారం రక్షణకు సంబంధించిన సైనిక రాజకీయసంబంధాలు ఉండాలి. ఆంగ్లో, అమెరికన్ కూటమి కివ్యతిరేకంగా ప్రజాతంత్ర ప్రభుత్వాల సహాకారంతో ప్రజాతంత్రయుతమైన విదేశాంగ విధాన

మమలుపరచడానికి యీసంబంధాలు తోడ్పడేవిగా వుండాలి.

(9) ఎటువంటి నష్టపరిహారమూ చెల్లించకుండా భూస్వామ్యవిధానాన్ని రద్దుచేసి దున్నేవారికే భూమినివ్వాలి. జమీందారులయొక్క సేద్యంచేయని భూస్వాములయొక్క స్వంత కమతాలను స్వాధీనపరచుకొని కౌలుదార్లకూ పాలేర్లకూ, ఆభూములపై హక్కు కలిగించాలి. రైతురుణాన్ని, వడ్డీ వ్యాపారాన్ని రద్దుచేయాలి. వ్యవసాయకూలీలకు జీవనం గడిచే జీతాలు గ్యారంటీ చేయాలి.

(10) బ్రిటీషు పెట్టుబడిదారులకు చెందిన బ్యాంకులు, పరిశ్రమలు, రవాణాసాధనాలు, తేయాకు వగైరా తోటలూ, గనులూ మొదలైనవి ప్రభుత్వవశం చేసుకోవాలి.

(11) ప్రధానపరిశ్రమల నన్నింటినీ ప్రభుత్వపరంచేసి వాటిమీద కార్మికవర్గ యాజమాన్యం నెలకొల్పాలి. జీవనానికి సరిపడే జీతాలూ, రోజుకు ఎనిమిదిగంటలపనీ మొదలైనవి సమకూర్చాలి.

(12) భారతదేశంలోనున్న సహజసంపదల నభివృద్ధి చేయడానికి సమగ్రమైన ఆర్ధిక ప్రణాళికను తయారుచేయడం, ఆర్ధికవిధానంలో కీలకస్థానాలనుంచి పెద్దపెట్టుబడిదారుల పెత్తనం తొలగించడం, వ్యక్తులచేతుల్లోవున్న పరిశ్రమల లాభాలపై కంట్రోలు వుంచడం జరగాలి.

(13) నిర్బంధచట్టాలన్నీ రద్దుచెయ్యాలి.

(14) ప్రభుత్వంలోని నిరంకుశపరిపాలనావిధానాన్ని రూపుమాపాలి. ఎన్నుకోబడిన ఉద్యోగులు ప్రజల కమిటీల

అజమాయిషీతో పనిచేసేట్టు ప్రజాతంత్రపరిపాలనా పద్ధతులు ప్రవేశ పెట్టాలి.

(15) ప్రజలకు ఆయుధా లివ్వాలి. ప్రజాతంత్రపద్ధతులపై సైన్యనిర్మాణం జరగాలి.

(16) ఉచితవిద్యను పొందే హక్కు, నిర్బంధప్రాథమికవిద్యా ఉండాలి.

(17) పురుషులతోపాటు స్త్రీలకుగూడా సమానమైన ప్రజాతంత్ర హక్కు లుండాలి.

ప్రజాతంత్రసంఘటనా, కమ్యూనిస్టుపార్టీలు, ప్రజాద్రోహులైన మతోన్మాదులను, మతకలహకారకులను, ఇండియా పాకిస్థాన్‌లమధ్య యుద్ధం ప్రేరేపించేవారినీ తీవ్రంగా ఎదిరించి పోరాడుతాయి. హిందూ లేక ముస్లిం సంస్కృతిరక్షణ పేరుపెట్టి వాళ్లు చేసే దుష్టప్రచారాన్ని ఖండిస్తాయి. శాంతి సేనలను గుర్తిస్తాయి. మతకలహనివారణకు పనిచేసేవారందరితో సహకరిస్తాయి. మతకలహాల నణచడానికి, ప్రభుత్వం చేసే కృషిని బలపరుస్తూనే, జాతీయనాయకు లవలంబించే రాజీధోరణి ఏవిధంగా మతకలహవ్యాప్తికి దారి తీస్తున్నదో కూడా వివరిస్తాయి. వీటి వెనుక నున్న పెట్టుబడిదారుల కుట్రను విచ్ఛిన్నం చేయటానికి ప్రజలను సమీకరిస్తాయి. అభివృద్ధి నిరోధక జమీందారీ వర్గాన్ని ప్రోత్సహించే ప్రభుత్వ సభ్యుల మతోద్రేక చర్యల్నిగూడా ఎప్పటికప్పుడు ఖండిస్తూ ఉంటాయి.

పై నుదహరించిన కార్యక్రమం అంతటితోనూ సంపూర్ణంగా ఏకీభవించిన వారితోనే ప్రజాతంత్ర సంఘటనను

ప్రారంభించవలసిన అవసరం లేదు. కొన్నికొన్ని ప్రత్యేక సమస్యలమీద మొదట కలిసి, సంయుక్త కార్యాచరణ ప్రారంభించవచ్చును. సంయుక్త కార్యాచరణ అభివృద్ధి చెందిన కొలదీ పై కార్యక్రమం యెంతశిరిష్టమైనదో ప్రతిప్రజాస్వామ్యవాదికీ స్వయంగానే బోధపడుతుంది. అతివాదులకూ, ప్రజాసామాన్యానికీ అందరికి స్వానుభవం ద్వారానే ప్రజాతంత్ర సంఘటన కార్యక్రమం ఎంత అభ్యుదయకరమైనదో స్పష్టంగా అవగాహన అవుతుంది.

## ప్రజాతంత్ర విప్లవ పోరాటంలో పార్టీ బాధ్యతలు

ప్రజాతంత్ర విప్లవ ఆశయాలేమిటి ? మన ప్రజా సామాన్యానికి స్వాతంత్ర్యం, అభ్యుదయం కలగాలంటే మన సాంఘిక, రాజకీయ వ్యవస్థలో యేముఖ్యమైన మార్పులు తీసుకు రావాలో, ఆ మార్పులను తీసుకురావడమే. ప్రస్తుత ప్రభుత్వం స్థానే కార్మికులూ, రైతులూ, పీడితులైన మధ్యతరగతులు సాగించే సంపూర్ణ ప్రజాతంత్ర ప్రభుత్వం స్థాపించాలి. ప్రస్తుత నిరంకుశ పరిపాలనావిధానం రద్దుచేయబడుతుంది. దానిస్థానే ప్రజలచే ఎన్నుకోబడిన ఉద్యోగులు, ఆ ప్రజల కమిటీల అజమాయిషీక్రింద పరిపాలన సాగిస్తారు. ఈ ఉద్యోగులను పదవులనుంచి తొలగించే అధికారం ప్రజలది. భూస్వామ్యవిధానం రద్దుచేయబడుతుంది. భూమి దున్నేవారికే యివ్వబడుతుంది. పెద్ద బ్యాంకులూ, ఫ్యాక్టరీల నన్నిటినీ ప్రభుత్వం వశంచేసుకొని ప్రజాప్రయోజనాల కనుగుణ్యంగా నడుపుతుంది. ఇప్పటివలె కొద్దిమంది లాభాలకొరకు నడుప బడవు. నిరంకుశ సంస్థానాధిపతులు తొలగింపబడుతారు.

సంస్థాన ప్రజలకు, మధ్యయుగపు బానిసత్వంనుంచి, పెట్టుబడి దారీ సంకెళ్ళనుంచీ విముక్తి కలిగించబడుతుంది.

ఈ మార్పుల పునాదిమీద మన ప్రజలకు సంతోష కరమైన, అభ్యుదయకరమైన జీవనం కలిగించే సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు నాందీప్రస్తావన జరుగుతుంది.

కమ్యూనిస్టుపార్టీ యీ ఆశయాలకొరకు నిరంతరం కృషిచేయాలి. కమ్యూనిస్టుపార్టీ సూచించే ఉజ్వల భవిష్యత్తును ప్రజాతంత్రోద్యమం యీవత్తూ చూడగలిగేటట్లు చేయాలి. ఈ ఆశయసాధనకొరకు సాగే ఏకైకసమరం భాగమై లీనమైపోయేట్లు కార్మిక, కర్షక పీడిత ప్రజాసామాన్యంయొక్క పోరాటాలను నాయకత్వం వహించి నడిపి అభివృద్ధిచేయటం పార్టీయొక్క బాధ్యత.

## కార్మికరంగంలో బాధ్యతలు

ఈ మధ్యజరిగిన పోరాటాలలో పార్టీనాయకత్వాన శ్రామికవర్గం అద్భుతమైన పాత్రను నిర్వహించింది. నేడు ఆర్థిక దుస్థితియొక్క ప్రమాదంతో శ్రామికవర్గం మీదనే దాడి ప్రారంభమైంది, (కోయంబత్తూరు, కాన్పూరు, బొంబాయి ఫోర్టుట్రస్టు, ట్రాంవే కార్మికులు మొదలైనవారు). కోయంబత్తూరు, కాన్పూరులలో అప్పుడే పెద్దపోరాటాలు ప్రారంభమై సాగుతూన్నాయి.

సమ్మెలతరంగం అంతకంతకీ విజృంభిస్తోంది. నిర్బంధాలు దానిని నిరోధించలేకున్నాయి. ఆర్థిక దుస్థితియొక్క వొత్తిడివలన అటు ప్రభుత్వమూ, ఇటు పెట్టుబడిదారులూ జీతాలు తెగగోయడానికి విపరీతంగా ప్రయత్నిస్తున్నారు.

దుస్థితిని కార్మికుల భుజాని కెత్తి తాము తప్పించుకుపోవాలని వారిఎత్తు. కార్మికులను తగ్గించివెయ్యడం- నిరుద్యోగము కల్పించడం, కరువుభత్యాలు కోసెయ్యడం, జీతాలు తగ్గించడం, పనిగంటలు పెంచడం, కార్మికుల నెత్తిగొట్టి పెట్టుబడిదారులకు సహాయపడడానికై జాతీయప్రభుత్వం తొక్కుతూవున్న పద్ధతు లివి.

"పారిశ్రామిక యుద్ధవిరామం" (ఇండస్ట్రియల్ ట్రూస్) సమావేశం అన్నది కార్మికవర్గం మీద చేసిన బహిరంగ యుద్ధ ప్రకటన తప్ప వేరుకాదు. సిగ్గు బిడియాలు లేకుండా, ఆ సమావేశంలో పెట్టుబడిదార్లకు అయిదేళ్ళవరకూ పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడమనేది వుండదని హామీ యిచ్చారు. కార్మికునికి జీవితావసరమైన జీతం యివ్వవలసివుంటుందనే విషయాన్ని వారు అంగీకరించ నిరాకరించారు. వుచితమైన తగుపాటి జీతం, లాభాలువారి దృష్టిలో సమానమేనట. దాని అర్థం ఏమిటి? కూలివాడికి తగుపాటి జీతం రావడం, పెట్టుబడిదారుకు తగుపాటి లాభాలు రావటం ఒకటేననేకదా? పరిశ్రమలలో పనిచేసేవారికి అవసరమైన వీళ్ళు కల్పించేటందుకు ఆ సభలో వాగ్దానంమాత్రం జరిగింది. మధ్యవర్తిత్వంద్వారా పారిశ్రామిక శాంతి నెలకొల్పడం పేరుతో సమ్మెలను చట్టవిరుద్ధమైనవిగా ప్రకటించడానికి అవకాశాలు కల్పించారు.

దీని పర్యవసానం ఒక్కటే: కార్మికవర్గం యొక్క స్థితిగతులపై తీవ్రమైన దాడిని ప్రారంభిస్తారు. కార్మికవర్గం యొక్క ప్రతిఘటనను అణచివేయడానికై ప్రభుత్వం సర్వ

శక్తులూ వినియోగిస్తుంది. అంతేకాదు : ఇకముందు మధ్యవర్తిత్వానికి నియమించబడిన వుద్యోగులూ, కోర్టులూ కార్మిక వర్గాన్ని ఇబ్బందిపెట్టడానికి వుపయోగించబడతాయి. వారి కోరికలను నిరాకరించడానికీ, ఇదివరకు సాధించిన హక్కులను రద్దుచేయడానికీ, సమ్మెలను చట్టవిరుద్ధములనేటందుకుమార్గాలు వెదకడానికీ, పనిముట్లుగా వుపయోగించ బడతాయి.

అందుచేత, భవిష్యత్తులో పరిశ్రమలలో పరిస్థితులు అంతకంతకు అధ్వాన్నమౌతాయి. కార్మికులపై అన్నివిధాలా నిర్బంధాలు వుపయోగించబడతాయి. కార్మికుల పోరాటాన్ని తప్పుగా చిత్రించడానికి అన్ని ప్రయత్నాలూ చేస్తారు. ఈ దాడిని ఓడించడానికి కార్మికవర్గం తన శక్తినంతనూ కూడ దీసుకోవలసి వస్తుంది.

## కార్మిక రంగంలో మన బాధ్యతలు

ఈ దాడిని ఎదుర్కోవలసిన భారమంతా ట్రేడ్‌యూనియన్ రంగంమీాద పడుతుంది. శ్రామికవర్గం యొక్క శక్తినుపయోగించి ఈదాడిని ఓడించాలి. ఆ పోరాటంలో శ్రామిక వర్గం యొక్క హక్కులను, కోరికలను బహుపట్టుదలతో రక్షించుకోవాలి. జాతీయప్రభుత్వం ప్రజల సానుభూతిని సంపాదించుకోడానికీ, వారి తాటస్థ్యాన్ని వుపయోగించుకోటానికీ ప్రయత్నిస్తుంది.

జాతీయ ప్రభుత్వం, జాతీయ నాయకులు దేశపునర్నిర్మాణం పేరుచెప్పి ప్రజలను జోకొడతారు. ఆ పేరుతో శ్రామికవర్గంమీాద ఆర్థికంగా దాడిని ప్రారంభిస్తారు. సరుకులు తక్కువగా వుండడాన్ని ధర లెక్కువగా వినియోగించుకొని,

సరుకులుతక్కువ కావడానికి కార్మికుల సమ్మెలే కారణమని చూపి స్తారు. సమ్మెలనునిషేధించడంద్వారానూ, తామునూచిస్తూన్న ఇతరపద్ధతులవలన అధికమైన ఉత్పత్తి జరుగుతుందనీ, అభివృద్ధి యేర్పడుతుందనీ, తమ ప్రణాళికలను ప్రజలుబలపరచాలనీచెప్పి, మధ్యతరగతుల మన స్తత్వాలనూ, అజ్ఞానాన్నీ ఉపయోగించుకో చూస్తారు. క్రమబద్ధమైన ఆర్థిక జీవితాన్ని కోరుతూ, పెట్టుబడి దారీవిధానంలోని అరాజకత్వంయెడ క్రోధంవున్న ప్రజానీ కాన్ని జాతీయప్రభుత్వమూ, బూర్జువావర్గమూ దేశ పునర్ని ర్మాణం పేరుతో ఉపయోగించుకోటానికి ప్రయత్నిస్తాయి.

దేశ పునర్నిర్మాణం పేరుతో బూర్జువావర్గం చేసే బూటక రింపులను మనం బట్టబయలు చేయాలి. ఆర్థిక దుస్థితిని కార్మికుల ప్రజల నెత్తిని రుద్దడానికి అది ఒక పర్యాయపదంమాత్రమే. పని గంటలు హెచ్చించడానికీ, జీతాలు తగ్గించడానికీ, ప్రజా నీకాన్ని నిరుద్యోగుల్ని చేయడానికీ వారు ఆ శబ్దాన్ని వుపయో గిస్తారు.

ఉత్పత్తిసాధనాలు పెట్టుబడిదారుల సొత్తు కావడం, పెట్టుబడిదారీవిధానంలో వచ్చే ఆర్థిక దుస్థితీకారణంగా ఉత్పత్తి తగ్గిపోతూందని మనం నిరూపించాలి. ఉత్పత్తిని పెంచాలంటే ఉత్పత్తిసాధనాలను ప్రభుత్వపరంచేసి, లాభాల కోసం ఉత్పత్తిచేసే పద్ధతిని రద్దుచేయాలని మనం స్పష్టపర చాలి. కేవలం లాభాలు దండుకునేందుకే బూర్జువావర్గం ప్రారంభించిన ఈ పునర్నిర్మాణప్రణాళికలో ప్రజలు భాగ స్వాములు కారాదని మనం హెచ్చరించాలి.

పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానం ఎల్లావున్నదల్లాగే

వుండగా, లాభాలను ముట్టుకోకుండా వదిలిపెట్టే ఉత్పత్తి ప్రణాళికలను తయారుచేయడంలో మనంకూడా సిద్ధం కాకూడదు. పెట్టుబడిదారులయొక్క ప్రభుత్వంయొక్క విధానంవలన ఉత్పత్తితగ్గుతుందేగానీ, హెచ్చదని మనం చూపించాలి. పెట్టుబడిదారులప్రణాళిక ఆర్థికదుస్థితికి దారితీస్తుంది, ఉత్పత్తి ఒక్కపెట్టున పడిపోతుంది.

పరిశ్రమలను జాతీయం చేయకుండా, వలసరాజ్య విధానాన్ని నిర్మూలించకుండా, ప్రజాతంత్ర విప్లవకార్యక్రమ ప్రణాళిక నమలుజరపకుండా, కార్మికులకు జీవితానికిసరిపడే జీతాలివ్వకుండా జాతీయ పునర్నిర్మాణం అనేది లేనేలేదని మనం స్పష్టపరచాలి.

పెట్టుబడిదారులు సాగిస్తున్న విశేషమైన ప్రచారానికి లోబడిపోయి కొందరు భ్రమ పడుతున్నారు. దేశపునర్నిర్మాణం సాగాలంటే పరిశ్రమలను ప్రభుత్వపరం చేయాలనీ, కార్మికులకు జీవితావసరములైన జీతాలివ్వాలనీ చెప్పడానికి సిగ్గుపడుతున్నారు. ఆర్థికకోరిక మరీ అస్పష్టంగావుందనీ వూహించుతున్నారు. ఈసూచనలు ఎంతస్పష్టంగా వున్నాయో, ఎంత ఆచరణయోగ్యంగా వున్నాయోకూడా వూహించలేనంత నిరుత్సాహానికి వారు లోబడిపోతున్నారు. సాంఘికవ్యవస్థను మార్చి, ఉత్పత్తిని పునర్నిర్మాణం చేయడానికి ఇవి తప్ప మరోమార్గాలే లేవనేసంగతిని మరచిపోతున్నారు. ప్రజాతంత్ర విప్లవం అన్నది ~~ఎప్పుడో~~ ఎప్పుడో వస్తుందనుకునే వారూ, దానికై యిప్పుడు పోరాటం జరపాలనే విశ్వాసం లేనివారూ, బూర్జువావర్గం 'ఆచరణయోగ్యత'ను గురించి

చెప్పే వాదనలనే వల్లించేవారూ మన తక్షణ కార్యక్రమం చూసి గాభరాబడతారు.

తమ జీవనవ్యయ ప్రమాణాన్ని నిలుపుకునేటందుకై తీవ్రమైన పోరాటంలో చిక్కుకొనివున్న కార్మికవర్గాన్ని, పెట్టుబడిదారీ ప్రణాళికల ప్రకారం అధికంగా ఉత్పత్తిచేయమని చెప్పడం, ధనికవర్గంకోసం శ్రామికుడు బలికావాలనడం తప్ప వేరుకాదు. ఈ మార్గాన్ని అవలంబించేవారు పెట్టుబడిదారుల ప్రచారానికి లోబడిపోయారని చెప్పాలి. మనం పెట్టుబడిదారుల ఎత్తులను బట్టబయలుచేసి, నగ్నరూపములో కనబరచాలి. కార్మికులపై చేసే దాడులను ప్రతిఘటించాలి. పరిశ్రమలను ప్రభుత్వపరంచేయాలని, లాభాలను అదుపులో వుంచాలని, జీవనావసరమైన జీతాలివ్వాలని మనం ధైర్యంగా ముందుకువచ్చి చెప్పాలి. ఉత్పత్తిని నిర్మాణయుతంగా సాగించడానికి ఈ కార్యక్రమం అవసరమని మనం ముందుపెట్టాలి. పరిశ్రమలను ప్రభుత్వపరంచేయడం మొదలైన సూచనలు అస్పష్టమైనవని భావించే పద్ధతిని నిరంతరం ఎదుర్కోవాలి.

ట్రేడ్ యూనియన్లూ, పార్టీ కూడా శ్రామికవర్గం యొక్క హక్కులరక్షణకై తీవ్రమైనపోరాటం సాగించాలి. ఆ పోరాటంవలన కార్మికవర్గం విజయం పొందగలగడమే గాకుండా, ఇతర వర్గాలనుకూడా ప్రోత్సాహపరచేటంత విజయవంతంగా దానిని కొనసాగించాలి. బూర్జువావర్గాన్ని ఎదిరించి విజయం పొందగలమనే విశ్వాసం మధ్యతరగతివారిలోనూ, రైతాంగంలోనూ కలిగేలాగ పోరాటంసాగించాలి. ఈ పోరాటాలలో కార్మికవర్గంఅంతాఏకైక ప్రజాసంస్థలలోనికి

వచ్చేలాగ ఐక్యపరచాలి. అవి రాజకీయంగా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంక్రిందకు వచ్చేలాగా నడిపించాలి. నూతన వర్గ సంకలనరూపమై, నూతనవర్గ సమైక్యతా రూపమై, నూతనప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నిర్మించడానికి అత్యవసరమైన నూతన ప్రజాతంత్ర సంఘటనను నిర్మించేందుకు, అలాంటి పోరాటాలు బలమైన దోహద మిస్తాయి.

కార్మికవర్గము, ఈనాడు, ఏటికేకోటికి అనేకవిధాల లాగబడుతున్నారు. కొందరు ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసువైపుకు, కొందరు సోషలిస్టుపార్టీ వైపుకూ, మరికొందరు జాతీయప్రభుత్వవైఖరి కల్పించే ఊకమకల్లోకి, ఈలా అనేకవైపులకు లాగబడుతున్నారు. ఈలాంటి పరిస్థితుల్లో, ఇదివరకుకన్నా ఎక్కువగా ఈనాడు ప్రజాపోరాటంలో ఐక్యతను సాధించాలి. ఈ ఐక్యత పోరాటానికి ముందే సమకూడ వచ్చును. లేదా పోరాటాలు జరుగుతూండగా ఏర్పడవచ్చును. కాని ఐక్యతకొరకు సర్వవిధాలా ప్రయత్నించాలి. నానాటికీ తీవ్రతరమౌతున్న ఆర్థికసంక్షోభపుపరిస్థితుల్లో రాబోయే పోరాటాలవల్ల కార్మికవర్గంలో ఐక్యత సాధించగలము, సాధించాలికూడా. కారణం సంక్షోభపు తాకిడి కార్మికవర్గంలోని అన్నిశాఖలకూ వుంటుంది. అందువల్ల యజమానుల ప్రతిఘటించే సమిష్టిసంఘటనలోకి అన్నిశాఖల కార్మికులనూ తీసుకురావడానికి వీలుంటుంది. అలాంటి సమిష్టిపోరాటాలు మితవాద ట్రేడ్‌యూనియన్ నాయకుల విద్రోహపాత్రను గురించి విప్లవ కార్మికవర్గం ఏకము కావలసిన అవసరాన్ని గురించి, కార్మిక వర్గం ఉత్తమమైన గుణపాఠాలు నేర్చుకునే అవకాశం కల్పి

స్తాయి. లేదా పోరాటకాలంలో ఏర్పడనూవచ్చు. కాని, శ్రామికవర్గం జరిపే పోరాటాలు విజయవంతం కావాలంటే ఐక్యతనుసాధించ సర్వవిధాలా ప్రయత్నించాలి.

జాతీయప్రభుత్వము, బూర్జువావర్గమూ ప్రజలలోచేసే కుటిలప్రచారాన్ని ఎదుర్కోవాలి. ప్రజల సానుభూతిని సంపాదించాలి శ్రామికపోరాటాలను ప్రజలకు దూరంచేసి, అణచి వేసేటందుకు అవకాశం ఇవ్వరాదు. నేడు మధ్యతరగతి ప్రజలలో కూడా సమ్మెల కనుకూలమైన అభిప్రాయాలు బలంగా వున్నాయి. ఏమంటే తమకోరికల కొరకై సమ్మెచేయడం వారికీ తప్పడం లేదు. ప్రజల సానుభూతి సంపాదించడానికి ఇదొక పెద్ద అవకాశం. కలకత్తాలో ట్రాంవే పనివారి సమ్మెనుబలపరుస్తూ గుమాస్తాలుచేసిన సానుభూతి ప్రదర్శనాల వేపు గమనిస్తే ప్రజాసానుభూతి ఎంతగా సహకరిస్తుందో అర్థం చేసుకోవచ్చును.

కార్మికవర్గంలో ఐక్యత సమకూర్చడంలో హిందూ ముస్లిం పనివారిని జతకూర్చి మతోన్మాదులను నిర్మూలించడం మనం ముఖ్యంగా పెట్టుకోవాలి అల్పసంఖ్యాకులకు రక్షణ యివ్వడంలో మన ట్రేడ్ యూనియన్‌లు ప్రముఖపాత్ర వహించేలాగా చూడాలి. తనయెడ అల్పసంఖ్యాకుల యెడ శ్రామికవర్గం తనకుగల బాధ్యతను గుర్తించేలాగ చేయాలి. తమలో తాము మత సంబంధమైన అడ్డంకులను తొలగద్రోసుకొని, శ్రామికవర్గం అంతాకలసి అల్పసంఖ్యాకుల ప్రజాతంత్ర హక్కులకొరకై పోరాడాలి. ~~అల్పసంఖ్యాకుల్ని~~ పీడించేవారిని తరిమికొట్టడంలో ప్రాధాన్యత వహించాలి. ఇందులో ఏ మాత్రం అశ్రద్ధ జరిగినా ట్రేడ్ యూనియను పోరాటమూ

ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యసాధనకై చేసే పోరాటాలూ విఫలం అయిపోతాయని మనం శ్రామికవర్గాన్ని గట్టిగా హెచ్చరించాలి.

శ్రామికవర్గంలో మనం బలపడుతూ వుండడం చూసి భయపడి, సమ్మెపోరాటాలకు అదిరిపోయి, నిర్బంధాల వలన శ్రామికవర్గాన్ని అణచలేమని గ్రహించి జాతీయబూర్జువా నాయకత్వం సర్దార్ పటేల్ ప్రోత్సాహంతో శ్రామిక వర్గాన్ని చీలదీయాలని జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును ప్రారంభించారు. శ్రామిక వర్గాన్ని చీలదీయడం, మధ్యతరగతుల వారి మనస్సులను తికమకచేయడం, శ్రామికవర్గపోరాటాలను నిందలతో ముంచెత్తడం వారి ఈపనిలోని వుద్దేశ్యం. క్రమ క్రమంగా జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రభుత్వం చేతిపనిముట్టనే విషయం అందరికీ తెలిసివస్తుంది. శ్రామిక వర్గోద్యమాన్ని విచ్ఛిన్నంచేసి, అధికారంలోవున్న బూర్జువా వర్గంయొక్క పబ్బం గడపడానికి ఉపయోగపడేటందుకై ప్రభుత్వంలోని బూర్జువావర్గంచేతిలోని పనిముట్టుగావుండే రంగమనే విషయం అందరూ గ్రహిస్తున్నారు.

సమ్మెలకు, కమ్యూనిస్టులకు, కార్మికవర్గానికి వ్యతిరేకంగా పనిచేయడమే, ఈసంస్థ చేయవలసినపని. ఇది అవలంబించవలసిన విధానాన్ని నిర్ణయించేది జాతీయనాయకులు. స్పష్టంగా చెప్పాలంటే, బూర్జువావర్గం, దీనికర్తవ్యాలను నిర్దేశిస్తూ వుంటుంది. ప్రతిసమ్మెలోనూ, కార్మికవర్గం సాగించే ప్రతి స్వతంత్ర పోరాటంలోను, జాతీయ ప్రభుత్వం చేతిలోని రహస్యపుపనిముట్టులాగా ఇదిపనిచేస్తుంది. కార్మికుల్ని భయ

భీతుల్ని చేయడానికై, దొంగకూలీలను, గూండాలను, వీనిలోకి సమీకరించి వుంచుతారు. ఇది పోలీసులతోనూ, యజమానులతోనూ, సహకరించి పనిచేస్తుంది. వారి గూఢచారిగా వ్యవహరిస్తుంది. అంతర్జాతీయ కార్మిక సమావేశాలలో, ఇండియా కార్మికవర్గానికి ప్రాతినిధ్యం వహించేటందుకై, అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును త్రోసి రాజనిపించేటందుకు దీనిని తయ్యారీ తినిపిస్తున్నారు.

జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు ఎక్కడైనా పలుకుబడి వచ్చిదంటే అది కాంగ్రెసు ద్వారామాత్రమే. కాని అది అతివేగంగా, అప్రతిష్టపాలయిపోతుంది. ఏవో కొద్ది చోట్లతప్ప, దానికి ప్రజాబలంలేదు. అది ఇతర ప్రదేశాలలో దుష్కీర్తి పాలయినకొద్దీ అంతకంతకు హెచ్చుగా, మేస్త్రీలు, మొదలయిన పెద్దజీతగాళ్ళమీదఅంటే ఫ్యాక్టరీఉద్యోగులు, డబ్బిచ్చి పోషిస్తున్న తొత్తులమీద ఆధారపడుతుంది. వీరు జాతీయ యూనియన్‌కు చందాకట్టమని కార్మికులను బెదరిస్తూ వుంటారు. కట్టకుండా వ్యతిరేకించినవారిని, పనులనుండి తొలగించమని, యజమానులకు సలహాయిస్తూవుంటారు. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సంస్కరణ వాదులచేతిలోని, సర్వసాధారణమైన ట్రేడ్ యూనియన్ కానేకాదు. హిట్లర్ స్థాపించిన, లేబర్ ఫ్రెంట్ మాదిరిగా తయారవుతోంది. ఈమధ్య కలకత్తాసమ్మెలో అదిచేసిన పనులు, పనివారిని బెదరించడం, గుండాలసహాయంతో వారిని కొట్టడం, మొదలైనవే. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు చేయగలపని, చేసేపనీనూ. కార్మికులు దాని దాడుల్ని ప్రతిచోటా

త్రిప్పికొట్టేవరకు దానినే ఉపయోగిస్తూ వుంటారు.

జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, గూండాల సాయంతో చేస్తున్న దాడులు, దౌర్జన్యాలు కార్మికులపై చేస్తున్న హింసలు, బెదిరింపులూ చూస్తే, అది కార్మిక ప్రజను తన వేపు త్రిప్పుకోలేక పోయిందని స్పష్టమౌతుంది. దాని అసమర్థతను అదే చాటుకొంటూంది.

అందుచేత, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు చెందిన యూనియనులు, చేస్తున్న పనులనుపూర్తిగా బయట పెట్టాలి. శ్రామికుల సమావేశాలన్నింటా వాటిని గురించి, తెలియ చెప్పాలి దానిమీద కార్మికులకు అసహ్యం కలిగించాలి. సమ్మెకు వ్యతిరేకంగా, వారు చేసే ప్రతిపనీ కార్మికులను బెదిరించడాన్ని, కార్మికులకు చేసే ప్రతి ద్రోహచర్యనూ బట్టబయలుచేసి, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు ప్రజాబలం లేకుండా చెయ్యాలి. ఇదివరకే వాటికి ప్రజలలో పలుకుబడి ఏర్పడి వుంటే ఆప్రదేశాలలో వారి చర్యలను, బట్టబయలు చేయడంతోపాటు ప్రత్యేకసమస్యలమీద (జీతాలు, జీవితసౌకర్యాలు మొదలయిన) కలసి పనిచేయడానికి ఆహ్వానించాలి. పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా, జరిపే పోరాటాలలో సహకరిస్తామని చెప్పాలి.

సోషలిస్టుపార్టీనాయకత్వంగూడా విచ్ఛిన్నశక్తిగా పని చేస్తుంది. అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుని, ఏకాకిగా చేసివేసే ప్రయత్నాలలో, వారు జాతీయట్రేడుయూనియనుకు తోడ్పడుతున్నారు. నిజానికి నిర్మాణయుక్తంగావున్న శ్రామికవర్గంలో ముందునిలచి పోరాడేవారంతా, అఖిల

భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసులోనే చేరారు. సోషలిస్టు పార్టీ నాయకత్వం, అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసు నుంచి విడిపోయి, అనేక ప్రదేశాలలో పోటీసంఘాలను ప్రారంభించారు. ఆ విడిపోవడంగూడా, జాతీయ ట్రేడుయూనియను పుట్టిన తరువాతనే జరిగింది. జాతీయ ట్రేడుయూనియను ప్రారంభించిన విచ్ఛిన్న పద్ధతులను వీరు కొనసాగిస్తున్నారు. తమ అనుచరుల భయంకొద్దీ వీరు జాతీయ ట్రేడుయూనియను కాంగ్రెసులో చేరలేదంటే, అలాగనే అఖిల భారత ట్రేడుయూనియను కాంగ్రెసులోనేవుండి, జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసుయొక్క విచ్ఛిన్నధోరణులిన్ని కమ్యూనిస్టులతోను, ఇతరులతోను కలసి ఎదుర్కొనేపాటి ధైర్యం వారికిలేదు. కార్మికవర్గ క్షేమాభిలాషా లేదు.

బొంబాయివంటి కొన్ని ప్రదేశాలలో, కార్మికవర్గం లోని, తమ అనుచరుల వత్తిడివలన సోషలిస్టు నాయకులు జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసును వ్యతిరేకిస్తున్నా ఆ వ్యతిరేకత తీవ్రంగా లేదు. నామమాత్రంగానేవుంది. కాని అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుయెడ వారు బద్ధవైరం ప్రదర్శిస్తున్నారు. ప్రభుత్వం ప్రారంభించిన జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసును వారు తమశత్రువుగా తలచడంలేదు. కాని స్వతంత్ర ట్రేడ్ యూనియన్ ఉద్యమంయొక్క శక్తి ఎంతనూ, కేంద్రీకరింపచేసిన అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసును శత్రువుగా ఎంచుతున్నారు. ఏవిషయంలోనూ వారు అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుతో కలసి పనిచేయడానికి ఉత్సాహించడం లేదు. కాని, "కలకత్తాలో" అఖిల

భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసులో చేరిన యూనియన్లను విచ్ఛిన్నం చేయడానికై, జాతీయట్రేడుయూనియన్ కాంగ్రెసు నాయకులతో చేతులుకలిపారు. (కలకత్తా ట్రాంవే సంఘం).

వీరి యూనియన్లకు కొన్నిచోట్ల ప్రజాబలంవుంది. సోషలిస్టు నాయకులు వాడే అతివాద శబ్దజాలం కార్మికుల్ని ఆకర్షిస్తుంది. సోషలిస్టునాయకులు, ఒకక్రొత్త కేంద్రసంస్థను ప్రారంభించి తాము తెచ్చిన విచ్ఛిన్నాన్ని గట్టిపరచుకుందామని చూస్తున్నారు. ఆవిధంగా శ్రామికవర్గాన్ని విభజించి వుంచాలని వారిఏర్పాటు. మన నాయకత్వం క్రింద వచ్చే సమ్మెలను, సోషలిస్టు నాయకత్వం నిందించి, వాటిని వ్యతిరేకిస్తుంది. మన నాయకత్వంక్రింద వున్న కార్మికవర్గంమీాద ప్రభుత్వం సాగించే నిర్బంధచర్యలకు ప్రోత్సాహమివ్వడమో హింసించడమో చేస్తుంది. తన యూనియన్లలోని పనివారిని సాధ్యమైనంతవరకు, అదిమిపెట్టి వుంచడానికి ప్రయత్నిస్తోంది.

నేడు సోషలిస్టుపార్టీ నాయకత్వం ఏమన్నా సమ్మెలు నడిపిస్తోందంటే, అది అనుచరుల వత్తిడిమూాలంగానే చేస్తుంది. సోషలిస్టుపార్టీ చేతిలోని యూనియన్లు సర్వసాధారణంగా, బాగా పనిచేస్తున్న యూనియన్లే. వానిలో చాలామంది పోరాటాలకు వెనుతీయనివారే వున్నారు. ఈ యూనియన్లు వానిలోని పనివారుచేసే పోరాటా లన్నింటిలోనూ, అవకాశం వచ్చినపుడల్లా సమిష్టి సంఘటనకు, సంసిద్ధతను ప్రకటిస్తూ వుండాలి. యూనియనులనూ, వానిలోనున్న పనివారినీ, సోషలిస్టు నాయకుల వంటివారినిగానే జమకట్టివేయరాదు.

ఇలాగని శ్రామికోద్యమములో, సోషలిస్టునాయకత్వం అవలం బిస్తున్న విచ్ఛిన్నకరపంథాను విమర్శించకుండా వుండనేరాదు.

అయిష్టంతో సోషలిస్టునాయకత్వం సమ్మెలను నామ మాత్రంగా బలపరచినపుడు, సమ్మెలను విచ్ఛిన్నం చేసినపుడు మనం వారిని విమర్శించాలి. కాని ఆ విమర్శన, కార్మికులను ఐక్యపరచేటట్లు వుండాలి. వారు అఖిలభారత ట్రేడు యూని యన్ కాంగ్రెసు తమ అందరి సంస్థగా భావించి దానివేపు ఆకర్షించబడేలాగా వుండాలి. మనం కోరే సమిష్టిసంఘటన, క్రమంగా ఒకే కేంద్రసంస్థను నిర్మించాలనే కోరికకు దారి తీయాలి. సోషలిస్టుపార్టీ యొక్క విచ్ఛిన్న ధోరణులను, ఖండించేటట్లుగా తయారవాలి.

మనం అవలంబించే, స్వతంత్రకార్యాచరణ సమ్మె పోరాటాలను, నిశ్శంకంగా నడిపించడం ట్రేడ్‌యూనియన్ల సభ్యత్వం పెంచడంతో అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుబలాన్ని హెచ్చింపచేయాలి. కార్మికవర్గంయొక్క హక్కులను రక్షించుటకై నిరంతరాయంగా పనిచేస్తున్న ఏకైక సంస్థ అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుసంస్థేననీ వారికి చూపించాలి.

అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు కార్మిక వర్గానికి ప్రతినిధిసంస్థఅనేమాట లేకుండా చేయడానికి జాతీయప్రభుత్వం తీవ్రప్రయత్నాలు చేస్తోంది. ఈ ప్రమా దాన్నిమనం కార్మికవర్గానికి తెలియచెప్పి ప్రతిఘటింపచేయాలి. దానికై అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసును బలి ష్టంగా తయారుచేయాలి. ఒకే ఒక కేంద్రసంస్థకై చేసేపోరా

టాన్ని మనం సోషలిస్టులచేతిలోని యూనియన్లకు చెందిన కార్మిక ప్రజాసామాన్యంలోనికి తీసుకొని పోలేకపోయాం. అదేగనుక మనం చేసివుంటే అది అఖిలభారత ట్రేడుయూనియన్‌నుంచి సులువుగా విడిపోడం సాధ్యమై వుండేదికాదు.

నేడు అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుకు మంచి పలుకుబడివుంది. అందుచేతనే క్రొత్తగా ఏర్పడిన, యూనియన్లు సలహాలకొరకై దానివేపు తిరుగుతున్నాయి. దానిలో వచ్చిచేరుతున్నాయి. అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు బలంగావుందంటే కార్మికవర్గం బలంగావుందన్న మాట. కేంద్రసంస్థ ఎంతబలంగావుంటే కార్మికవర్గం సాగించే జీవన్మరణసంగ్రామంలో అంత చులకనగా పోరాడి ఆర్థిక దుస్థితినీ, పెట్టుబడిదారులనూ, దాడులనూ తట్టుకో గల్గుతుంది.

మన తక్షణకోరికలపై జరిపే సమ్మె పోరాటాలలో ప్రధానపరిశ్రమలను ప్రభుత్వపరం చేయాలని, లాభాలను అదుపులో వుంచాలని, జీవనావసరమయిన వేతనాల నివ్వాలని, బాగా ప్రచారంచేసి, నిరుద్యోగం పోవాలన్నా, జీతాలకోతలు రద్దుకావాలన్నా మరొకమార్గం లేదని నిరూపించి చెప్పాలి.

ఆకోరికలను బాగా ప్రచారం చేయడానికి ఊహాగానమని, అనిర్దిష్టమైనదనీ, అనుకోవడం సంస్కరణవాదజన్యం. దానిని ప్రతిఘటించాలి. వేరువేరు సమస్యలమీద పోరాటాల్ని, సరియైన మార్క్సిస్టు దృక్పథంతో నడిపించాలి. ఈచిన్న చిన్న పోరాటాలలో సాధించిన విజయాలు ఆర్థికదుస్థితికాలంలో సుస్థిరంగా వుండవని మనం గ్రహించాలి. పెట్టుబడిదారుల దాడుల్ని సర్వతోముఖంగా ఓడించినపుడే ఆ పోరాటాలలో

సాధించిన విజయాలను స్థిరపరచుకోగలం. అందుచేత కార్మికులకు అంగీకారార్హములైన వారికి కొంతవరకు రక్షణ ఇవ్వగల అల్పవిజయాలను ఒకమూల ఆమోదిస్తూనే, ఏక్షణంలోనైనా సరికొత్తదాడులు ప్రారంభం కాగలవనీ, వాటికి సర్వసిద్ధంగా వుండాలనీ కార్మికులను హెచ్చరిస్తూ వుండాలి. తాముసాధిస్తూ వుండాలసి యున్న ప్రధానములయిన కోరికలను సాధించేటందుకై పోరాటానికి ఎప్పుడూ తయారుగా వుండాలని హెచ్చరించాలి.

ముఖ్యంగా బూర్జువాప్రభుత్వాలు నియమించే మధ్యవర్తి సంఘాలవలన, కార్మికులకు న్యాయం కలుగుతుందనే దుర్భ్రమ వుంచుకోగూడదు. ఆర్థికదుస్థితిరోజులలో పెట్టుబడుదారులకు, కార్మికులకూ మధ్యజరిగే తీవ్రపోరాటాన్ని మధ్యవర్తుల, కోర్టులద్వారా పరిష్కరించుకోగలమనే దుర్భ్రమ మనకుండగూడదు.

కార్మికుల హక్కులను రక్షించడానికి, విజయవంతంగా ముందుకు తీసుకుపోవడానికి, మనం దైనందిన పోరాటాలను సాగించవలసియుంటుంది. ఈ సమ్మెలను మనం నడిపించడంలో కార్మికవర్గం అంతా ఏకీభవించేటట్లు చెయ్యాలి. తన రాజకీయ బాధ్యతలను ఆ వర్గం గుర్తించేలాగాచెయ్యాలి. ఈనాటిసమాజ వ్యవస్థను మార్చటానికీ, ప్రజాతంత్రప్రభుత్వస్థాపనకు పని చేయుడం ఆ వర్గంయొక్క రాజకీయ బాధ్యత యనీ చైతన్యం కలిగించాలి. విజయం సాధించడానికై ప్రజాశక్తుల సహకారంతో పోరాటాలలో, తానే నాయకత్వం వహించి, నడపవలసిఉన్నదనే చైతన్యం కార్మికవర్గంలో కలిగించాలి.

కార్మికవర్గం, తన దైనందిన ప్రయోజనాలను కాపాడుకునేందుకు జరిపే పోరాటంతోపాటు ప్రజ లందరియొక్క కోరికలను బలపరచాలి. కార్మికులు, రైతులు, విద్యార్థులు, సంస్థాన ప్రజలు, వీరందరి పైన అల్పసంఖ్యాకులైన సామ్రాజ్య ఫ్యూడల్ బూర్జువావర్గప్రభుత్వం సాగించే నిర్బంధానికి వ్యతిరేకంగానూ, దాని పాలసీలకు వ్యతిరేకంగానూ, పెద్దఎత్తుగడ నైన రాజకీయ ప్రదర్శనలు, పోరాటాలు ఏర్పాటుచేసి నడపాలి. సానుభూతి సమ్మెలు, నిరసన ప్రదర్శనలు, ఇతరరాజకీయ కార్యాచరణలద్వారా ప్రజల పోరాటసమైక్యతను పెంపొందించాలి. పౌరసత్వాలనూ ప్రజాతంత్ర హక్కులను రక్షించేశక్తిగా, ప్రజాతంత్రసంఘటనను ఐక్యంచేసే శక్తిగా, నిర్మించే శక్తిగా కార్మికవర్గం ముందుకురావాలి.

## రైతురంగంలో మన బాధ్యతలు

దున్నేవారికే భూమిఅనే కేంద్రనినాదంకొరకు, కష్టజీవులైన రైతాంగాన్నిఉత్సాహవంతులను చేసి నడపడమే, రైతురంగంలో ప్రధానమైన కర్తవ్యం. భూస్వాములకు ఏవిధమైన నష్టపరిహారంలేకుండా అన్నిరకాల భూస్వామ్యవిధానాలను రద్దుచెయ్యాలి. భూస్వాములయొక్క ధనికరైతులయొక్క స్వాంతకమతాలను, కష్టించే రైతులకు పంచివేయాలి. భూస్వామ్యవిధానానికి సంబంధించిన అక్రమవసూళ్ళను, వెట్టి మొదలైన వాటిని రద్దుచేయాలి. భూములనుండి రైతులను వెళ్లగొట్టడానికి, శిస్తులకు, వడ్డీవ్యాపారస్తులకింద బానిసత్వానికి వ్యతిరేకంగా జరిపే పోరాటాలను ధాన్యం ముక్తాలను డబ్బురూపంలో చెల్లించేందుకు, కౌలు పంటలో

రెండువంతులు రైతులకు, చెల్లించేందుకు జరిపే పోరాటా లనూ బలపరిచి, 'దున్నేవానికే భూమి'ని సాధించే పోరా టంగా అభివృద్ధిచెయ్యాలి. వ్యవసాయకూలీల ప్రత్యేక సంఘాలను అఖిలభారత కిసాన్‌సభకు అనుబంధశాఖలుగా గానీ, లేక దానిలో ప్రత్యేకమైన అంతశ్శాఖలుగా గానీ, నిర్మించి న్యాయమైన జీతాలకొరకు పనిచేసే పరిస్థితులను, షర్తులనూ చక్కపరచేందుకు పోరాడాలి.

రైతాంగపు పోరాటాల తీవ్రత ఎంతో హెచ్చుగా వుండటంచేతనే కాంగ్రెసు మంత్రులు భూస్వామ్యవిధానపు రద్దుకు అనే పేరుచెప్పి బిల్లులను తీసుకురావలసివస్తోంది. భూస్వామ్యవిధానాన్ని రద్దుచేస్తామంటేతప్ప, రైతాంగం విని పించుకొనేస్థితిలో లేదని బూర్జువావర్గం గ్రహించింది. అందు చేత భూస్వామ్యవిధానాన్ని రద్దుచెయ్యాలనే నినాదాన్ని వారే ప్రారంభించారు. కాని, బూర్జువావర్గపు స్వభావం, మనకు కొత్తగాదు. వారు తెచ్చేచట్టాలకు మనం మోస పోరాదు. వారి నిజమైనవర్గస్వభావాన్ని మనం బయటపెట్టాలి. భూస్వామ్యవిధానం రద్దుచేస్తామని వారు చెప్పేవాగ్దానాలు ఎంతబూటకమో స్పష్టపరచాలి. నిజానికి నేడు కాంగ్రెసు నాయకులు, మంత్రులు భూస్వామ్యవత్తిడికి లొంగిపోయి తాము చేస్తున్నామన్న భూస్వామ్యవిధానవ్యతిరేకతను తొక్కి పెట్టి వుంచుతున్నారు. అన్నిచోట్లా సమానమైన, తగినంత ప్రతిఫలం ఇవ్వడానికి ఆలోచిస్తున్నామని సాకు చెబుతు న్నారు.

వారు ప్రవేశపెడుతున్న బిల్లులలో భూస్వాములకు

ప్రతిఫలం ఇవ్వాలంటున్నారు. దానిని మనం వ్యతిరేకించి, పోరాడాలి. భూస్వాములు తమకుప్పిట సర్వాధికారాలతో పట్టుకొని కూర్చున్న భూమిని తీసుకొని, దున్నే రైతులకు పంచలేరు. ఈనాడు రైతాంగంలో అధిక సంఖ్యాకులుగా వుండే పాలుదారులు, కౌలుదారులు, కమతదారులుకి, భూముల మీద హక్కేమీ కలగడంలేదు. భూస్వాముల చేతులలోవున్న భూముల్లోంచి, మక్తాపద్ధతిమీద శాశ్వతభుక్తంగా రైతులకు ఇదివరకే ఇవ్వబడిన భూముల్ని ప్రతిఫలంఇచ్చి తీసుకోడానికి మాత్రమే ప్రస్తుతబిల్లులు ఉద్దేశించబడినాయి. ఈచర్యలవలన, భూస్వామ్యవిధానం రద్దుకాదు. మరో రూపంలో అది సజీవంగానే వుంటుంది. ఇదివరకే పన్నుల భారంతో కుంగుతూవున్న రైతుల నెత్తిని ప్రతిఫలభారంగూడా పడుతుంది. దీనివలన లాభం పొందేది భూస్వాములే.

భూస్వామ్యవిధానాన్ని కొత్తపద్ధతులలో సుస్థిరంగా వుంచేటందుకై కొన్నిరాష్ట్ర ప్రభుత్వాలు వేస్తున్న క్రొత్త ప్రణాళికలను గమనిస్తే వారిధోరణి ఎటువుందో, అర్ధంచేసుకోవచ్చును (ఉదాహరణకు బెంగాలువేపు చూడండి). భూములమీద పెత్తనం భూస్వాములు, రైతులుకలసి ఏర్పడిన కో-ఆపరేటివుల చేతిలో వుంచుతారట. భూస్వాములు తమకు ప్రతిఫల రూపంలో ముట్టేధనాన్ని ఈకో-ఆపరేటివ్‌లకు పెట్టుబడిగా ఉపయోగపరుస్తారట! ఈ కో-ఆపరేటివులలో పెద్దవాటావున్న భూస్వామిచేతిలో ఆభూమి, ఆపంటఅంతా చిక్కుబడి వుంటుందని వేరే చెప్పనక్కర్లేదు.

ఈకొత్తచట్టాలు అమలులోకి వచ్చేలోపున భూస్వా

ములు పెద్దపెట్టున రైతుల్ని భూములనుంచి తొలగిస్తున్నారు. ఆ రైతులు ప్రతిఘటిస్తే పోలీసుల సహాయంతో వారిని అణచి వేస్తున్నారు. దానికిఫలితంగా భూస్వాముల శేరీల వైశాల్యం పెరుగుతుంది. సర్వహక్కులతో వారిఅధీనంలోవున్న భూమి పెరుగుతోంది. నిజంగా, దున్నేరైతు చేతిలోని భూమి పెద్ద ఎత్తున లాగివేయబడుతూంది. కొత్తచట్టాలు ఈవిధంగా హరించిన భూమిని భూస్వాములదిగానే నమోదు చేస్తాయి తప్ప వేరుగాదు.

ఇదంతా అభివృద్ధియనీ, ముందడుగు అనీ, గొప్పలు చెప్పుకోవడం రైతుల్ని దగాచేయడమూ, బూర్జువా నాయకుల్ని దాచిపెట్టడము అవుతుంది.

శాసనసభలలో ప్రవేశపెట్టుతున్న ఈబిల్లుల బండారాన్ని నిస్సంకోచంగా బయటపెట్టాలి. భూస్వామ్యవిధానాన్ని పునరుద్ధరించడానికి అవి ఎలా తోడ్పడుతున్నయో, రైతు ప్రజాసామాన్యాన్ని, మరింత దరిద్రింలోకి ఎలా ఈడ్చుకొని పోతారో, అదివరకేవున్న, తిండికరువు మరింత తీవ్రింగావడానికి ఎలా అవకాశంవుందో స్పష్టపరచాలి. తిండిగింజలన్నీ భూస్వామి గుప్పెట్లో చిక్కి- దొంగమార్కెట్టు పెరుగుతుందని హెచ్చరించాలి. భూస్వాములకు పరిహారమివ్వడాన్ని ప్రతిఘటించాలి. అందుకు బదులు రైతులకు ఎరువులు సప్లయి, నీటిపారుదల సౌకర్యాలు, బంజరు భూములను వ్యవసాయంలోకి తీసికొని రావడానికి రైతులకు పశువులను, విత్తనాలను, ఆధునిక వ్యవసాయ పరికరాలను సప్లయి చేయడానికి, పరిహార ధనాన్ని వినియోగించాలని వత్తిడి చెయ్యాలి.

దున్నే రైతులకి భూమినివ్వాలి. భూస్వాముల స్వంతకమతా లను నష్టపరిహారం ఇవ్వకండా వశపరుచుకోవాలి, బీద భూస్వాములకుమాత్రం కొంతకాలం వరకు తగుమాత్రమైన మనువర్తి ఇవ్వవచ్చును. లేదా వారి మనువర్తికి సరిపోయిన భూమిని అట్టిపెట్టవచ్చును. దున్నేవానికి భూమి లభించనంత వరకు జమీందారీవ్యతిరేక రైతువుద్యమం సంపూర్ణం కా జాలదు. భూమిని సంపాదించుకోవా లంటే రైతులు 'దున్నే వారికే భూమి' నినాదంతో సంఘటితపడాలి. మక్తాలు, రుణాలూ మొదలగునవి తగ్గించాలనే చిన్నకోరికల కొరకు ప్రారంభించే పోరాటాలనుండి, 'దున్నేవారికే భూమికావాలి' అనే పోరాటం విజృంభించుతుంది.

ప్రభుత్వం అవలంబించుతున్న విధానానికి ఫలితంగా వచ్చిన ఆహారకరువును వ్యతిరేకించి, పోరాటంలో మనం ఏమాత్రం వెనుకతీయరాదు. పెద్ద వర్తకులవద్ద భూస్వాముల వద్దనున్న నిలవలను స్వాధీనం చేసుకొని, ప్రజలకు ఆహారం పంచిపెట్టమని పోరాడాలి. వెనుకబడివున్న ప్రదేశాలలో దాసత్వం వెట్టిచాకిరీ, అన్యాయపు పన్నులు - (వార్లీలు - హాలీలలో వున్నట్లుగా) రద్దు చేయాలని మనం డిమాండు చేయాలి. ఆ పోరాటాన్ని దున్నేవారికే భూమిహక్కు వుండా లనే నినాదంతో - మేళవింపచేయాలి. సంస్థానాలలోగూడా రైతుల్ని మేల్కొలపాలి. జాగీర్దారువిధానం, భూస్వామ్య విధానం, పూర్తిగా రద్దుచేయాలనీ, జమిందారీయుగపు సం బంధాలన్నీ రద్దుగావాలనీ, దున్నేవానికేభూమి సంక్రమించా లని వారు పోరాటం జరపాలి.

ఆర్థికదుస్థితి, పల్లెటిపట్టుల్ని భయంకరంగా పీడించి బ్రహ్మాండమైనశక్తులను కదుపుతుంది. ఈరైతు ఉద్యమాలు అసంఖ్యాకులైన బీదరైతుల్ని, మధ్యతరగతిరైతుల్ని, వ్యవసాయ కూలీలనూ ఐక్యంచేస్తాయి. రైతులకూ, కార్మికవర్గానికి, ఐక్యత కుదురుస్తాయి. ఏప్రజాతంత్రఉద్యమమయినా విజయా పొందాలంటే ఈ "ఐక్యత" అత్యవసరం. సామ్రాజ్యవాదం బూర్జువావర్గం కలసికట్టిన ముఠాను ఎదిరించి, ప్రజాసంఘటన సాగించే ఉద్యమంలో ఆ పోరాటాలు ఒక భాగంమాత్రమే.

"దున్నేవానికేభూమి" అన్న నినాదాన్ని గమ్యస్థానంగా పెట్టుకొని, పెరిగి ప్రవహించే ఏకైక రైతుల ప్రతిఘటనోద్యమ ప్రవాహంలో, లీనమైపోయేటట్లుగా ఈ రైతుపోరాటాలను నడపాలి. ఇందుకొరకు అఖిల భారత కిసాన్ సభను, భారతరైతాంగ ప్రజానీకంయొక్క యేకైక పోరాటసంస్థగా నిర్మించాలి.

## సంస్థాన ప్రజారంగంలో పార్టీ బాధ్యతలు

ఒకవైపు చివికి శిథిలమైపోతున్న నిరంకుశ ఫ్యూడల్ వ్యవస్థా, మరొకవైపు చిరకాల నిర్బంధితులైన ప్రజానీకంలో పోరాటచైతన్యం కలగటం, ఈ వైరుధ్యం మూలంగా సంస్థానాలు సామ్రాజ్యవాద ఫ్యూడల్ బూర్జువాకట్టడంలో బలహీనమైన భాగాలుగా వున్నాయి.

ఈ సంస్థానాలలో ప్రజాతంత్ర హక్కులనేవి లేవు. ప్రజలు ఎన్నుకున్న శాసనసభలు, మంత్రివర్గాలు మొదలైనవి లేవు. పాతకాలంనాటి ఫ్యూడల్ సంబంధాలు – ప్రత్యేక హక్కులూ అలాగే వుండిపోయినాయి. జాగీర్దారీ

భూస్వామ్య పద్ధతులు ప్రాముఖ్యత వహించి వున్నాయి. జమీందారీవర్గమే ప్రభుత్వంలోని ఉన్నతోద్యోగా లన్నింటినీ ఆక్రమించి వుంది. వీటిఅన్నింటికి సంస్థానాధీశుల నిరంకుశ పరిపాలన తోడుగావుంది. అందుచేతనే సంస్థానాలలో ప్రజా ఉద్యమము విజృంభించడానికి ఎంతో అవకాశంవుంది.

సంస్థానాధీశులకుగానీ, వారిని బలపరచే వారికిగాని, ప్రజలలో బలం ఎప్పుడూలేదు. ప్రజలు కళ్ళుతెరిస్తే వాళ్ళ సంస్థానాలు కదలిపోతాయి. నేడు వీరంతా హిందూ మహోన్మాదుల్ని అర్. యస్. యస్. ను ఇతర విప్లవవ్యతిరేక శక్తులను అభిమానించి ప్రోత్సహించి తమవునికిని గట్టిపరుచుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు. నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ప్రజలు సాగించే పోరాటాన్ని పెడదార్లను పట్టించడానికై ముస్లిం ప్రజలను హత్యచేయడానికి ప్రయత్నిస్తున్నారు.

అయినప్పటికీ, సామ్రాజ్యవాదపు ముఠాలోకల్లా సంస్థానాలు బలహీనమైనవి. సంస్థానాధీశుల నిరంకుశపాలన క్రింద పత్రికలు అణచివేయబడుతున్నాయి. ప్రజాతంత్రి హక్కులు, పౌరసత్వహక్కులు, నిర్మూలించబడుతున్నాయి. రైతులు, మధ్యతరగతి ప్రజలు, మొదలగు ప్రజలంతా అణచివేయబడుతున్నారు. సంస్థానాలలో ప్రవేశపెడుతూన్న బూటకపు సంస్కరణల వలన ఒక్క సమస్యగూడా పరిష్కరించబడటంలేదు. ఫలితంగా ప్రజానీకం అంతా నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏకమౌతున్నారు.

ప్రజలలో పలుకుబడివున్న బూర్జువా నాయకుల సహాయంతో, వెనుకటి ప్రభుత్వాలను సుస్థిరంగా వుంచడానికై

జేసేప్రయత్నాలుకూడా విఫలం అవుతాయి. సంస్థానాధీశులు, కొత్తగా ప్రవేశపెడుతున్న సంస్కరణలు నట్టి బూటకపువి. పైగా ఇండియాలో కాంగ్రెసుకు వున్న పలుకుబడి సంస్థానాలలోని, ప్రజామండలి నాయకులకు లేదు. వారి నిరంకుశ పాలనకు వ్యతిరేకముగా, ప్రజలను వుద్యమాలు నడపకుండా ఎంతోకాలం నిలుపలేరు.

సంస్థాన ప్రజాసంఘటనయొక్క గమ్యం నిరంకుశ పాలకులతో రాజీతప్ప బాధ్యతాయుతప్రభుత్వం సంపాదించడంతోకాదు. ఇది సంస్కరణవాద దృక్పథం. ఈ దృక్పథం మనలను సంస్కరణవాద పద్ధతిలో నడిచే ప్రజా మండలి నాయకత్వం అడుగుజాడలలో నడిచేటట్లు చేసింది. వారిని ఏకాకులనుగా దూరంగాపెట్టి, స్వతంత్రంగా ఉద్యమాలను తీవ్రంగా నడిపించడానికి తోడ్పడలేదు. ఇప్పుడు చేయవలసింది నిరంకుశపాలనతో రాజీకుదుర్చుకోవడంకాదు. నిరంకుశత్వాన్ని నిర్మూలించి ప్రజాతంత్ర వుద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి.

కాశ్మీర్ ప్రజలు సాగించిన పోరాటాన్ని, తిరువాన్కూరు ప్రజలు సాగించిన యుద్ధాన్ని, నేడు హైదరాబాద్ ప్రజలు సాగిస్తున్న పోరాటాన్నిగనుకచూస్తే సంస్థాన ప్రజా పోరాటాలు, ఎంత బ్రహ్మాండంగా, సాగుతున్నాయో చూడొచ్చు. ఈఉద్యమాలను సాధించినది సంస్కరణ వాద నాయకులే. కాని అవి తీవ్రరూపం ధరించి, నిరంకుశ ప్రభుత్వాల్ని వణికించివేశాయి. వీనిని సరిగ్గా నడిపించివుంటే నిరంకుశప్రభుత్వాలు వాటిని ఏమిచేయలేకపోయి వుండేవని స్పష్ట

మౌతుంది. నిరంకుశత్వాన్ని ప్రజాసామాన్యం భరించే స్థితిలో లేదు.

ఈవిషయాన్ని తెలంగాణా రుజువు చేస్తున్నది. హైదాబాదులో ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన తెలంగాణా ప్రజల పోరాటం, అపూర్వ శిఖరాల నందుకుంటున్నది. నైజాం సైన్యాన్ని, పోలీసును, ఇత్తేహాదుల్ ముస్లిమన్, ఫాసిస్టు గూండాలను వారి క్రూరఅత్యాచారాలను నిర్భీతిగా యెదుర్కొని తెలంగాణా ప్రజలు 2000 గ్రామాలను విముక్తి చేశారు. భూమికోరకు స్వేచ్ఛకోరకు ప్రజాతంత్రం కొరకు అసమానమైన పోరాటాలను సాగిస్తున్నారు. ప్రజాతంత్ర పోరాటానికి "దున్నేవానికే భూమి" అన్న నినాదం కేంద్ర నినాదమైనపుడు నిరంకుశత్వ నిర్మూలనమూ – ప్రజలకే రాజ్యాధికారం అన్నది ప్రజా ఆశయంగా దృష్టికి తీసుకురాగలిగినపుడు, ప్రజలను నిజమైన పోరాట సంస్థలు నడుపుతున్నపుడు, పోరాటాన్ని నీరుగార్చే బూర్జువా ప్రచారాలు ప్రజలపై లేనపుడు, నిజంగా పోరాటం ఏవిధంగా అభివృద్ధి అవుతుందో ఎంతటి ఉచ్ఛ దశకుపోతుందో తెలంగాణా ప్రజలు రుజువుచేశారు.

కాని మిగిలిన అధిక సంఖ్యాక సంస్థానాల్లో పోరాటాలను ప్రజామండలుల, లేక స్టేట్ కాంగ్రెసుల మితవాద నాయకత్వాలు నడుపుతున్నాయి. జాతీయప్రభుత్వ నాయకుల మద్దతుతో వారి సిగ్గుమాలిన రాజీచదరంగంలో ప్రజలను పావులుగా ఉపయోగించుకున్నారు. ప్రజలకి గుదిబండ కట్టి నిరంతరమూ జాతీయప్రభుత్వం వైపుకి మోరలెత్తినిలుచునట్లు

చేశారు. పరిస్థితులు అదను కుదరగానే చివరకు కేంద్ర ప్రభుత్వ ఆజ్ఞానుసారం పోరాటాలను విరమించారు.

మౌంట్ బాటన్ ప్లాను చట్టంలోపలే రాజీకుదుర్చు కోదలచిన కాంగ్రెసు నాయకులు, ఇండియన్ యూనియన్‌లో సంస్థానాలను చేర్చడానికిమాత్రం ప్రయత్నించారు. అదే వారోవిజయమని చాటుకున్నారు. కొన్ని సంస్థానాలు "ఎక్సెషన్" వెంటనే అంగీకరించక ఏదో నవ్వులాటలకు అన్న ట్లుగా నామమాత్రమైన ప్రతిఘటన చేశారు. అందువల్ల సంపూర్ణ ప్రజాతంత్రంకొరకూ, నిరంకుశత్వనిర్మూలనకొరకూ ప్రజలు జరిపేపోరాటం,గాడితప్పి కేవలం ఎక్సెషన్ సమస్యపై తిరిగేటట్లు చేయడంవారి ఉద్దేశ్యం.

నిజానికి ఎక్సెషన్ గాని, చిన్నచిన్న సంస్కరణలు, ఇండియన్ యూనియన్‌లో లీనమయ్యే పథకాలు, సంస్థాన యూనియన్లు, ఇవన్నీ సంస్థాలలోని విప్లవోద్యమాలను, నాశనం చేయడానికి, నిరంకుశత్వాన్ని నిలబెట్టుకోడానికి బూర్జువాలతో రాజీ చేసుకోడం ద్వారా నిరంకుశత్వా న్నింకా బలపరచడానికే ఉపయోగపడుతాయి. అంతేగాక, బూర్జువావర్గమూ సంస్థానాధిపతులు కలసి సంస్థానాలలో మార్కెట్లను ఇంకా దోపిడిచేయడానికి, అక్కడి యితర ఆర్థికవనరులను వినియోగించుకోడానికి ప్రస్తుతంగల ఆటంకా లను తొలగించుకోగలుగుతారు.

నిరంకుశత్వాన్ని నిర్మూలించడానికీ వ్యవసాయ సంస్కరణల కొరకు ప్రజలు చేసే పోరాటాన్ని తప్పుదారుల పట్టించడానికే గాక "హైద్రాబాద్" సంస్థానంలో రుజువులఖై పోయిన

ట్లుగా ప్రజలు, ప్రజాతంత్రఉద్యమాలతాకిడికి కదలి కూలి పోతున్న సంస్థాన ప్రభువులను, వీరిపాలనను రక్షించడానికి, పూటీలతో నిలువబెట్టడానికి చేసే తంత్రమే ఎక్సెషన్. ఇది బాగా అర్థం చేసుకోవాలి. దీని అసలు బాండారం ఇలాంటిదని బయటపెట్టాలి.

సంస్థానాలను ప్రక్కనున్న రాష్ట్రాలలో లీనం చేయడం గూడా ఇలాగే ప్రజలతిరుగుబాటునుంచి చిన్న సంస్థానాధిపతులను, వారి జాగీర్లను, అందులో వారి స్వంతభూముల నుండి వచ్చే అంతులేని ఆదాయాలను, మధ్యయుగాలనాటి ప్రత్యేక ప్రయోజనాలను రక్షిస్తుంది. నీతిహీనమై,అసహ్యాకరమైన సంస్థాన నిరంకుశపరిపాలకవర్గాన్ని వున్నదున్నట్లుగా రాష్ట్ర ప్రభుత్వాలలోకి బదలీచెయ్యడం తప్ప మరేమీగాదు. ఇందువల్ల ప్రజలకేమాత్రం భారం తగ్గనైనా తగ్గదు

కథియవారు, మధ్య భారత సంస్థాన యూనియన్ల లాగా, సంస్థానాలను యూనియన్లులాగా ఏర్పాటుచేయడం గూడా, ప్రజలకు వ్యతిరేకంగా, స్థాపింపబడిన విప్లవప్రతీఘాత సంఘటనే. ప్రజాతంత్ర పోరాటాలను బలమైన అడ్డుకట్టలు వేయ, సంస్థాన లను విప్లవ విద్రోహ కేంద్రాలుగా అట్టి పెట్టేందుకువీలుగా, రాజప్రముఖులకు, విస్తృతమైన అధికారా లివ్వబడినవి.

వీటి అన్నిటి ఫలితంగా కొన్ని చిన్న సంస్కరణలు, మాత్రం వచ్చినవి. వీటిద్వారా, సంస్థానములలో బలహీనంగా ఉన్న బూర్జువాలు పరిపాలనలో నిరంకుశులు ప్రక్కన, (పెద్ద భాగమైనాకాదు.) చిన్న భాగం మాత్రం పంచుకోగలి

గారు. ఇదొక పెద్ద ఘనమైన విజయమని ఈరాజీ పంపిణీలకు తగిలించిన ముసుగులుగూడా ఏమంత దట్టమైనవిగావు. ప్రజల వత్తిడి తగ్గంగానే వాళ్ళ సంస్థానాలలోని పూర్వపు అభివృద్ధి నిరోధకులే పైకివచ్చే అపాయం లేకపోలేదు.

సంస్థాన ప్రజాఉద్యమాలపై గుండాగిరి సాగించి, భయపెట్టి అదిమివుంచడానికి ప్రజాతంత్రం కావాలనే కోరికలు ఇక ముందుకు రాకుండా అణచివేయడాకిని, అనేక సంస్థానాలలోని రాజులు, భూస్వాములు, జాగీర్దారులు ఆర్. యస్. యస్. ను ఉపయోగిస్తున్నారు. హిందూమహాసభను ఇతర మతోన్మాదుల్ని బలపరుస్తున్నారు.

సంస్థానాధీశులందరూగూడా, ముస్లిం అల్పసంఖ్యాక వర్గాన్ని వేటాడి, ప్రజలలో మతోన్మాదాలను రెచ్చకొట్టి, హిందూమహాసభకు ప్రజలలో స్థానం కలిగించాలని ప్రయత్నిస్తున్నారు. ముస్లిములను యూనియన్ ప్రాంతంలోకి తరిమివేసి, అక్కడ ప్రభుత్వాలను చిక్కులలోకి తేవాలని వారి సంకల్పం. జాతీయప్రభుత్వం మాటమాటకూ లొంగుబాటు చూపుతున్నా సరే, నేడు ఆ ప్రభుత్వంమీద ఎదురుదాడులు చేయడానికి బహిరంగంగా ప్రయత్నించుతున్నారు.

వ్యావసాయిక విప్లవకార్యక్రమాన్ని పారిశ్రామిక కార్య విధానాన్ని నిర్ణయించుకొని, ఉద్యమాన్ని రైతులలోకి శ్రామికులలోకి, తీసుకుపోవడానికై, సంస్థానాలలోని బూర్జువా వర్గం భయపడుతూంది. వారిస్థితి మరీ బలహీనంగావుంది. వారి ప్రాకులాట అంతా రాజీకే. పోరాటం కొంతకాలానికి నిలబడి సాగేటప్పటికి, దానంతటఅదే ప్రజలలోకి ప్రాకు

తుంది. ఉద్యమం ప్రజలలోకి పాకగానే దానిని ఉపసంహరించి వేస్తున్నారు. ఈ బలహీనతను సంస్థానాధికారులు పూర్తిగా ఉపయోగించుకొంటున్నారు. సాధ్యమైనంత తక్కువలో రాజీ కుదుర్చుకొనేందుకు ఈసంస్కరణవాదుల పోరాటాన్ని మత కలహాలతో ఎదుర్కొనేందుకు సిద్ధం అవుతున్నారు.

ఇటువంటిస్థితిలో ఈవిద్రోహక చర్యలను బయట పెట్టి, జాతీయ బూర్జువా నాయకత్వంతో కలసి ప్రజామండలులు సంస్థానప్రజలను శత్రువుకి అప్పచెప్పారని స్పష్టపరచడం అవసరం.

సంస్థానాలలో ప్రవేశపెట్టబడిన బాధ్యతాయుత ప్రభుత్వాల మాదిరివిగూడా ఒక అభివృద్ధి అనుకోడం ప్రజలలో గల విప్లవశక్తిని అర్థం చేసుకోలేదని, రాజీయొక్క స్వభావాన్ని అర్థంచేసుకోలేదనితప్ప వేరుగాదు.

కాబట్టి నిరంకుశత్వం నిర్మూలింపబడా లన్ననినాదం ప్రచారం చేయకపోవడం, బాధ్యతాయుత ప్రభుత్వమనే మితవాదకోరికను అంగీకరించి తృప్తిపడి ఊరుకోడంతప్ప, రాజీ కార్యక్రమముతోటే ప్రారంభించిన నిరంకుశపాలన అంతమొందించాలనే నినాదం, ఎత్తకపోవడం తప్పు.

అలాగే రాజీవాదుల తోకపుచ్చుకొని పోవడం, రాజీని పెద్దగా చిత్రించి పలుకుబడి సంపాదించడం, దీన్నంతటినీ కప్పిపుచ్చుకోడానికి అభివృద్ధికరశక్తులు నిర్మాణరీత్యా బలహీనంగా వున్నాయి అని వాదించడం అసలే తప్పు.

మనస్థితి బలహీనంగా వున్నదనిచెప్పి, మన ప్రధానమైన నినాదాలను- నిరంకుశత్వం పోవాలనే వంటి వానిని-

జారవిడువరాదు. మన ప్రధాన నినాదాన్ని ముందుకు తెస్తే, రాజీవాదులు మనలను ఎదిరించి తాత్కాలికంగా మనలను ఏకాకులుగా దూరం చేయగలుగుతారనుకున్నా మనం ఆపరిస్థితిని ఎదుర్కోవాలిగాని లొంగరాదు. ధైర్యంతో తన కార్యక్రమాన్ని ముందుకు తీసికొనిరావడంవలనే కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధి పొందింది. స్వతంత్రంగా కార్యరంగంలో పనిచేయడం, ప్రజాసామాన్యం యొక్క పోరాటాలలో పాల్గొనడం వలననే పార్టీ పెద్దదైంది. స్వతంత్రంగా విమర్శించి ప్రజాద్రోహుల్ని ఎదుర్కొనే హక్కుని వదలుకోవడమూ, సంస్థాన ప్రజలలోని అతివాదశక్తులు స్వతంత్రంగాఆలోచించే టట్లు చేయాడాన్ని వదలుకోడమూ, జమీందారీ యుగ పరిపాలనను నిర్మూలించడం, ప్రజల ప్రాథమిక కర్తవ్యం అని ప్రబోధించే హక్కును వదలుకోవడమూ పూర్తిగా తప్పు.

కాబట్టి స్వాతంత్ర్యంకోసం, ప్రజాతంత్రంకోసం, సంస్థానప్రజలు చేసే పోరాటాలను మనం గట్టిగా బలపర్చాలి. సంస్కారవాదనాయకులు ప్రారంభించిన పోరాటాలలో పాల్గొనేటప్పుడుగూడా, మనం ప్రధాన నినాదాలను మరచిపోగూడదు. జమిందారీయుగపాలన అంతరించాలని, ప్రజలు కోరుతున్నారన్న విషయం మఱచిపోగూడదు. ప్రజాసామాన్యం సాగించే పోరాటంలో పాల్గొంటూ రాజీధోరణులను గట్టిగా ప్రతిఘటించుతూ, పోరాటం సర్వతో ముఖంగా వ్యాపింపచేసి, దాని ప్రధాన గమ్యాన్ని చేరుకోగలిగేటట్లు పనిచెయ్యడం- ఇవి మన బాధ్యతలు.

సంస్థాన ప్రజా ఉద్యమాలలో మనం తీవ్రంగా,

పాల్గొనాలి. రాజీకి సిద్ధపడే నాయకుల్ని నిశితంగా విమర్శిం చుతూ, మన కార్యక్రమాన్ని విస్పష్టంగా ప్రజలముందు పెట్టాలి. అలాచేస్తే సంస్థాన ప్రజాఉద్యమంలోని, ఉత్సాహవంతమైన శక్తులన్నీ మన ప్రక్కకు చేరు తాయి. అనేకసంస్థానాలలో ఆ విధంగా కార్మిక వర్గం మనవేపుకిచేరి, సంస్థానప్రజలకు, ప్రజాపోరాటా లను ముందుండి నడిపించేవారికి, ఐక్యతకుదర్పగల బలమైనపని ముట్టుగా తయారయింది. ఆ ఐక్యతవలన, పూర్తిగా ప్రజా తంత్ర విజయాన్ని సాధించవచ్చును. శ్రామికవర్గం ఏమాత్రం తటపటాయించినా ఆ ఐక్యత విచ్ఛిన్నం అవుతుంది. ముందుకు సాగేటందుకు సరియైనమార్గాన్ని చూపించలేదు. రాజీవాదుల ముందు మోకరించబడుతుంది. సంస్థాన ప్రజాసంఘటనలో వచ్చిన బలహీనత మొత్తం ప్రజాతంత్రసంఘటననే విచ్ఛిన్నం చేస్తుంది.

## విద్యార్థిరంగంలో మనబాధ్యతలు

యుద్ధానంతర విప్లవవిజృంభణలో, విద్యార్థి వుద్యమం ప్రముఖమైన పాత్రను నిర్వహించింది. భారతజాతీయ సైనికుల విడుదలకొరకు జరిగిన ప్రదర్శనాలతో మన ముఖ్యనగరాలన్నీ ఒక్కుమ్మడిగా కదలిపోయి యుద్ధకాలపు రాజకీయ నిశ్చేష్టత బద్దలైనది. యుద్ధానంతర విజృంభణకు నాందీగీతిక పాడినది. ఆ ప్రదర్శనాల సమయంలో విద్యార్థులకూ, పోలీ సులకూ మిలటరీలకూమధ్య పోరాటాలు జరిగినవి. అప్పటి నుంచీ, కార్మికవర్గంచేసే సమ్మెల సమయంలో పోరాట చైత న్యంకలిగిన విద్యార్థులు సానుభూతిప్రదర్శనాలు, సమ్మెలు

చెయ్యడం, యుద్ధానంతరవిప్లవదశకొక కొత్తలక్షణం.

15 ఆగస్టు 1947 తరువాత స్వాతంత్ర్యం సంపాదించామనే భ్రమలు, విద్యార్థుల నెక్కువగా చుట్టుకున్నప్పటికీ, విద్యార్థి ఉద్యమం త్వరగానే తెప్పరిల్లుకుంది. అనేకరాష్ట్రాలలో స్కూలుజీతాలు పెంచి, విద్యాప్రచారాన్ని అరికట్టడంతో విద్యార్థులు కోపోద్రిక్తులై నిరసన ప్రదర్శనలు చేశారు. ఆసందర్భాలలోను, కాంగ్రెసుమంత్రులు జరిపిన క్రూరనిర్బంధ విధానంతో, విద్యార్థులకూ ప్రభుత్వానికీ మధ్య నేరుగా ఘర్షణలు సంభవించడం, ఇవి చివరకు ప్రజల పౌరసత్వాల కొరకు జరిగే సార్వజనిక పోరాటాలుగా పరిణమించినవి.

ఆర్థికపరిస్థితులు నానాటికి క్షీణించడం, కాంగ్రెసు నాయకత్వమంటే ఉన్న భ్రమలు నానాటికి తొలగిపోతూ ఉండటంతో జీతాల పెంపుదలకు వ్యతిరేకంగానూ, ఇతర విద్యాసౌకర్యాలకు పోరాటాలు అభివృద్ధి అవుతాయి. రైతు కార్మిక పోరాటాలతో, సానుభూతి ఐక్యత తెలిపే ప్రదర్శనాలూ, పౌరసత్వ హక్కులకొరకు రాజకీయ కార్యక్రమాలు, సంస్థానాలలో ప్రజాతంత్ర పోరాటాలు మొదలైనవి రాగలరోజుల్లో ఎక్కువవుతాయి.

అభివృద్ధి నిరోధక పరిపాలనపైన ఉద్యమం దాడిచేసే ప్రమాదం వుందని గ్రహించిన ప్రభుత్వం, విద్యార్థుల తిరుగుబాటును విద్యార్థుల వుత్సాహాన్ని అణచివేసేందుకు ఘోరమైన నిర్బంధాన్ని ప్రయోగిస్తూంది.

విద్యార్థి ఉద్యమం పోరాటశక్తిగా ఉండకుండా రద్దు చేసేందుకు స్వతంత్రవిద్యార్థిసంఘాలను రద్దుచేసి, వాటి

స్థానే ప్రభుత్వ తోకలుగా నడుపబడుతూ, "రాజకీయాలకు దూరంగా ఉండి" నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నమైఉండే విద్యార్థిసంఘాలను నెలకొల్పడానికి కాంగ్రెసు నాయకులు ప్రచారం ప్రారంభించారు.

సోషలిస్టుపార్టీ నాయకులుగూడా దీనిని బలపరుస్తున్నారు. శక్తివంతమైన విద్యార్థి ఉద్యమంగాని, విద్యార్థి పోరాటంగాని, అవసరంలేదని ప్రకటిస్తున్నారు. రాజకీయాలకు దూరంగావుండే ఐక్యవిద్యార్థి ఉద్యమం నిర్మించాలనే కోరుతూంది. సోషలిస్టుపార్టీలోకి విద్యార్థులను చేర్చుకోడంపైన మాత్రం కేంద్రీకరించారు. ఇలా సోషలిస్టుపార్టీ విద్యార్థిఉద్యమాల్ని శక్తివంతమైన విద్యార్థిసంఘాలను రద్దుచెయ్యాలని వీరిలో జతకలిసింది.

ఇలాంటి పరిస్థితులలో విద్యార్థిఉద్యమంయొక్క ప్రాముఖ్యతనుగాని, స్వతంత్రాన్ని ప్రజాతంత్రాన్ని సోషలిజాన్ని నిర్మించే పోరాటంలో దాని విప్లవాత్మక పాత్రను విస్మరించడంగానీ, తక్కువ అంచనా వేసుకోడంగానీ ప్రమాదకరం. పార్టీసభ్యులలో అలాంటి భావం ఏ మూలనైనావుంటే తుడిచివేసుకోవాలి. అలాంటి భావాలున్నవాళ్లు విద్యార్థిఉద్యమము రద్దుచేయాలనేవాళ్లని బలపరచినవారౌతారు.

అలాగే విద్యార్థిఉద్యమ ఐక్యత పేరుపెట్టి ఇతర విద్యార్థి వర్గాలనుంచి, వేరుపడిపోతామనే ఊహామాత్రమైన భయాన్ని బట్టి, విద్యార్థిఉద్యమాన్ని కేవల విద్యార్థికోరికలపైనే కేంద్రీకరింప చేయాలని, కార్మిక కర్షక పోరాటాలను బలపరిచే

ఐక్యతా ప్రదర్శనాలను మాన్పించాలనీ చెప్పే వైఖరిని, తీవ్రంగా ఖండించాలి. అది విద్యార్థిఉద్యమాన్ని అంగ విచ్ఛేదంచేసే మార్క్సిస్టు వ్యతిరేకమైన కార్మికవర్గ వ్యతిరేక మైన వైఖరి.

కమ్యూనిస్టు విద్యార్థులు ధైర్యంగా చొరవ తీసుకో వాలి. ప్రజాపోరాటాలకు జయప్రదంగా నాయకత్వం వహించడం, పట్టుదలతో సిద్ధాంత పోరాటాలు నేర్పడంద్వారా, విద్యార్థిఉద్యమాని కంతటికీ నూతన దృక్పథమూ; నూతన నిర్మాణమూ ఇవ్వాలి. విద్యార్థి ఉద్యమానికి, కార్మికవర్గంతో, కష్టజీవి ప్రజాసామాన్యంతో పోరాట ఐక్యతను చేకూర్చాలి. నిజమైన స్వాతంత్ర్యంకొరకు, ప్రజాతంత్రంకొరకు, సోషలిజం కొరకూ, జరిగే పోరాటంలో యావత్తు విద్యార్థి వుద్యమమూ కార్మికవర్గంయొక్క సిద్ధాంతాన్ని, కార్యక్రమాన్ని, నాయకత్వాన్నీ అంగీకరించేటట్లు కృషిచెయ్యాలి. ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీలో విద్యార్థిసభ్యులూ, బూర్జువావర్గం విద్యార్థి వుద్యమముపై, చేసేదాడులను ప్రతిఘటించి పోరాడాలి. విద్యార్థిసామాన్యాన్నంతటినీ ఐక్యపోరాట సంఘటన లోకి సమీకరించాలి.

## యువకులలో మన బాధ్యతలు

ప్రస్తుత విప్లవపోరాటదశలో కార్మికవర్గంనుంచి రైతులనుంచీ, క్రిందిశ్రేణీ మధ్యతరగతులనుంచి వచ్చే కష్టజీవులైన యువకులు ప్రత్యేకపాత్రను నిర్వహించాలి.

వర్గపోరాటాల్లో, కార్మికసంఘాలలో, రైతుపోరాటాలలో, జాతీయఉద్యమంలో, కార్మిక కర్షక యువకులు ముఖ్య

మైనపాత్రను నిర్వహిస్తూవచ్చారు. జాతీయఉద్యమ విజృంభణ సమయంలో తక్కువ శ్రేణికి చెందిన మధ్యతరగతి యువకులెప్పుడూ ముఖ్యమైనపాత్రను నిర్వహించరు. యుద్ధానంతర విప్లవదశలో గుమాస్తాలూ, మధ్యతరగతి ఉద్యోగస్థులూ, చేసిన పోరాటాలకు, వారే ప్రాణం. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, పట్టణాలకు పట్టణాలూ నగరాలూ వదలిపోయిన యుద్ధానంతర విప్లవ పోరాటాలలో వారు అగ్రిశ్రేణి దళాలై, మిలటరీకి, పోలీసుకీ వ్యతిరేకంగా బారికేడ్సును నిర్మించి ఎన్నో లారీలు, నడవకుండా, దారులకు అడ్డుకట్టలను నిర్మించి పోరాడారు.

ఆర్థిక సంక్షోభం తీవ్రతరం అవుటచేత, ప్రజలపైన ఆర్థిక దోపిడీ ఎక్కువవడంతో పట్టణాలల్లో, పల్లెలలోని ప్రజాసామాన్యంపైన నడుములు విరిగే బరువులు పడటంతో ముందు ముందు, కార్మిక కర్షక యువకులు, యువక ఉద్యోగులు, నిరుద్యోగులైన మధ్యతరగతి యువకులు ఇంకా ఎక్కువ సంఖ్యలో పోరాటరంగంలోకి వస్తారు. దోపిడికి గురియౌతూ, అసంతృప్తులై యున్నకష్టజీవి యువకుల్లో కాంగ్రెసు నాయకత్వమంటే ఉన్న రాజకీయ భ్రమలు త్వరితగతిని పటాపంచలై పోతున్నాయి.

ఈయువకశక్తిని, శ్రామికవర్గం నాయకత్వం క్రింద బలమైన ప్రజాతంత్ర ఉద్యమంలోకి తీసుకురాలేక పోవడం వారికినేరుగా కమ్యూనిస్టుపార్టీ పరిజ్ఞానాన్ని అందజేయలేక పోతే, ఈ భ్రమలు తొలగిన మధ్యతరగతి యువకసామాన్యం, కొంతమంది కార్మిక యువకులు, గుండా ఆర్థికాభివృద్ధి

నిరోధకమైన మతోన్మాద వాలంటీరు సంస్థలలోకి వారిఇతర యువకసంస్థలలోకి, మధ్యతరగతి కార్మిక, కర్షక యువకులు దారితప్పిపోయి చేరలేమంటే, అదంతా కర్తవ్యమని, నిర్వహణంలోని వైఫల్యమనీ, మనమే వారినలా తప్పుదారిలో పోయేటట్లు చేస్తున్నామని యెంచాలి.

కాబట్టి కమ్యూనిస్టుపార్టీ కష్టజీవులైన యువకులలో ఉన్న కార్మిక, కర్షక, వ్యతిరేకములైన బూర్జువా పోకడలను అరికట్టి, వారిని కమ్యూనిస్టు సిద్ధాంతకార్యక్రమాలవైపు ఆకర్షించడానికి ప్రత్యేకకృషి చెయ్యాలి.

శ్రామికరంగంలో, సంస్కృతిరంగంలో కష్టజీవి యువకుల ప్రత్యేకవాంఛ లీడేరటానికి, కార్మిక, కర్షక మధ్యతరగతి యువకుల ప్రత్యేక కోరికలకొరకు పోరాడడానికి, కష్టజీవియు యువకులతో బలమైన ప్రజాతంత్ర ఉద్యమం నిర్మించాలి. వారిని స్వతంత్ర ప్రజాతంత్ర సోషలిజాలకొరకు, జరిగే పోరాటంలో బలమైన నిర్మాణయుతమైన, శక్తిగా సమీకరించాలి.

## మహిళారంగంలో మన బాధ్యతలు

స్త్రీలలో నూతన చైతన్యం వస్తున్నది. క్రూరమైన నిర్బంధాన్నిగూడా ప్రతిఘటించగలిగిన వారి పోరాటశక్తి, ధైర్యస్థైర్యాలు, అకుంఠితాలు. ఇటీవల కొద్ది సంవత్సరాలలో భారతీయ కార్మిక, కర్షక, బీద, మధ్యతరగతి స్త్రీలు కష్టజీవులైన కార్మికులయొక్క, రైతులయొక్క, గుమస్తాలయొక్క భార్యలూ, తల్లులూ దీనిని రుజువుచేసారు. వీరితోపాటు ఉద్యోగాలలోని మహిళలు, ఉపాధ్యాయినులు, టెలిఫోను ఆఫీసుల్లోనున్న యువతులు, ఇతర ఆఫీసుల్లో గుమస్తాలగానున్న

వారూ తమవర్గపోరాటాలలో పాల్గొంటానికి ముందుకొచ్చారు. స్త్రీల పోరాటశక్తి ప్రదర్శించారు.

తేభాగా, తెలంగాణాపోరాటాల్లో రైతుస్త్రీలు వీరోచితపాత్రను నిర్వహిస్తున్నారు. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినులు, ఆసుపత్రినర్సులు, సమ్మెలు చేశారు. బ్రహ్మాండమైన పోస్టలుసమ్మెలో స్త్రీ టెలిఫోనిస్టులు పాల్గొన్నారు. ఇటీవల దీర్ఘకాలంజరిగిన భయంకరమైన సమ్మెయుద్ధాల్లో (కలకత్తా బసంత మిల్లులు, బాటా ఫ్యాక్టరీ, పాటరీ,అంటే-మట్టి పోర్స్లైను పాత్రలు, చేసే ఫ్యాక్టరీల్లో పనిచేసే స్త్రీకార్మికులు, కోయంబత్తూరు, మధుర బొంబాయి గుడ్డలమిల్లు కార్మికులు) నిర్వహించిన మహోజ్వలపాత్ర బీద, మధ్యతరగతి స్త్రీలు చేసిన ఆకలియాత్రలు ఏమి తెల్పుతున్నాయి? యుద్ధకాలంలోనూ యుద్ధానంతరము అనుభవించిన కష్టాలు పెరిగిపోయే జీవితవ్యయ ప్రమాణాలూ, తక్కువ జీతాలు, అన్నీ కలసి మన ప్రజలలో అట్టడుగున పడివున్న స్త్రీలను సహితము నూతనపోరాటశక్తివంతులుగా చేసినవి.

కానీ ఈకొలది సంవత్సరాలలోను మనమహిళారంగం మధ్యతరగతి స్త్రీలలో మాత్రమే పనిచేసింది. వీరి కొరకు కూడా తిండీ గుడ్డ స్త్రీలవసతి సమస్యలకు సంబంధించిన పోరాటకార్యక్రమం, వివరంగా ఇవ్వలేదు. కొబట్టి మహిళారంగం ద్వారా మహిళాఉద్యమాలద్వారా చెప్పుకోదగ్గ పుద్యమమేదీ అభివృద్ధికాలేదు.

ఈనాడు ఆర్థికసంక్షోభం తీవ్రమౌతోంది. పనినుంచి తొలగింపులూ, ఉద్యోగాలనుంచి బర్తరఫులూ ఎదుర్కొని

బెదిరిస్తున్నాయి. జీవితావసరవస్తువులు ధరలు చుక్కలంటుతున్నాయి. ఈలాంటి పరిస్థితులలో మహిళారంగంలో ముఖ్య బాధ్యత లేమిటి ? కార్మికవర్గంనుంచి, రైతులనుంచీ, పనిచేసే స్త్రీలనూ కార్మికులయొక్క చిన్న ఉద్యోగులయొక్క కష్టించే, వారియొక్క భార్యలను అందరినీ, ఐక్యపరచి నిర్మాణ యుక్తంగా కార్యాచరణకూ, పోరాటానికి ఉత్సాహంగా, ముందుకు తీసుకురావాలి. రాగల దశలో మరీ కష్టాలు అంతకంతకు దుర్భరమై చిచ్చంటుకొనే స్థితికొస్తాయి.

ఇందుకొరకు ప్రజాతంత్ర సంఘటనయొక్క కార్యక్రమాన్ని అంతటినీ వారిదృష్టికి తెచ్చి నచ్చేటట్లు వివరించాలి. ఒకవైపున పనికొరకు, జీవితానికి సరిపోయే జీతాలకొరకు, సుఖకరమైన జీవన పరిస్థితులకొరకు నడిచే కార్మిక పోరాటాల్లోను, భూమికొరకు రైతులు సాగించే పోరాటాల్లోను, కష్టజీవులైన స్త్రీలు, తమ పురుషులతోపాటు నిలచి పోరాడాలి. రెండోవైపున అన్యాయమైన సాంఘిక కట్టుబాట్లను, నిర్బంధాలకు అవిద్య, అజ్ఞానము, మూఢవిశ్వాసాలు, సంఘంలో లజ్జగా పడివుండే పరిస్థితి మొదలైన స్త్రీల ప్రత్యేక కష్టాలకు వ్యతిరేకంగా జరిపే పోరాట కార్యక్రమము వివిధ తరగతుల తల్లులు తమ బిడ్డలభవిష్యత్ కొరకై జరిపే ప్రజాతంత్ర పోరాటంలో శక్తివంతమైన భాగంగా వుండాలి. యిలాంటి పోరాటంలోకి మధ్యతరగతి స్త్రీలతోసహా అన్నితరగతుల స్త్రీలూ కలసివస్తారు.

మహిళారంగంయొక్క నిర్మాణబాధ్యత లేమిటి? అంతకంత కెక్కువ సంఖ్యలలో కార్మిక స్త్రీలను కార్మిక సంఘా

ల్లోను, రైతు స్త్రీలను రైతు సంఘాల్లోను చేర్పించాలి. వారి వర్గ పోరాటాల్లోను, ప్రచారాందోళనలోను ఇంకా ఎక్కువగా పాల్గొనాలి. దీనితోపాటు ఉపాధ్యాయినులు, నర్సులూ మొదలైన మధ్యతరగతి ఉద్యోగినులువున్న సంఘాలున్నచోట వారి న్యాయమైన హక్కులకొరకు ఎక్కువ చురుకుగా పోరాడాలి. అలాంటి సంఘాలు లేనిచోట త్వరితంగా నిర్మించాలి.

భారత దేశంలో కష్టజీవులై అణచిపెట్టబడిన స్త్రీజనంలో రైతుస్త్రీ లధికసఖ్యాకంగా వున్నారు. కాబట్టి వారి ప్రత్యేక హక్కులకొరకు కృషిచెయ్యడమేగాక, వారి వర్గపోరాటాల్లోకి రైతు స్త్రీలు ఎక్కువగా పాల్గొనేటట్లుచెయ్యాలి.

ఇంతేగాక, మధ్యతరగతిలోని బీదస్త్రీలనూ, ముఖ్యంగా కార్మికులు, గుమాస్తాలు చేతిపనివారు, ఫోర్‌మన్లు,ఫిట్లర్లు, చిన్న దుకాణదారులు, ఉపాధ్యాయులు మొదలైన,వీరందరి భార్యలను సమీకరించి, కార్యరంగంలో తీసుకొని రావడంలో ఎక్కువశ్రద్ధ తీసుకోవాలి. కష్టజీవులై నిత్యబాధలను భరించే యీ స్త్రీలనే వివిధమహిళాసంఘాలలో సంఘటితపరచి, వారి ప్రజాతంత్రి హక్కులు అమలు జరిపేందుకు పోరాడాలి. రాగల రోజుల్లో పురుషులు సాగించే సమ్మె పోరాటాల ఫలితంగా ఈతరగతుల స్త్రీలలో చైతన్యం ఇంకా ఎక్కువగా అభివృద్ధి అవుతుంది. ఈనూతన చైతన్యాన్ని నిర్మాణయుక్తంగా సమీకరించి, సౌఖ్యకరమైన జీవితంకొరకు స్త్రీలు జరిపే పోరాటాల నన్నిటినీ ఐక్యం చెయ్యటం మహిళా రంగంయొక్క మొట్ట మొదటి విప్లవాత్మక కర్తవ్యం. ఈ విధంగా చేస్తేనే స్త్రీల యొక్క ప్రజాతంత్రి ఉద్యమం నిజంగా శక్తివంతమైన

ఉద్యమంగా • నిర్మింపబడుతుంది. జనాభాలో సగపాలుగా వున్న స్త్రీలు, ప్రజాతంత్ర ప్రభుత్వ స్థాపనలో ఫలవంతమైన పాత్రను నిర్వహించగల్గుతారు.

## అస్పృశ్యులు

మన ప్రజలలో అందరికన్నా దోపిడీకి గురియౌతూ, అట్టడుగున అణచివేయబడియున్న ఆరుకోట్లమంది అస్పృశ్యులు ప్రజాతంత్ర విప్లవపోరాటానికి గొప్పరిజర్వుసైన్యం. పైకులాలకు చెందిన నాయకులచేత నడుపపడే కాంగ్రెసు ఎప్పుడూ అంటరానివారి కోర్కెలను త్రోసివేస్తూవచ్చింది. సాంఘిక ఆర్థిక స్వాతంత్ర్యంకొరకు వారు జరిపేపోరాటాలను జాతీయ స్వాతంత్ర్యపోరాటంలో లీనంగాకుండా అడ్డుకుంటూవచ్చింది. ఇందువల్ల వారికులానికే చెందిన మితవాద నాయకులకు, అంబేద్కరులాంటి వాళ్లకు అస్పృశ్యులను జాతీయ ప్రజాతంత్ర వుద్యమంనుంచి దూరంగా అట్టి పెట్టడానికి సామ్రాజ్యవాదంమీద ఆధారంపడటంమూలానే వారిపరిస్థితి చక్కబడగలదనే భ్రమలను కలిగించడానికి వీలుగలిగింది.

ఈలాంటి వైఖరియొక్క దివాలాకోరుతనం రుజువు అయిపోయింది. డాక్టర్ అంబేద్కరు, యధునాధమండల్ లాంటి నాయకులు ఇండియన్‌యూనియన్ పాకీస్తానులలో మంత్రులై పాలకవర్గంవారితో కలసిపోయినారు. వారిపై గుడ్డి విశ్వాసంతో వున్న అస్పృశ్య ప్రజాసామాన్యం మామూలుగానే సాంఘిక అవమానాలకు, ఆర్థికదోపిడీకి గురియౌతున్నారు. ఇండియన్‌యూనియన్ పాకీస్థానుల బూర్జువానాయకత్వాలుమాత్రం అస్పృశ్యులకు సమాన అంతస్థునిచ్చే

కాగితపు చట్టాలను చేయడం తప్ప చేసిందేమీ లేదు.

అస్పృశ్యులకు కాంగ్రెసు నాయకులూ, వారి నాయకులుగూడా ద్రోహం చేశారు. వారికి విముక్తి సామ్రాజ్యవాదంమీద ఆధారపడినా, లేక బూర్జువావర్గంమీద ఆధారపడినా రాదని జరిగిన సంఘటనలన్నీ ఋజువుచేశాయి. అన్నివిధాల దోపిడికి వ్యతిరేకంగా, కష్టజీవులైన ప్రజలంతా చేరి ఐక్యంగాపోరాడితేనే వారికి ముక్తి కలుగుతుంది.

ఇటీవల కొన్ని సంవత్సరాలుగా పట్టణాల్లోను పల్లెల్లోనుగూడా, అస్పృశ్యులు సాంఘిక వివక్షతలకు రోజు రోజుకు అధ్వాన్నమౌతున్న జీవితపరిస్థితులకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన పోరాటాలు చేశారు. సంక్షోభం తాకిడివల్ల బొంబాయి నాగపూరు మొదలైన కేంద్రాల్లో అంటరాని కులాలకుచెందిన కార్మికులు, కార్మికవర్గం యొక్క సమిష్టి పోరాటాల్లోకి ఎక్కువగా వస్తున్నారు. ట్రేడ్ యూనియన్లలో ఎక్కువగా చేరుతున్నారు. వారిలో రాజకీయచైతన్యం ఎక్కువగా అభివృద్ధి చెందుతూంది.

ఈ పరిణామం ఎక్కువ త్వరగా జరిగేటట్లు దోహదమివ్వాలి. వీరిని ప్రజాతంత్ర సంఘటనలోకి ఆకర్షించాలి. వీరికి పై కులాల కార్మికుల కర్షకులకు మధ్యనున్న కులపుకట్టుబాట్లను తెంచివేసి అన్నికులాల ప్రజాసామాన్యమూ, అందరికీ సమానంగా శత్రువులైనవారికి వ్యతిరేకంగా ఏకమై పోరాడేటట్లు చెయ్యాలి. ఇవి పార్టీ నిర్వహించవలసిన కర్తవ్యాలు. ఈ కర్తవ్యాలను నెరవేర్చడానికి పైకులాలకుచెందినబూర్జువాలకూ, వారి కులంలోని మితవాదులూ, సెపరేటిస్టులూ (మిగిలిన కులాలతో

ఉద్యమాలతో కలవరాదని వాదించేవారు) ఐన నాయకులకు వ్యతిరేకంగా పట్టువిడవకుండా నిరంతర పోరాటం సాగించాలి. ఈ నాయకుల పలుకుబడినుంచి అస్పృశ్య ప్రజాసామాన్యాన్ని తప్పించాలి. వారు యితర పీడిత ప్రజాసామాన్యంతో చేతులు కలిపినప్పుడే ప్రజాతంత్ర విప్లవం జయంపొందినప్పుడే వీరు అనుభవించే సాంఘిక అవమానాలు, బానిసత్వం తొలగిపోతాయని అస్పృశ్యుల కందరికీ నచ్చచెప్పాలి. అస్పృశ్యులకు వ్యతిరేకమైన వివక్షతలన్నీ బూర్జువావర్గం ప్రజాసామాన్యాన్ని చీలగొట్టియుంచే ప్రయత్నమని ఖండించాలి. వారి న్యాయమైన ప్రతికోర్కెలకూ, ప్రజయొక్క హక్కులకొరకు జరిగే సమిష్టి పోరాటంలో భాగంగాయెంచి పోరాడాలి.

## అల్పసంఖ్యాకులు

శ్రామికవర్గమూ కమ్యూనిస్టుపార్టీలు గనక అల్పసంఖ్యాకుల్ని పీడించేవారిని ఓడించి, వారి రక్షణసమస్యను, పరిష్కరించలేకపోతే అడుగడుక్కు ప్రజాతంత్ర సంఘటన విచ్ఛిన్నం అవుతుంద. ఇండియన్ యూనియన్ ముస్లిం అల్పసంఖ్యాకుల్ని హిందూ మతోన్మాదులు వేటాడుతున్నారు.

శ్రామికవర్గం, జరిపే వర్గపోరాటాలకి, ప్రజాతంత్ర రాజ్యాంగంకోసం చేసే పోరాటాలకు అల్పసంఖ్యాకుల సమస్య అతి ప్రధానసమస్య. ముస్లిములను వేటాడుతున్నది మతం కోసంగాదు. అది, ప్రజాతంత్ర విప్లవశక్తుల్ని విచ్ఛిన్నంచేసేందుకై విప్లవ వ్యతిరేకశక్తులు చేస్తున్నదాడులు. ప్రజాశక్తులను అంతర్యుద్ధంలోకి ఈడవటానికి చేస్తున్నపని. శ్రామికవర్గం రైతాంగము కలసి,సాగిస్తూవున్న ఉద్యమము చాలా

తీవ్రదశకుపోయిందనీ అంతర్యుద్ధానికి దారిచూపిస్తే తప్ప దానిని ఓడించటం సాధ్యంకాదని విప్లవవ్యతిరేకులు గుర్తించారు.

దీనిని తెలుసుకొని శ్రామికవర్గం, కమ్యూనిస్టుపార్టీలు హిందువులలోను ముస్లిములలోనుగల మత దురహంకారులను వ్యతిరేకించి గట్టిగా నిలబడాలి. కలహాలురాకుండా నిరోధించాలి. అల్పసంఖ్యాకుల హక్కుల రక్షణకై జరిపే పోరాటం రాజకీయ, ఆర్థిక, స్వాతంత్ర్యసాధనకు సాగించే పోరాటంలో అంతర్భాగంగా నడిపించాలి. అల్పసంఖ్యాకుల హక్కులను రక్షించాలని; వారి జీవితాలకు విజ్ఞానానికీ భాషకు రక్షణ ఇవ్వాలనీ, ప్రభుత్వోద్యోగాలలో హెచ్చుతగ్గులు చూపించనీయరాదనీ, ఇష్టంవచ్చిన మతాన్ని అనుసరించే హక్కువున్నదనీ, మిగిలినవర్గాల వారందరిలో దృఢమైన పట్టుదల గలిగేలాగా శ్రామికవర్గం, కమ్యూనిస్టుపార్టీ పనిచెయ్యాలి. దానిని ప్రజలు సాగించే ప్రజాతంత్ర పోరాటంలో భాగంగా గుర్తింపచేయాలి. లేకుండే రాజీ బేరగాళ్లను ఓడించలేము. ప్రజాతంత్ర పోరాటం విజయంపొందదు.

అందుచేత శ్రామికవర్గ అల్పసంఖ్యాకుల హక్కులకై పట్టుదలగా పోరాడాలి. హిందూమహాసభ, ముస్లింలీగు, ఆర్. యస్. యస్. వంటి మత సంస్థలను ఎదుర్కోవాలి. కాంగ్రెసునాయకులు సర్దార్ పటేలువంటి జాతీయ ప్రభుత్వమంత్రులు అవలంబిస్తున్న మతోన్మాద విధానాలను ఎదుర్కొని పోరాడాలి.

# యుద్ధ ప్రమాదం

జాతీయ ప్రభుత్వంలోని కొందరు సభ్యులు, మతోన్మాదులు యుద్ధప్రచారం చేస్తున్నారు. ఇండియన్ యూనియన్ పాకిస్తాన్ పరస్పర శత్రువులుగా వుండిపోవాలని సామ్రాజ్యవాదుల యుద్దేశ్యం. అలావుంటే ఏభాగంలో విప్లవోద్యమము తలఎత్తే సూచన కనిపించినా రెండిటిమధ్యా యుద్ధం కల్పించి విప్లవాన్ని పెడదారికి ఈడ్చి అణచివేయడానికి రెండు ప్రభుత్వాలను తమ చేతులలో పూర్తిగా అదిమిపట్టుకోడానికి వీలుచిక్కుతుందని సామ్రాజ్యవాదులు ఈఎత్తు ఎత్తారు.

ఈ యుద్ధప్రచారాన్ని మనం ఎదుర్కోవాలి. రెండు రాజ్యాంగాలలోవున్న పీడిత ప్రజాసామాన్యంయొక్క పోరాటం అంతా ఒక్కటేనని, అది అవిభాజ్యం అని స్పష్టపరచాలి. పరస్పరం స్నేహసంబంధాలు ఏర్పరుచుకొని ఒకరికొకరు తోడ్పడేటట్లు ప్రతిజ్ఞ తీసుకోవాలి. మనం, మనలను పీడించి, పీక్కుతినేవారిని ప్రతిఘటించడంలోను, మన అందరికీ శత్రువైన బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోడంలోను కలసి పోరాడాలి.

కార్మికవర్గం, ఆ వర్గంయొక్క పార్టీఐన కమ్యూనిస్టు పార్టీ ఎంతో మెలకువతో వ్యవహరించాలి. రెండు రాజ్యాంగాలమధ్య యుద్ధం తేవాలని సామ్రాజ్యవాదుల ఎత్తుగడలో బూర్జువావర్గం వెనుక ఈడిగలబడకుండా జాగర్త తీసుకోవాలి. ఈనాడు యుద్ధంచేస్తామనే నేరం బెదరింపులు రాజకీయపు ఎత్తులలో ఒక భాగం మాత్రమేనని తెలుసు

కోవాలి. ప్రభుత్వాలకు, ప్రజాబలం సంపాదించడమే వాని వుద్దేశ్యం. కానీ అదేసమయంలో కాశ్మీరుసమస్య వంటివి నిజంగా, ఘర్షణను కలిగిస్తూ తలలెత్తుతున్నాయి. సామ్రాజ్య వాదులు సృష్టిస్తున్న ఈమాదిరి సమస్యలు ఏరోజునైనా దారి తీయవచ్చు యుద్ధానికి.

ఈసమస్యపై శ్రామికవర్గం, విస్పష్టమైన దృక్పథం తీసుకొని పని చెయ్యాలి. రెండు రాజ్యాంగాల సరిహద్దులలో వున్న సంస్థానాలకోసం జరుగుతూన్న పోరాటం ప్రదేశ విస్తరణకు మాత్రమే జరుగుతుంది. రెండు వైపులాగూడా, అంతకంటే అభివృద్ధికరమైన దృక్పథం లేనేలేదు. ఈప్రదేశ విస్తరణ వాంఛయే రెండు రాజ్యాంగాలలోవున్న శ్రామికులూ సమ్మతించరాదు. ఆరెండువేపులా వీరు స్వయం నిర్ణయాధికారాన్ని గాని జమీందారీయుగపరిపాలననుండి ప్రజలు రైతాంగ విముక్తికి గాని ఆమోదించడంలేదు.

ఈ సమస్యమీదగాని, మరి ఏ ఇతర సమస్య మీద గాని, యుద్ధం వస్తే, రెండు వైపులావున్న ప్రజాతంత్ర వుద్యమాలను జతపరచడానికి శ్రామికవర్గమూ ప్రజలు పూనుకోవాలి. సామ్రాజ్యవాదంతోను తమసందరినీ పీక్కుతినే భూస్వాములతోను, పెట్టుబడిదారులతోను పోగాడటంవలన కార్మికులకు, సామాన్యప్రజలకు లాభం వుంటుందిగాని పీడించే వారితో చేరి ఒకరినొకరు చంపుకోడంవలన లాభంలేదని ప్రకటించాలి. ఆవిధంగా పోరాడితే సామ్రాజ్యవాదుల జమీందారుల, పెట్టుబడిదారులచేతిలో దాస్యం స్థిరపడటం మాత్రం జరుగుతుంది. రెండుప్రాంతాలలోను ప్రజాసామాన్యం

సాగించే పోరాటాలను ఓడించటానికే ఈ యుద్ధాలను రెచ్చగొడుతారు.

ప్రజావిజృంభణను అరికట్టటందుకై విప్లవ వ్యతిరేకులకు మత కలహాలు చెలరేగడం అవసరం. రెండు రాజ్యాంగాలలోనువున్న మతోన్మాదులు కుట్రనుచేసి అంతకంతకు కలహాలను రేపుతారు. ప్రజాసామాన్యాన్ని ఏకంచేసి ప్రజాశత్రువులను బయటపెట్టి ప్రతిరాష్ట్రంలోను ప్రతిపట్టణంలోను, నిశ్శంకంగా కలహాలను అణచివేయాలి. వర్గపోరాటాలలో, కార్మిక కర్షక పోరాటాలలో, కార్మిక సంఘాలలో, కిసాన్‌సభలలో సమకూర్చిన మైత్రిబంధ పీడిత ప్రజలమధ్య ఐక్యతను ప్రదర్శిస్తూ పార్టీ పాక్షిక పోరాటాలను నడిపిన పుడు మరింతగా ధృడపడుతుంది.

## స్వయం నిర్ణయాధికారంకొరకు పోరాడాలి

కాంగ్రెసునాయకత్వం, రాజీవిధానం అవలంబించడం ఫలితంగానూ, స్వయం నిర్ణయాధికారాన్ని వ్యతిరేకించడం ఫలితంగానూ, వినాశకరమయిన దేశవిభజన తటస్థపడ్డది. ఇండియన్‌యూనియన్‌లోగూడా, బూర్జువావర్గస్వార్థాల కోసం అదే తప్పు మళ్ళీచేస్తున్నారు. మహారాష్ట్రులు కేరళులు తమిళులు మొదలయిన, ప్రత్యేక జాతులకు స్వయంనిర్ణయాధికారం అంగీకరించ నిరాకరిస్తున్నారు.

అలా నిరాకరించడంవలన ఇండియన్ యూనియన్‌లోని వేరు వేరు జాతులమధ్య శతృత్వం వృద్ధిపొందుతుంది. వారిలో వచ్చే అసంతృప్తిని అభివృద్ధి నిరోధకులు ఉపయోగించుకుంటున్నారు. ప్రజాతంత్ర ఉద్యమాభివృద్ధికోసమై పార్టీ

అన్నిజాతులవారికీ స్వయంనిర్ణయాధికార హక్కులను బలపర చాలి. రాజ్యాంగచట్టంలో అదొక భాగంగా చెయ్యాలని ఆందోళన చెయ్యాలి. పార్టీ ఈ విషయంలో శ్రద్ధతీసుకోక పోతే మతోన్మాదులు అవకాశం తీసుకొని తప్పుదారి తీస్తారు.

## విదేశాంగనీతి

భారత విప్లవాన్ని అణిచేందుకు సామ్రాజ్యవాదులతో పొత్తుకలసి బ్రిటిష్ అమెరికన్ సామ్రాజ్యవాదుల వద్దనుంచి ఆర్థికంగానూ, సైనికంగానూ సహాయం పొందడానికి తహతహ లాడుతూ, వారి దయాధర్మ భిక్షంగా హిందూమహాసముద్ర ప్రాంతాలలో మార్కెట్లు సంపాదించాలని ఆశపడుతూవున్న భారత బూర్జువావర్గం అంతకంతకూ ఈదేశాలలో విప్లవాన్ని అణచడానికి సామ్రాజ్యవాదులు వేసే ప్లానులలో భాగస్వామి యౌతున్నది.

భారత ప్రజలు, ప్రజాతంత్రము సోషలిజముల కొరకు యేర్పడ్డశిబిరంతో సానుభూతి కలిగివున్నారు. ఇండోనేషియా వియట్నాం పోరాటాలను బలపరుస్తున్నారు. అందువలన కాంగ్రెసు నాయకత్వం ప్రపంచ రాజకీయరంగంలో ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదానికి అనుచరులైపోయినప్పటికీ ఆవిషయాన్ని రెండు పరస్పర వ్యతిరేక శిబిరాలమధ్య తాము తటస్థమార్గం అనుసరించామని చెప్పి తమ ప్రయోజనాలను సాధించుకొనేందుకు నగ్నమైన అవకాశంమీద మార్గాన్నను సరిస్తున్నారు.

అయితే స్వాతంత్ర్యంకొరకు పోరాడే శిబిరానికీ, సామ్రాజ్యవాద శిబిరానికీ మధ్య జరిగే ప్రపంచ విశాలమైన

పోరాటంలో తటస్థత అన్నేది లేదనీ, ఈతటస్థత ఇండియాలో దోపిడి చేసేవారికి, దోపిడి చేయబడేవారికి మధ్య తటస్థత వహించడం లాంటి దేనని దాపరికం లేకండా ధైర్యంగా ప్రకటించాలి.

ప్రజలు సామ్రాజ్యవాదాన్ని తీవ్రంగా అసహ్యించుకొంటున్నారనే విషయాం గుర్తించి కమ్యూనిస్టుపార్టీ జాతీయ ప్రభుత్వంయొక్క అంతర్జాతీయవిధానాలలోని ప్రతి విద్రోహ చర్యను నిర్దాక్షిణ్యంగా దుయ్యబట్టాలి. ప్రతిదేశం యొక్క ప్రజాతంత్ర పోరాటాలను ఆశయాలను బలపర్చేటట్లు భారత ప్రజానీకాన్ని సమీకరించడానికి ప్రతి అవకాశాన్ని వినియోగించుకోవాలి.

బూర్జువా రాజనీతిజ్ఞులూ,. సోషలిస్టులూ చేసే సోవియట్ వ్యతిరేక విషప్రచారాన్ని ప్రతిఘటించాలి. ప్రపంచ మానవకోటి స్వతంత్రంకొరకు, ప్రజాతంత్రంకొరకు, సోషలిజంకొరకు, శాశ్వత శాంతికొరకు జరిపే పోరాటంలో సోవియట్ యూనియన్ యొక్క నాయకత్వం విశేషంగా ప్రచారం చెయ్యాలి.

చైనా విప్లవం సాధించిన మహత్కార్యాలు దాని అంతర్జాతీయ ప్రాముఖ్యతా నేరుగా ఆశియాప్రజలకు ఎంత ముఖ్యమైనదో ప్రచారంచెయ్యాలి

ఎడతెగని ప్రచారంద్వారా సానుభూతి సహకార, ప్రదర్శనాలద్వారా సామ్రాజ్యవాదం ఇండోనిషియా,. వియట్నాం విప్లవాలను, అణచివేసే రాజకీయ ప్రయత్నాలను, మిలటరీ చర్యలను భగ్నంచేసేందుకు ప్రత్యేక కృషి చెయ్యాలి.

ఆగ్నేయ ఆసియా దేశాలను తిరిగి తమ వానిసత్వం క్రిం దకు తెచ్చుకోడానికి బ్రిటిషు ఫ్రెంచి డచ్చిసామ్రాజ్యవాద నాయకత్వానికి, ఆసియా రక్షణకూటమిని ఏర్పాటుచేస్తున్నా రని ఆ దుష్టకూటంలో ఇండియా ప్రధానపాత్రయనీ, నిర్దా క్షిణ్యంగా వెల్లడిచేస్తూ పెద్దప్రచారం చెయ్యాలి.

జాతీయ, నాయకులు అవలంబిస్తున్న విధానంఎడల ప్రజలలో త్వర, త్వరగా భ్రమలు వొదిలిపోతున్నాయి. వారి విధానాలు ప్రజాసమస్యలు వేటినీ పరిష్కరించలేవు. పెట్టుబడి దారుల పద్ధతులపై నడిస్తే మనదేశం, పారిశ్రామికంగా, అభి వృద్ధిపొందే అవకాశాలులేవు. వలసదేశాలులో వుండే పరి స్థితులు, ఆదశా తప్పదు. వారి విధానాలు ఇండియా ప్రజలు దారిద్ర్యాన్నీ దుర్దశనూ పెంచుతాయి.

మనదేశంలో ప్రజాఉద్యమము పురిగొంటున్న దశలో నేటి దారిద్ర్యానికి విరుద్ధంగా పాక్షికకరమైన రాజకీయ పోరా టాలు నడిపించడంలో ప్రాముఖ్యత, వీనివల్ల ప్రజాతంత్ర ఉద్యమం, పరిపక్వమౌతుంది. ఈమాదిరి ప్రతిపోరాటానికి, వీలయినంత అధికంగా ప్రజాబలం సంపాదించేటందుకై, పార్టీ పనిచేయాలి. దేశంలోని అన్నితరగతుల ప్రజల పరిస్థితులు, ఈదు స్థితికి చిక్కి క్షీణించుతున్న కొలదీ, మన ఆర్థిక విధా నానికి ధనిక స్వార్థపరులే ప్రధాన శత్రువులని, ప్రజలంతా గుర్తించేలాగ చేయగలమని విశ్వాసంతో పనిచెయ్యాలి.

విప్లవ విజృంభణను అరికట్టేందుకై బూర్జువా వర్గా నికి బ్రిటిష్ అమెరికన్ సామ్రాజ్యవాదులకూ, సహకారం వర్పరచాలనీ సామ్రాజ్యవాదులూ, వారి అనుచరులూ

ప్రయత్నిస్తున్నారు. ప్రజాశక్తుల్ని విచ్ఛిన్నం చేయగలరనీ, ప్రజానీకంలో హెచ్చుమందిని ఏమిచేయాలో, తోచకండా చేసి, మిగతావారిని అణచివేయగలరనీ, వారు బూర్జువా వర్గంమీద ఆశలు పెట్టుకొని వున్నారు. కలహాలద్వారా వారి ఏజంట్లు అపుడే దారి సరిచేయటం ప్రారంభించారు.

ఈ దశలో కమ్యూనిస్టుపార్టీ శ్రామికవర్గం సరియైన విధానం అవలంబించడంమీద ప్రజాతంత్ర వుద్యమంయొక్క భవిష్యత్ ఆధారపడి వుంటుంది. ప్రజాతంత్ర శక్తుల మహత్తరబలాన్ని బూర్జువావర్గంమీద, ప్రజానీకం పెద్ద భ్రమలు పెట్టుకోడంలోగల బలహీనతను గుర్తించాలి. శ్రామికవర్గంయొక్క పార్టీయైన కమ్యూనిస్టుపార్టీ నిర్వహించవలసిన బాధ్యతలు ఇవి: ప్రజాతంత్ర సంఘటనద్వారా బలం కూర్చాలి. రాజీవాదులగుట్టు బట్టబయలుచేసి, ప్రజలకుగల భ్రమలను పోగొట్టాలి. ప్రజాతంత్ర వుద్యమముయొక్క కార్యక్రమం ఆధారంగా పోరాటాన్ని ముందుకు తీసికొని పోవాలి.

కమ్యూనిస్టుపార్టీ, జాతీయబూర్జువానాయకత్వంయొక్క విధానాల బూటకత్వాన్ని బట్టబయలు చేసినట్లే లక్షలాది ప్రజానీకంలో ఉన్న భ్రమలు తొలగిపోతాయి. అందువల్ల ప్రజాతంత్రసంఘటన పెరిగి బలపడి బూర్జువా విధానాలను ఓడించ గలుగుతుంది.

ప్రజాతంత్రప్రభుత్వస్థాపన కవసరమైన పరిస్థితులను కల్పించ గలుగుతుంది. ఈ నూతన ప్రజాతంత్ర ప్రభుత్వం, ప్రజాతంత్ర ఉద్యమముయొక్క కార్యక్రమము నంతటినీ సంపూర్ణంగా అమలు జరుపుతూ, అదేసమయంలో మధ్య మరో

పెట్టుబడిదారీదశ అవసరం లేకండా సోషలిస్టు నిర్మాణానికి సాగిపోవడానికి ఒక సాధనంగా వుంటుంది.

ప్రస్తుత ప్రపంచ సంక్షోభదశలో ప్రజాతంత్ర ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయే బాధ్యత కార్మికవర్గానిదీ, కార్మికవర్గ పార్టీయైన కమ్యూనిస్టు పార్టీదీను. సామ్రాజ్యవాద ఫ్యూడల్ కూటమిసామ్రాజ్యవాదులతో పొత్తుకలసిన బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా, సామ్రాజ్య వ్యతిరేక ప్రజానీకంతరఫున నిలువబడిన కార్మికవర్గంయొక్క స్వతంత్ర పాత్రకార్యాచరణలే ప్రజాతంత్ర ఉద్యమాన్ని జయప్రదం చేయగలవు.

కార్మికవర్గం ఈ పాత్రను నిర్వహించాలంటే తన అగ్రశ్రేణీ సైన్యమైన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద, అంతకంత కెక్కువగా ఐక్యతకావాలి. కమ్యూనిస్టుపార్టీ ప్రజతంత్ర సంఘటనలోకి ప్రజలనందరినీ, నిజమైన ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నిర్మించేందుకు విశాల ప్రజాసామ్రాజ్యాన్ని కార్యరంగంలోకి దించాలి.

కార్మికవర్గపార్టీ, తన భుజస్కందాలపైనున్న మహత్తర బాధ్యతలను నిర్వర్తించ గలిగించేటందుకు ప్రజామాన్యంలో వేరులు పాతుకుపోయిన నిజమైన ప్రజాపార్టీ కావాలి. కాబట్టి కార్మికులలో రైతులలో విద్యార్థులలో అన్ని తరగతులలోను యువకులలో, తనకున్న పునాదిని విస్తరింప చేసుకోవడం, ఇవర కెప్పటికన్నా ఇపుడు అవుసరమెక్కువ. అన్నిరంగాలనుంచీ, అన్ని దేశాలనుంచీ పోరాడే వారి నందరినీ ఆకర్షించాలి దైనందిన పాక్షిక పోరాటాలలో ముందుకొచ్చి తీరాలి చిత్తశుద్ధి కలిగిన విప్లవవాదులందరినీ పార్టీలోకి ఆకర్షించి

ారు ప్రజలను విజ్ఞానవంతులను, చైతన్య వంతులనుచేసి సం గ్రార్ణ స్వాతంత్ర్యం, ప్రజాతంత్రి సోషలిజం, వైపుకి నడుప లిగిన నాయకులుగా తయారు గావడానికి అవసరమైన మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞాన మివ్వాలి.

ఎక్కువ ముఖ్యమైన విషయమేమంటే కార్మిక వర్గంలోనుంచి మిలిటెంట్లను పార్టీలో చేర్చుకొని సిద్ధాంత పరిజ్ఞాన మివ్వాలి. పార్టీలోని కార్మిక సభ్యులలో అభివృద్ధియై ముందుకొస్తున్న "కేడర్ల"ను పార్టీలో బాధ్యతగల స్థానాలకు నియమిస్తూ, మన పార్టీలో పార్టీ నాయకత్వంలో, శ్రామికవర్గ స్వభావాన్ని పెంపొందించాలి. ఈ విషయంలో ప్రత్యేకమైనశ్రద్ధ వహించితేనేతప్ప ముఖ్యంగా అలాంటికి కేడర్లకు మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞాన మివ్వడమూ, ఆ సిద్ధాంత పరిజ్ఞానాన్ని భారతవిప్లవ సమస్యల కన్వయింపచేయడంలో నైపుణ్యం కలిగేటట్లు ప్రత్యేక శ్రద్ధ వహిస్తే నేతప్ప కమ్యూనిస్టుపార్టీ బలమైన, ఉక్కు శిక్షణ కలిగిన ప్రజాపార్టీగా వృద్ధిపొందదు. మార్క్సిజం, లెనినిజంలో, పూర్తిగా తర్ఫీదుపొంది చైతన్యయుతమైన సభ్యత్వం కలిగిన ప్రజాపార్టీగా, కమ్యూనిస్టుపార్టీని నిర్మించాలి. ఇది మనం నిత్యజాగృతిలో పెట్టుకోనవలసినలక్ష్యం.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B107 |
| పుస్తకం పేరు | భారత కమ్యూనిస్టు పార్టీ రాజకీయ విధానం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 215 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 212 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munishaa |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |